# చతుర

నవంబరు 2013
రూ. 12/-

# గుండీలతో... కళాఖండాలు!

దూరానికి దృఢంగా కన్పించే ఈ కళా రూపాలను దగ్గరగా చూస్తే ఆశ్చర్యంలో మునిగిపోతాం. మియామీకి చెందిన అగస్టో ఎస్క్వివెల్ బొత్తాలను కళాత్మకంగా అమర్చి, ఇలాంటి వివిధ ఆకృతులను రూపొందించాడు. సాదాసీదా వస్తువులతో కళాఖండాలను రూపొందించడానికి కావాల్సిందల్లా కూసింత సృజనే అంటున్నాడాయన.



వారెవ్వా!













# చతుర

సంపుటి -36 సంచిక - 10
430వ సంచిక, పేజీలు : 132
నవంబరు 2013



'సినిమా హాల్లో గట్టిగా ఫోన్‌లో మాట్లాడటం మేనర్స్ కాదండి' అన్నాడు జితేంద్ర. 'మేనర్స్ గురించి మాట్లాడేవాడివి గాళ్‌ఫ్రెండ్‌తో సినిమాకు రావచ్చా? సర్లే, నీ గాళ్ ఫ్రెండ్‌ని మా దగ్గరికి పంపిస్తే, మా సెల్‌ఫోన్లను నీకిచ్చేస్తాం.. ఓకేనా?' అన్నాడో కుర్రాడు అసభ్యంగా. దాంతో మాటామాట పెరిగింది. ఘర్షణ చోటుచేసుకుంది. ఒకర్నొకరు తోసుకోసాగారు. 'ఈ మధ్య గాళ్‌ఫ్రెండ్‌తో సినిమాలకు రావడం, హీరోల్లా గొడవపడ్డం ఎక్కువయిందండీ. టీవీవాళ్లకో ఫోన్ కొట్టండి.. వీళ్ల భాగోతాన్ని బట్టబయలు చేస్తారు' అన్నారెవరో. 'ఛానల్‌వాళ్ల నంబర్ నా దగ్గరుంది. ఇపుడే చేస్తాను' అంటూ ఫోన్ చేశారు మరొకరు. క్షణాల్లో ఛానల్‌వాళ్లు కెమెరాలతో దిగేశారు.

తర్వాతేమైంది?
ఆ ప్రేమజంట టీవీ ఛానల్ కెమెరాకు చిక్కిందా?
ఆద్యంతం ఉత్కంఠగా చదివించే **కాశీ విశ్వనాథ్** నవల **దత్తతకో తండ్రి!** 6వ పేజీలో...

బొమ్మలు: ఆనంద్

'ఏంటి ఏదో పెళ్లి సంబంధం గురించి మాట్లాడుతున్నారు?'

'ఔను మనమ్మాయికే!'

'అదేంటి? మొన్న ఆ జితేంద్రకి కొంత టైమిచ్చారు.
మళ్లీ ఇలా చేస్తే మనం మోసం చేశామంటారేమో?'

'ఎవరు ఎవర్ని మోసం చేశారు? ఆడిన మాట మీద నిలబడ్డానికి నేను హరిశ్చంద్రుణ్ణి కాను.. ఆడపిల్ల తండ్రిని. శోభ మనకి చెప్పకుండా ఆ త్రాష్టుడితో ప్రేమలో పడటం మోసం కాదా?' భార్యను నిలదీశాడు రామదాసు.

ఇంతకీ రామదాసు కూతురి పెళ్లి ఏమయింది? అతని ఎత్తులు ఫలించాయా? అతని కూతురి పంతం నెగ్గిందా?

ఆద్యంతం ఉత్కంఠగా చదివించే
కాశీ విశ్వనాథ్ నవల **దత్తతకో తండ్రి!**
ఈ నెల చతుర కానుక!

# దత్తతకో తండ్రి!

- కాశీ విశ్వనాథ్

ఈ రాష్ట్రంలో ఓ నగరం!

ఆ నగరంలో ఓ కొండ!

దాని మీదనించి గతంలో చాలామంది పక్కనున్న లోయలోకి దూకి ఆత్మహత్యలు చేసుకున్నారు. కాబట్టి దానికి 'ఆత్మహత్యల కొండ' అనే పేరొచ్చింది.

ఉదయం తొమ్మిది గంటలు దాటింది. సాధారణంగా ఆ ప్రాంతంలో ఎప్పుడూ జనసంచారం లేనట్టే ఆ రోజూ లేదు. కొండకి కాస్తంత దూరంలో సముద్రం ఉంది. సముద్రంలోని కెరటాలు ఎన్నివేల సంవత్సరాలనించి ఆవేశంగా ముందుకు వచ్చి, మళ్లీ ఆలోచించుకుని వెనక్కి పోతు న్నాయో తెలీదుగానీ, ఆ రోజూ అలలన్నీ ఆ పనిమీదే ఉన్నాయి. పడిలేచిన కెర టాల్ని పసిబిడ్డల్లా గుండెల్లో దాచుకున్న సముద్రం అప్పుడే ఎర్రబడుతున్న ఎండవె లుగులో కరుగుతున్న వెండిలా ధగధగలా డిపోతోంది.

అదే సమయంలో...

ఆ కొండ మీదకి ఓ యువకుడు ఎక్కు తున్నాడు. అతడి పేరు జితేంద్ర! ఇరవైనా లుగు సంవత్సరాలకంటే ఎక్కువ వయ సుండని అతని ఒంటిమీద రక్తంతో తడి సిన తెల్లచొక్కా, ముఖంమీద, చేతులమీద గాయాలున్నాయి. క్షతగాత్రుడయిన జితేంద్ర ముఖంలో అతను తీసుకున్న దృఢ నిర్ణయం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. కొండ ఎక్కేవారికి స్పష్టంగా కనబడేలా ప్రభుత్వంవారు ఓ బోర్డు ఏర్పాటు చే సారు. దానిమీద కొన్ని వాక్యాలున్నాయి.

"ఆత్మహత్య మహాపాపం. జీవితం జీవించడానికే! ఆవేశం తగ్గించి ఆలోచించు కుంటే, నిండు నూరేళ్ల జీవితం మీ చేతిలో ఉంటుంది! మానవ జీవితం మహోత్కృష్ట మయింది"

ఈ వాక్యాలు చదివి, వాటితో తనకి పని లేనట్టుగా తన నడకని కొనసాగించాడు జితేంద్ర.

"మానవ జీవితం నవరసభరితం. అయినా ఏ మనిషి జీవితంలోనూ అన్నీ రసవత్తర ఘట్టాలే ఉండవు. సుఖాలు, దుఃఖాలు, లాభాలు, నష్టాలు, త్యాగాలు, ద్రోహాలు, సంయోగాలు, వియోగాలు వీట న్నింటి సమ్మిశ్ర స్వరూపమే జీవితం" ఇలాంటి మాటలు విన్నవారు, ఎక్కడో చదివినవారు సైతం ఆత్మహత్య చేస్కోవా లనే ఓ బలమైన నిర్ణయానికి వచ్చినప్పుడు బతకడానికి వర్తించే ఈ మాటల్ని మర్చి పోయి జీవితాన్ని అంతం చేస్కోవాలనే ఆలోచిస్తారు. కాబట్టి ఇన్నేళ్లలో ఆ కొండ మీదనించి దూకేవారెవర్నీ ఆ బోర్డు ఆప లేకపోయింది.

జితేంద్ర ఒకవైపునించి ఆత్మహత్య చేసు కోవాలనే ఏకైక ధ్యేయంతో కొండ ఎక్కు తుంటే... అదే కొండకి మరోవైపునించి మరోవ్యక్తి కూడా అదే ధ్యేయంతో, అదే నిశ్చయంతో ఎక్కుతున్నాడు. ఆయన పేరు మాధవరావు. ఆయనకు అరవై ఏళ్ల వయసు. కాలం చేతిలో కసిగా నలిగిపో యిన కాగితంలా కనిపిస్తున్నాడాయన.

ఇద్దరూ పర్వత శిఖరం మీదకి చేరుకు న్నారు. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకు న్నారు. ఇద్దరి మధ్య కొన్ని గజాల దూరం ఉంది. కానీ ఇద్దరి ఆలోచనల మధ్య అరంగుళం కూడా దూరం లేదు.

'ఈ ముసలాడేంటి ఇక్కడికొచ్చాడు? నాలాగే ఆత్మహత్య చేసుకోవడానికే వచ్చాడా?' ఇదీ యువకుడి ఆలోచన.

'ఈ కుర్రాడు ఇంత చిన్న వయసులోనే ఆత్మహత్య చేసుకోవడానికే వచ్చాడా? ఆ ఉద్దేశ్యంతో కాకపోతే సరదాగా రావడానికి ఇది పిక్నిక్‌స్పాట్ కాదుగదా!'

ఇద్దరూ ఇలాంటి సంశయాలతోనే ఒక ర్నొకరు చూసీచూడనట్టు చూస్కుంటు న్నారు. మీదనున్న ఆకాశంవైపు కాసేపు

చూసారు. దూరంగా.. ప్రశాంత కెరటాలతో ఉన్న సముద్రాన్ని, దూరంగా ఉన్న రోడ్డమీద అప్పుడప్పుడు వెళ్తున్న వాహనాల్ని చూస్తూ గడిపారు. జితేంద్ర కొండ దిగి వెళ్లిపోతే, తన చావేదో తను చావాలని మాధవరావు అనుకున్నట్టే... జితేంద్ర కూడా అనుకుంటున్నాడు. ఇద్దరి ఆలోచనల్లో మార్పులేదు. కాలంలోనే మార్పుని సూచిస్తూ, ఓ ఇరవై నిమిషాలు ముందుకు జరిగాయి. మాధవరావు అతని దగ్గరికి వచ్చి కాస్త తెగించి అడిగాడు.

"ఏంటయ్యా, నువ్వు కుర్రాడివై ఉండి ఈ కొండమీదికొచ్చావు? "

జితేంద్రకి సమాధానం చెప్పాలనిపించకపోయినా "నా సమాధానం మీకు అవసరమా? " అన్నాడు ఎలాంటి భావావేశాన్ని వ్యక్తం కానివ్వకుండా.

"అన్ని అవసరాల్ని వదులుకున్నాకే ఎవరైనా ఈ కొండ మీదకొచ్చి ఆ లోయలో దూకుతారు. కానీ నువ్విక్కడ ఎంతసేపుంటావో తెల్సుకోవడం నాకు అవసరం అనిపించి అడిగాను"

"నేను అడగాలనుకుంటున్నదీ అదే"

ఆ సమాధానంతో మాధవరావు కొన్ని క్షణాలు ఆలోచనలో పడి "నీ పేరేంటి? " అడిగాడు.

"నా పేరుతో మీకేంపని? "

"ఇంకాస్సేపట్లో చావబోయే నాకు నీ పేరుతో పనేం ఉంటుంది? కాకపోతే నీ వయసు చాలా చిన్నది. జీవితంలో నువ్వు గడిపిన కాలం కంటే, గడపాల్సిన కాలమే ఎక్కువుంది. ఏ ఆవేశాలు నిన్ను జీవితం ముగింపువైపు పరుగు తీయించాయో తెలుసుకుందామని అడిగానంతే"

"తెలుసుకునేం చేస్తారు? "

మాధవరావు వెంటనే జవాబు చెప్పలేదు. జితేంద్ర మళ్లీ అన్నాడు. "నా సమస్య గురించి చెప్పినా మీరు పరిష్కరించలేరు. ఎందుకంటే, ఇంత జీవితాన్ని చూసిన మీరే మీ సమస్యని పరిష్కరించుకోలేక ఆత్మహత్యకి సిద్ధపడ్డారు. మీరు నాకెలా ఉపయోగపడతారు? "

మాధవరావు చిన్నగా నవ్వాడు. "మంచి ప్రశ్న వేసావు. నీలో జీవించాలనే కోరిక చచ్చినా, నీ తెలివితేటలు మాత్రం చావలేదు. నా పేరు మాధవరావు, నీ పేరేంటి? "

"జితేంద్ర" మెల్లగా గొణిగాడు.

"నా బతుకు నేను బతకలేక, నా చావు నేను చావాలని ఇక్కడకొచ్చినవాణ్ణి.. అదే ధ్యేయంతో వచ్చిన మరొకడికి నేనేం సహాయం చెయ్యగలననే సందేహం రావడం సహజమే కానీ, గుడ్డివాడి చేతిలోని దీపం వాడికి దారి చూపించడానికి పనికిరాకపోయినా... ఇక్కడో గుడ్డివాడున్నాడనే విషయాన్ని ఇతరులకి తెలియజేయడానికి పనికొస్తుంది. నా అనుభవం కూడా ఆ గుడ్డివాడి చేతిలోని దీపంలాంటిదే! నాకు ఉపయోగడపకపోయినా, నీకైనా ఉపయోగపడుతుందేమోనని నా ఉద్దేశ్యం"

పగ, ప్రతీకారాలు తీర్చుకోవడమే జీవిత ధ్యేయంగా భావించేవారి ఆవేశానికి ఆయుష్షు ఎక్కువుంటుంది. కానీ పరిస్థితుల ప్రాబల్యం వల్ల సమస్యలు మనసుని మండించి, మరిగించినప్పుడు కలిగే ఆవేశం కేవలం తాత్కాలికమే! ఉపశమనం కలిగించే ఉపకారుల మాటల్ని వింటున్న కొద్దీ ఆవేశం చల్లారిపోతుంది. క్రమంగా కరిగిపోతుంది. జితేంద్ర విషయంలో అదే జరిగింది. అతని పరిస్థితిని మాధవరావు అనుభవం అర్థం చేసుకుంది.

"ప్రతి మనిషికీ ఓ పేరున్నట్టే, ప్రతీ సమస్యకీ ఓ పరిష్కారం ఉంటుందనే నా నమ్మకం! నీ సమస్య గురించి చెప్పేవనుకో:... ఈ సీనియర్ సిటిజన్‌గాడి బుర్ర

కేదైనా పరిష్కారం తడితే చెప్తాడు. నాలాంటి కుర్రాడి సమస్యకి ఈ ముస లాడేం చేస్తాడని కొట్టిపారెయ్యకు. చంద మామ పత్రికలో వేసే కథలన్నీ పిల్లలకో సమే అయినా, వాటిని రాసేది మాత్రం పిల్లలు కాదు.. పెద్దవాళ్లే! ఒకవేళ నాలాగే నీదీ పరిష్కారం లేని సమస్య అనుకో.. ఈ కొండా ఇక్కడే ఉంటుంది. ఆ సము ద్రమూ అక్కడే ఉంటుంది. కాబట్టి, మనం కలిసి చావడానికేం అభ్యంతరం ఉండదు"

జితేంద్రకి మాధవరావు మీద ఎందుకో, తన అంతిమ క్షణాల్లో అనుకోకుండా కని పించిన ఆత్మీయుడిలా అనిపించి తన గురించి చెప్పడం ఆరంభించాడు.

★ ★ ★

కొంతమంది తమ పుట్టుకల్ని బట్టి గొప్పవాళ్లనిపించుకుంటారు. 'నేను ఫలానా గొప్పవాడికి పుట్టాను. ఆ వంశా నికో చరిత్ర ఉంది. కాబట్టి ఆ చరిత్రగల వంశానికి వారసుడిని, అందువల్ల నేను గొప్పవాణ్ణి' అని చెప్తారు వారు.

'నేను ఫలానా కులంలో పుట్టాను. అది అగ్రవర్ణంగా పరిగణించబడుతోంది. కాబట్టి ఆ కులంలో పుట్టిన నేనూ గొప్ప వాణ్ణి' ఇలా చెప్పుకునేవారూ ఉన్నారు.

'మా కులం సంగతి పక్కన పెట్టండి. నేను ఆగర్భ శ్రీమంతుణ్ణి! మంచివాడు మంచి పనులు చేసినా, చెడ్డవాడు చెడ్డప నులు చేసినా అన్ని పనులూ డబ్బుకోసమే అయినప్పుడు, ఈ లోకంలోని అన్ని సమ స్యలూ డబ్బుతోనే పరిష్కరించబడుతున్న ప్పుడు, ఆ డబ్బు అమితంగా ఉన్న నేనే గొప్పవాణ్ణి' అని భావించేవారూ అమితం గానే ఉన్నారు. ఇలా అనుకునేవాళ్లంతా తమ ప్రయత్నం లేకుండానే ఏర్పడిన జీవిత నేపథ్యాన్ని ఆలంబనం చేసుకుని తమ గొప్పతనాల్ని ప్రకటించుకుంటారు.

ఇలాంటివారి వ్యక్తిగత శక్తిసామర్థ్యాలు ఏపాటివి? అనే ప్రశ్న వేసుకుంటే.. అనేక సార్లు వచ్చిన సమాధానం చాలా నిరు త్సాహం కలిగిస్తుంది.

ఇంక రెండోవర్గంవారు తమకున్న ప్రతి భాపాటవాల్ని బట్టి ప్రసిద్ధులవుతారు. అంటే స్వయంకృషితో సామర్థ్యాన్ని పెంచు కుని తమకంటూ కొంత గుర్తింపుని, మరింత గౌరవాన్ని సంపాదించుకుం టారు.

కీర్తిసౌధానికున్న మెట్లల్లో ఓ నాలుగు మెట్లెక్కించి వారిని నలుగురికీ చూపించేది వారి స్వయం ప్రతిభే!

ఈ రెండో వర్గానికి చెందినవాడే జితేంద్ర!

ఈ శతాబ్దంలో వచ్చిన గొప్పమార్పుల్లో ఓ మార్పు.. మాటలకి అర్థాలు మారడం! గతంలో 'ఫలానా వ్యక్తి గొప్పవాడు' అని ఎవరైనా అంటే ఇతరులు అడిగే ప్రశ్నలు ఓ పద్ధతిలో ఉండేవి. 'ఆ వ్యక్తి విద్యా వేత్తా? రచయితా? గాయకుడా? చిత్రకా రుడా? నర్తకుడా?' అంటూ అనేక గొప్ప తనాలు ఆ ప్రశ్నల్లో ధ్వనించేవి. ఇప్పుడా పరిస్థితి మారింది. 'ఫలానా వ్యక్తి గొప్ప వాడు అనంటే... ఆ వ్యక్తి ఎంత డబ్బు సంపాదించాడు?' అనే ప్రశ్నే మొట్టమొ దట వినిపిస్తుంది.

మనిషికుండే ఏ గొప్పతనాన్నయినా రూపాయిల్లోకి మార్చి చూడ్డమే గత కొద్ది కాలంగా అలవాటయిపోయింది. ఈ అల వాటు ప్రకారం జితేంద్రని చూస్తే... అతనో సూక్ష్మజీవిగానే కనిపిస్తాడు.

అతను యూనివర్సిటీలో పోస్ట్‌గ్రాడ్యుయే షన్ చేస్తూ పాఠ్యపుస్తకాల్లోని విషయాల్ని చదివి, పరీక్షలు రాసి ర్యాంకులు సంపా దించాడు. తన చుట్టూ ఉన్న సమాజం లోని చీకటి కోణాల్ని తన మనోనేత్రంతో దర్శించి కొన్ని కథలు రాసాడు. ఆ కథల్లో, కాలగమనంలో వస్తున్న మార్పులు మని

# అక్షరధార

వేల ఏళ్ళ క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## సత్యంలోనే సర్వం!

సత్యే నార్కః ప్రతపతి సత్యే తిష్ఠతి మేదినీ ।
సత్యే ప్రోక్తః పరోధర్మః స్వర్గస్సత్యే ప్రతిష్ఠితః ॥

భావం: సత్యం వల్లనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సత్యం వల్లనే భూగోళం నిలబడి ఉంది. సత్యం లోనే ఉత్తమ ధర్మం ఉంది. సత్యంలోనే స్వర్గం కూడా ఉంది.

## ధర్మం శుభప్రదం!

వినాధర్మం మనుష్యాణాం
జాయతే న శుభం క్వచిత్ ।
యత్నతో ధారయేత్తస్మాత్
పురుషో ధర్మమేవ హి ॥

భావం: ధర్మం తప్ప మనుష్యులకి శుభప్రదమైంది మరొకటి లేదు. ప్రయత్న పూర్వకంగా అంతా దానిని ఆచరించాల్సిందే.

## ధనానికి వారసులు!

దానం భోగో నాశ స్తిస్రో
గతయో భవంతి విత్తస్య ।
యో న దదాతి న భుంక్తే
తస్య తృతీయా గతిర్భవతి ॥

భావం: డబ్బుకు ముగ్గురు వారసులు - దానం, భోగం (నిత్యావసరాలను తీర్చుకొనుట) నాశనం. మొదటి ఇద్దరి వారసులకు డబ్బు విని యోగించకపోతే మూడో వారసుడు (వినాశం) తిరగబడతాడని కవి చమత్కరించాడు.

## సంకీర్తనం పాపహరణం

కీర్తనేన హి రుద్రస్య
పాపం యాతి సహస్రథా
ప్రచండ పవనేనైవ
ఘనం జలదమండలమ్

భావం: పెనుగాలి చేత మబ్బులన్నీ ముక్కలు ముక్కలుగా చెదిరిపోయినట్లుగా శివ సంకీర్తనం చేత పాపాలన్నీ చెదిరిపోతాయి.

## కాలుని పచనం

అస్మిన్ మహామోహమయే కటాహే
సూర్యాగ్నినా రాత్రి దివేంధనేన ।
మాసర్తు దర్వీపరిఘట్టనేన
భూతాని కాలః పచతీతి వార్తా ॥

భావం: మోహమయమైన ప్రపంచమనే బాణలిలో జీవులని వేసి, సూర్యుడ్ని అగ్నిగా, రాత్రింబగళ్ళని ఇంధనంగా, మాసాలు, రుతువులని గరిటెగా చేసుకొని కాలుడనే వంటవాడు వండుతున్నాడు.

## జ్ఞాని లక్షణాలు!

పఠతో నాస్తి మూర్ఖత్వమ్
జపతో నాస్తి పాతకమ్
మౌనేన కలహంనాస్తి
నభయం చాస్తి జాగ్రతః

భావం: విద్యావంతుడికి మూర్ఖత్వం ఉండదు. జపం చేసే వాడికి పాపం ఉండదు. మౌనంగా ఉండే వాడికి తగాదాలు రావు. జాగ్రత్తగా ఉండే వాడికి భయం ఉండదు.

సేకరణ : లిపి

షిని ఎలా మేధావిగా మారుస్తున్నాయి? 'కొత్త ట్రెండ్' పేరుతో కొన్ని మార్పులు చిరకాలంగా గౌరవంగా చెప్పుకుంటున్న మానవీయ సంబంధాల్ని ఎలా మసకబారుస్తున్నాయి? అనే అంశాల్ని స్పృశించడం వలన అవి విశేషంగా పాఠకాదరణ పొందగలిగాయి. అందులో రెండు కథలు ప్రముఖ వారపత్రికలు నిర్వహించిన కథల పోటీల్లో ప్రథమ బహుమతులు పొందడంతో, అతను తక్కువ కాలంలోనే సంచలన రచయితగా ప్రశంసలు పొందాడు. అతను వయసురీత్యా చిన్నవాడు కాబట్టి 'పిట్ట కొంచెం, కూత ఘనం' అని కూడా కొంతమంది పెద్దలు అభినందించారు.

## కొత్తగాలి...

**దేశాన్ని**
**మార్చేది**
**ఏమార్చేది**
**రాజకీయాలే!**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

జితేంద్ర సంపాదించుకున్న గుర్తింపు, గౌరవాలే శోభ మనసుని ఆలోచింపజేసాయి.

శోభ అతని క్లాస్‌మేట్ అని చెప్తే, క్లాసులో ఉన్న చాలామందిలో ఆమె కూడా ఒకర్తైపోతుంది! జితేంద్రని ఇష్టపడే విద్యార్థిని అని చెప్తే కొంతలో కొంతమెరుగ్గా ఉంటుంది. జితేంద్ర చూడ్డానికి కూడా బాగుంటాడు. కాబట్టి అతన్ని పదేపదే చూస్తుంది. అతని రచనల్లో సామాజిక స్పృహ కనిపిస్తుంది. కథల్లో చూపించే శైలి, శిల్పం బాగుంటాయి. కాబట్టి ఒక్కో కథని రెండు మూడుసార్లు చదివింది. ఈతరం యువకులకి ఆవేశం ఉన్నంతగా ఆలోచన ఉండడం లేదనే వాదన శోభకి తెలిసిందే! అయితే జితేంద్ర ఆవేశానికో ఆలోచన, అతని ఆలోచనకో ఆవేశం ఉండడం గమనించింది.

తెలుగు ప్రొఫెసరు విద్యావతి కూడా జితేంద్ర రాసిన కథలు చదివింది. శోభ అతనంటే ఇష్టపడుతోందని కూడా గ్రహించింది. తనవంతు బాధ్యతగా ఓ రోజు శోభని పిలిచి హెచ్చరించింది.

"ఈ కాలం యువకుల్లో చాలామందికి ఆడపిల్లల్ని ప్రేమించడం ఓ హాబీగా మారింది. పడగొట్టడం ఓ డ్యూటీగా మారింది. ఇది వాళ్లు సాధించే విజయంగా మారింది"

"ఈ విషయాలు నాకెందుకు చెప్తున్నారు మేడమ్?"

"ఏంలేదు. నువ్వు ప్రేమలో పడ్డావో, పడుతున్నావో నాకు తెలీదు. కానీ నీది ప్రేమలో పడే వయసే కాబట్టి, కాస్త ముందుచూపుతో చెప్పాను. ఎర్రగా ఉందికదాని ముచ్చటపడి నిప్పును ముద్దు పెట్టుకుంటే కాలేది నీ నోరేనన్న విషయం గుర్తు చేస్తున్నాను"

విద్యావతిగారి మాటల్ని విన్నాక, అదే కోణంనించి జితేంద్రని కొన్ని రోజుల పాటు పరిశీలించాక... విద్యావతిగారి అభిప్రాయాన్నించి అతన్ని మినహాయించక తప్పదని నిర్ణయించుకుంది. ఇలా నిర్ణయించుకున్న శోభ.. సొగసరి విద్యార్థినే! ఓ స్త్రీని చూడగానే మళ్లీ ఒకటి రెండుసార్లు చూడాలనిపించడం అందానికి కొలమానమయితే.. శోభ అందగత్తే!

శోభ గురించి ఇంతవరకు ఇచ్చిన వివరణ ఒక ఎత్తు! రామదాసుగారి కూతురని చెప్పడం ఒక ఎత్తు!

రామదాసు... ఓ అగ్రకులస్థుడు! అతను ఉన్నత తరగతికి చెందిన స్థితిపరుడే! నగ

రంలో, కాలక్షేపంకోసం ఓ ప్రైవేట్ కంపెనీలో ఆఫీసరుగా పనిచేస్తున్నా అతనికి 'దంతులూరు' గ్రామంలో కాస్త పొలం, మామిడితోటలు ఉన్నాయి. ఓ పదిపదిహేనుమంది స్వేచ్ఛగా ఉండగలిగే ఇంట్లో కేవలం భార్య సత్యవతి, కూతురు శోభతో మాత్రమే ఉంటున్నాడు. ఇలాంటి ఆస్తులు, అలాంటి ఉద్యోగం చాలామందికి ఉండొచ్చు. కానీ.. అతని కులస్థులందర్లోకి అతనికో ప్రత్యేకత కలిగించింది.. అతనికున్న ద్విభాషా పాండిత్యం! సంస్కృతాంధ్ర భాషల్లో మంచి పట్టే సంపాదించాడు. పద్యకవి. అతను సీతారాముల గురించి రెండు శతకాలు రాసినా సంతృప్తి కలగలేదు. అందుకే రామాయణ గ్రంథాన్ని రాసి తన జీవితానికో ధన్యత చేకూర్చుకోవాలన్న సంకల్పంతో, చేస్తున్న ఉద్యోగం నుంచి వాలెంటరీ రిటైర్మెంట్ తీసుకున్నాడు. సీతారాములకి ఆనాటి హనుమంతుడికంటే, ఈనాటి రామదాసే గొప్పవాడని అతని సహోద్యోగులు సరదాగా అంటుంటారు.

ఆ గ్రంథం రాయడానికి పూనుకుంటున్న సందర్భంలోనే ఓ ప్రెస్‌మీట్ ఏర్పాటుచేసాడు. తన సామాజిక వర్గానికే చెందిన మరో ముగ్గురు పెద్దల్ని వక్తలుగా ఆహ్వానించాడు. అలాంటి ఆహ్వానాల్లోని అంతరార్థం "పొగడ్డమే" కాబట్టి వాళ్లు తమ యథాశక్తి రామదాసుని పొగిడారు. "రామాయణం రాయడానికి అన్ని అర్హతలూ ఉన్న అభినవ వాల్మీకి మా రామదాసు" అంటూ ప్రశంసించారు. ఆ పొగడ్తల కార్యక్రమం అయిపోయాక రామదాసు రవంత విచిత్రంగానే మాట్లాడాడు.

"నేను స్వతహాగా రామభక్తుణ్ణి. అటుపిమ్మట సంస్కృతాంధ్ర భాషల్లో పండితుణ్ణి. ఇప్పుడు మాన్యులు, మహనీయులయిన ఈ పెద్దలంతా నన్ను 'అభినవ వాల్మీకి' అంటూ నన్ను పిలిచారు. నిజానికి నాకు పొగడ్తలంటే మహా అసహ్యం! ఆ పెద్దలు నేనో అభినవ వాల్మీకిననే విషయాన్ని కనిపెట్టేస్తే నేనెలా చావను? వాళ్లు నిజం మాట్లాడినప్పుడు నేనెలా కాదని వాదించగలను? లేకపోతే, ఇక్కడో తేడా ఉంది. రత్నాకరుడనే ఓ దారిదోపిడీ దొంగకి నారదుడు ఓ ఉపదేశం చేశాక, అతను తపస్సు ఆరంభించాడు. అతని చుట్టూ బలిసిపోయిన పుట్టల్లోంచి అతను బయటకొచ్చి 'వాల్మీకి' అనే రుషిగా రూపాంతరం చెందాక, రామాయణ గ్రంథాన్ని రాసాడు. అంటే, అతని రామాయణ రచన వెనక దైవప్రేరణ, నారదుడి మంత్రోపదేశం ఉన్నాయి. కానీ, నాకు ఏ నారదుడూ ఉపదేశం చెయ్యలేదు. నేను ఏ తపస్సూ చెయ్యలేదు. కానీ, వాటిని మించిన పని చేసాను కాబట్టి రామాయణం రాయడానికి సాహసించాను"

"తపస్సు కంటే గొప్ప పనేం చేసారు? " ఓ పత్రికా విలేకరి ప్రశ్నించాడు.

"ఆ విషయాన్ని వెల్లడి చేయకపోతే, ఈ ప్రెస్‌మీట్‌కో ప్రయోజనం ఉండదు. అరిషడ్వర్గాలనేవి మనిషికుండే ఆరు దుష్టలక్షణాలు. వాటిని జయించడమనేది అందరికీ సాధ్యమయ్యే పనికాదు. అరిషడ్వర్గాలంటే ఏవిటో మీకు వివరించనక్కర్లేదనుకుంటాను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలని అరిషడ్వర్గాలంటారు. వాటిని సంపూర్ణంగా జయించి, రాగద్వేషాలకి అతీతంగా ఆవలి గట్టుకు చేరిపోయాను కాబట్టి రామాయణ రచనకి శ్రీకారం చుడుతున్నాను"

ఓ ఎలక్ట్రానిక్ మీడియా రిపోర్టర్ నవ్వుతూ అడిగాడు "సార్, మీరేమీ అనుకోనంటే ఓ మాట అడుగుతాను"

"అడగండి, రాగద్వేషాలక్కూడా అతీతుడిగా మారిపోయానని ఇప్పుడేగా చెప్పేను!

మీరు ఎలాంటి ప్రశ్న అడిగినా ఏమీ అనుకోను"

"విశ్వామిత్రుడంతటి మహర్షే అరిషడ్వర్గాల్ని జయించలేకపోయాడం టారు. మరి మీరెలా జయించగలిగారు? "

రామదాసు పెద్దశబ్దం వచ్చేలా నవ్వి "విశ్వామిత్రుణ్ణి మీరు చూడలేదు, నేనూ చూడలేదు గదా! అతను గొప్ప మహర్షే అగు గాక! ఆ తర్వాతి కాలాల్లో అంతకు మించినవారు పుట్టరా? నేను పుట్టాను గదా! ఇంకాసంగతి వదిలెయ్యండి"

అతని మాటలలో రామాయణ రచన పట్ల అంకితభావం కంటే స్వోత్కర్షే ఎక్కు వగా ధ్వనించడం వల్ల కొంతమంది పాత్రి కేయులు ఇబ్బంది పడ్డారు. వారి మనోభా వాలు గమనించకుండా రామదాసే చెప్పాడు. "చాలామంది ఆధునిక సాహిత్యం గురించి గొప్పగా చెప్తున్నారు. కానీ నేను రాయాలనుకుంటే... కథలు, నవలలు రాయడంలో ప్రఖ్యాతులు, నిష్ణా తులు అనిపించుకున్నవారికంటే అద్భు తంగా రాయగలను. కానీ, అలాంటి రచ నలు చేస్తే, కొద్దిరోజుల తర్వాత వాటి గురించి పట్టించుకునే వారుండరు. వాటి పేర్లు కూడా ప్రజలకి గుర్తుండవు. అంచేత, అలాంటివాటిని రాసి, నా ప్రజ్ఞా పాటవాల్ని వృథా చెయ్యడం ఇష్టం లేదు. అందుకే నా పేరు శాశ్వతంగా ఉండిపోవా లన్న సదుద్దేశ్యంతో రామాయణం రాయ డానికి సంకల్పించాను"

రామదాసులోని స్వోత్కర్ష మరీ ఎక్కువై పోతోందని భావించిన ఓ పాత్రికేయుడు అడిగాడు "ఇప్పటికే రామాయణాన్ని చాలామంది కవులు రాసారు. మళ్లీ మీరు రాయడం అవసరమని మీరు భావిస్తు న్నారా? ఆ గ్రంథాల్లో లేని ప్రత్యేకతని మీరు చూపించగలననే అనుకుంటు న్నారా? "

రామదాసు మనసు చుర్రుమంటూ కాలింది. మరొకప్పుడైతే ఆ వ్యక్తితో గొడ వకి దిగేవాడే! కానీ, రాగద్వేషాల్ని, అరిష డ్వర్గాల్ని జయించేసానన్న విషయాన్ని కొన్ని నిమిషాల క్రితమే చెప్పడం వలన, బలవంతంగా కోపాన్ని తమాయించుకుని, ముఖంనిండా నవ్వు పులుముకుని చెప్పాడు.

"ఎన్నో యుగాల్నించి ఎంతోమంది దేవు డిని పూజిస్తున్నారు. అలాగని మనం పూజించడం మానేసామా? మానకూ డదు. ఎందుకంటే ఎవరి భక్తి వారిది. ఎవరి పూజ వారిది. వాటికి కాలంతో పని లేదు. అలాగని ఆదికవి వాల్మీకి తర్వాత, నాకంటే ముందు అనేకమంది శ్రీమద్రా మాయణాన్ని రాసి తరించారు. నేను వారి అడుగుజాడల్లోనే నడవాలని నిర్ణయించుకు న్నాను. ఇంక 'ఆ గ్రంథాల్లో లేని ప్రత్యేక తని మీరు చూపించగలననే అనుకుంటు న్నారా?' అంటూ ప్రశ్నించారు. ఒక్క వాల్మీకి రాసిన రామాయణాన్ని తీసి పక్కన పెడితే, ఆ తర్వాత అనేక మంది అనేక రామాయణాలు రాశారు. ఆ గ్రంథా లన్నింటికంటే అతీతంగా నా గ్రంథమే ఉంటుందేమో? ఉంటుందనే నా నమ్మ కం! ముందు నన్ను రాయనివ్వండి"

పత్రికాగోష్ఠి అలా ముగిసింది. ఆయన చెప్పిన మాటల్ని ఏ పత్రికా ప్రముఖంగా ప్రచురించలేదు. ఏ టీవీ ఛానలూ ఈ కార్యక్రమాన్ని ప్రసారం చెయ్యలేదు. అయినా అతను రామాయణ కావ్యరచనకు శ్రీకారం చుట్టాడు.

అతని ఆహారపుటలవాట్ల దగ్గర్నించి ఆహార్యం కూడా మారింది. క్షురకర్మలు మానెయ్యడం వలన అతని జుత్తూ, గడ్డాలు, మీసాలు పెరిగాయి. బైటకి వచ్చి నప్పుడు మినహా, మిగతా సమయాల్లో 'శ్రీరామ'నామాలు రాసున్న శాలువాని

కప్పుకోవడం వలన చూసేవారికి వనసీమ నుంచి వలస వచ్చిన వాల్మీకిలా కనిపిస్తు న్నాడు. అతని రచన నిరాటంకంగా సాగు తోంది.

జితేంద్ర, శోభల పరిచయం చిక్కబ డింది. సాయంత్రంవేళ జితేంద్ర నడిపే బైక్ మీద అప్పుడప్పుడు సముద్రతీరానికి వెళ్లి మనసు విప్పి మాట్లాడుకుంటున్నారు. తత్ఫలితంగా వారి మనసులు దగ్గర య్యాయి తప్ప, శరీరాన్ని దగ్గర చేసుకుని, అదే తమ ప్రేమకి పరాకాష్ఠనో, పర్యవసా నమనో అనుకోడానికి వారిద్దరి సంస్కారం అంగీకరించలేదు. జితేంద్ర తను ఎవరో ఏమిటో దాపరికం లేకుండా చెప్పాడు. తను ఇంతవరకు ఎవరి పెంపకంలో ఎలా పెరిగిందీ చెప్పాక, భవిష్యత్తులో తన గమ్యం ఏంటో చెప్పి, అది చేరడానికి తను చేయబోయే ప్రయత్నాల గురించీ చెప్పాడు. అతను చెప్పిందంతా శోభ శ్రద్ధగానే విన్నది.

ఈనాటి కాలంలో వ్యక్తుల ప్రతిభలు, వారి జీవనస్థాయిని బట్టి వివాహాలు ఎక్కువగా జరుగుతున్నాయి తప్ప, కులమ తాల ప్రస్తావన రావడం లేదు.

శోభ తల్లి సత్యవతి ప్రస్తుతం ఉన్న లోకం పోకడల్ని గమనిస్తూనే ఉంది. ఉన్నది ఒక్కతే కూతురు కావడంవల్ల, కూతురి క్షేమాన్నే ధ్యేయంగా పెట్టుకుంది తప్ప మరో విషయం ఆలోచించడం లేదు. ఆ విషయం శోభకి తెలిసినా జితేంద్రతో ఉన్న పరిచయం గురించి ఆమెకు చెప్ప లేదు.

ఇంక తండ్రి విషయం.. అతను దూరాన్ని మీటర్లలో, భారాన్ని కిలోలలో కొలిచినట్లు, మనుషుల్ని వారి పుట్టుకల్ని బట్టి, కులాల్ని బట్టి లెక్కగట్టడం అలవాటు చేసుకున్నాడు. ధనవంతుడైన దళితుడి కంటే, పేదవాడైన అగ్రకులస్థుడికే ఎక్కువ విలువనిస్తాడు. మనుష్యుల మధ్య తేడాలు ఆదినుంచీ ఉన్నవేనని వాదిస్తాడు. కానీ ఇవన్నీ ఎప్పుడు, రామాయణ కావ్యం రాయకముందునాటి ఆలోచనలు! ఇప్పుడా యన అరిషడ్వర్గాల్ని జయించి, రాగద్వేషా లకి అతీతంగా జీవిస్తున్న రాజయోగిగా నిజంగానే మారిపోయాడా! ప్రస్తుతం అతని శ్వాస, ధ్యాస, ఆశ కూడా.. రామా యణ గ్రంథ రచనే! అందువలన కులమ తాల గురించి, ఆర్థిక వ్యత్యాసాల గురించి ఆలోచించడు. పర్వత శిఖరానికి చేరుకున్న వ్యక్తికి నేలమీదున్న భవనాలు గూడా చాలా చిన్నవిగానే కనిపిస్తాయి. రాగద్వే షాలకి లోనుకాని వ్యక్తి మనసు కూడా పర్వత శిఖరం మీదున్న యోగి ఆలోచన లాంటిదే! వారికీ కులమతాలు ఇసుకరేణు వుల్లా కనిపిస్తాయి. ఇవన్నీ రామదాసు గురించి శోభ ఆలోచనలు!

ఓరోజు స్థానికంగా ఉంటున్న అచ్యుత రావు అనే ఓ పెద్దమనిషి వచ్చి తమ బంధువుల సంబంధం గురించి చెప్పాడు. ఇచ్ఛాపురం యజ్ఞన్నగారికి ఒక్కడే కొడుకు. ప్రస్తుతం అమెరికాలో చదువుతూ త్వరలో ఇండియా వచ్చి ఇక్కడే వ్యాపారం చేస్తాడు. యజ్ఞన్నగారి ఆస్తిపాస్తుల గురించి, ఆయనకున్న పేరు ప్రఖ్యాతుల గురించి వివరించాడు. తర్వాత పెళ్లికొ డుకు ఫొటోని చూపించాడు. చూడగానే

## భళే భళే!

కవి, నాటక రచయిత అయిన ఫ్రెడరిక్ స్కిల్లర్‌కు చుట్టూ ఎర్రటి పరదాలు వేలాడదీ సుకుంటే గానీ ఆయన కలం ముందుకు సాగేది కాదట! రాసేటప్పుడు అలసటగా ఉన్నా, నిద్ర వస్తున్నా చల్లటి నీటిలో పాదా లను కాసేపు ఉంచుకునేవాడట!

నచ్చే ముఖం కాకపోయినా, వినగానే నచ్చే హోదాలో ఉన్నాడు కాబట్టి రామదాసు, సత్యవతి 'సరే'నని తలొగ్గారు. వారం తర్వాత యజ్ఞన్నగారు, ఆయన భార్యతో పాటు విశాఖపట్నంలోనే వారికున్న బంధువులు రామనాథం, శివన్నగారు కూడా ఆ ఇంటికి వచ్చి శోభని చూశారు.

శోభతో ఎవరూ ఈ సంబంధం గురించి చెప్పలేదు. అబ్బాయి ఫొటో చూపించి, ఆమె ఇష్టాయిష్టాలు అడగలేదు. పెళ్లివారొచ్చే సమయానికి శోభ కాలేజీకి వెళ్తుంటే, సత్యవతి ఆమెనో అయిదు నిమిషాలపాటు ఆపి తన పక్కనే కూర్చోబెట్టింది. వచ్చినవాళ్లు యథాలాపంగా ఆమె చదువు, వివరాలూ అవీ అడిగి తెల్సుకున్నారు. తర్వాత కాలేజీకి వెళ్లిపొమ్మని చెప్పారు. శోభ వెళ్లాక పెద్దవాళ్లంతా కలిసి, అమ్మాయికి ఫైనల్ ఇయర్ పరీక్షలు అయిపోయే సమయానికి అబ్బాయి కూడా అమెరికా నుంచి వచ్చేస్తాడు కాబట్టి, వివాహానికి ముహూర్తాలు అప్పుడు పెట్టిద్దామని తీర్మానించారు.

శోభకి తన తల్లిదండ్రుల ప్రయత్నాలు, ఉద్దేశాలు అర్థమయ్యాయి. అందుకే సందిగ్ధంలో పడింది. జితేంద్రకి విషయం చెప్తే ఏమవుతుంది? చెప్పకపోతే ఏమవుతుంది? చెప్తే.. అతని తరపు పెద్దల్ని తన ఇంటికి పంపించి పెళ్లి విషయం మాట్లాడించాలి. కానీ అతని తరపు నుంచి వచ్చే పెద్దలెవరూ లేరు. ఈ విషయం చెప్పకపోతే? ఈ ప్రశ్న దగ్గరే ఆమె ఆలోచన చాలాసేపు ఆగిపోయింది. తనని ఎవరో ఇచ్ఛాపురం యజ్ఞన్నగారికి చూపించారు తప్ప.. జాతకాలు చూపించలేదు. నిశ్చితార్థాలు జరగలేదు. ఒకవేళ పెళ్లి చేసినా తన ఫైనలియర్ పరీక్షలు జరిగాకనే చేస్తారు. ఈలోగా చెప్తే జితేంద్ర మానసికంగా డిస్టర్బ్ కావచ్చు. అంచేత చెప్పకుండా ఉండడమే మంచిదని నిర్ణయించుకుంది.

★ ★ ★

జితేంద్ర రాసిన కథలకి వచ్చిన ప్రోత్సాహంతో నాటక రచనకి ఉపక్రమించాడు. నాటకం ప్రేక్షకుల సమక్షంలో జరిగే సజీవ ప్రదర్శన కాబట్టి, ప్రేక్షకుల స్పందన తెలుసుకునే అవకాశమున్న మాధ్యమం కాబట్టి అతను మరింత ఉత్సాహంగా నాటకం రాసాడు. తన కథలకి ఓ సామాజిక ప్రయోజనం ఉందని చదువరుల చేత ప్రశంసలు పొందినట్టే, తను రాసే నాటకానికీ ఓ ప్రయోజనం ఉండాలనుకున్నాడు. ప్రేక్షకులను ఆలోచింపజేయాలన్న ధ్యేయంతోనే నాటకం రాశాడు. అతను తన అనుభవంలో ఇతరుల ద్వారా విన్న మేరకు, పుస్తకాల్లో చదివిన మేరకు, సినిమాల ద్వారా తెలుసుకున్న మేరకు భారతీయ ఇతిహాసాలుగా ప్రసిద్ధి పొందిన రామాయణ, భారతాల మీద ఓ ప్రత్యేకమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నాడు. ముఖ్యంగా ఆ రెండింట్లోని స్త్రీ పాత్రలైన సీతాదేవి, ద్రౌపదుల మీద! ఆ రెండు పాత్రలూ అతడిని విపరీతంగా ఆలోచింపజేసాయి.

సీత, ద్రౌపదుల్ని దుష్టపాత్రలు అవమానించాయి. అందులోనూ సీతాదేవి పాత్ర మరీ మరీ ఆలోచింపజేసింది. సీతాదేవి రావణుడి చేత అవమానానికి, అపహరణకి గురయింది. భర్తయిన శ్రీరాముడే అనుమానించాడు. ఈ అంశాన్నే ఆలంబన చేసుకుని, 'ఈనాటి కోణంలో ఆనాటి రామాయణం' అనే నాటకం రాసాడు. రాశాక, విశాఖపట్నంలో ఉన్న నాటకరంగ నిష్ణాతులకి నాటకాన్ని చదివి వినిపించి, వారి సలహాలడిగాడు. వాళ్లు అతన్ని ముందుగా అభినందించారు. 'సెల్‌ఫోన్'లోని సిమ్‌కార్డ్ చాలా చిన్నదిగానే కనిపి

స్తుంది. కానీ అది ఎంత శక్తిమంతమ యిందో సెల్‌ఫోన్లు వాడే ప్రతివారికీ తెలుసు. నువ్వు చిన్నవాడివైనా పెద్ద నాటకమే రాసావు' అంటూ, కొన్ని కొన్ని చిన్న మార్పుల్ని ప్రదర్శనాపరంగా సూచించారు. నాటకంలోని అంశం పట్ల అభినందనే తప్ప అభ్యంతరాలేం వినిపించలేదు. 'ఇప్పుడిప్పుడే నారీమణులు నవభావజాలంతో నాలుగు అడుగులు ముందుకెళ్తున్నారు. అలాంటివారిని ఈ నాటకం ఆలోచింపజేస్తుంది' అన్నారు.

వారి అభిప్రాయాలు తీసుకున్న తర్వాత నాటకానికి రిహార్సల్స్ చేయించడం ఆరంభించాడు. దానిలో తను ఏ వేషమూ వేయకుండా కేవలం రచన, దర్శకత్వ బాధ్యతలకే పరిమితం అయ్యాడు జితేంద్ర. రచయితగా తన సొంత పేరు పెట్టకుండా 'నవత' అనే కలం పేరుతో కరపత్రాలు వేసి ప్రచారం చేయించాడు.

ఆ నాటక ప్రదర్శనకి కొంతమంది స్థానిక అభ్యుదయవాదుల్ని అతిథులుగా ఆహ్వానించాడు. అలా పిలవాలనుకున్నవారిలో అతను 'రామదాసు' పేరుకూడా చేర్చాడు. ఆ విషయం శోభకి చెప్పాడు.

"మా నాన్ననెందుకు పిలవడం?" అడిగిందామె.

"ఆయన మీ నాన్నగారన్న కారణంగా పిలవడం లేదు. ఆయన రామాయణాన్ని రాస్తున్న కవిగారు. వారు నేను రాసిన నాటకం చూసి ఎలా స్పందిస్తారో తెలుసుకోవాలనుకుంటున్నాను" అంటూ రామదాసుని పిలవడానికి గల కారణాన్ని వివరించాడు జితేంద్ర.

"అయితే మా నాన్నగారికి నేనేమని చెప్పాలి?"

"ఏమీ చెప్పక్కర్లేదు. నీకూ ఈ నాటకానికీ ఎలాంటి సంబంధం లేదు కదా! మా యూనివర్సిటీ స్టూడెంట్స్ ఎవరో మిమ్మల్ని కలుసుకోవడానికి వస్తారట అని మాత్రం చెప్పు. మిగిలిన వివరాలు, నేనూ నా ఫ్రెండ్సూ ఆయనతో మాట్లాడి నాటకానికి ఆహ్వానిస్తాం"

శోభ ఆ రోజు అతను చెప్పమన్న వాక్యాన్నే యథాతథంగా తండ్రికి చెప్పింది. ఆయన శ్రద్ధగా రాసుకుంటున్న సమయం కాబట్టి 'రమ్మను' అని ముక్తసరిగా చెప్పి ఊరుకున్నాడు. సాయంత్రం అయిదు గంటలప్పుడు జితేంద్ర, అతని ముగ్గురు ఫ్రెండ్సు వచ్చారు. రామదాసు అందర్నీ కూర్చోబెట్టి కాఫీలిచ్చాక జితేంద్ర తను వేయించిన పాంప్లెట్‌ని అతనికి అందించాడు. అందులో నాటకం పేరు, రచయిత, దర్శకుల పేరుతోపాటు నాటకంలో 'అంశం' గురించి ఓ ఏడెనిమిది వాక్యాల్లో వివరించారు. అదంతా రామదాసు నిదానంగానే చదివాడు. సత్యవతి, శోభ ఓ గది గుమ్మం దగ్గర నిలబడి వింటున్నారు. పాంప్లెట్ చదివాక, జితేంద్ర తనని తాను రచయిత, దర్శకుడిగా పరిచయం చేసుకున్నాక 'నీ పేరు నవత అని వేసుకున్నావు. అది నీ కలం పేరయి ఉంటుంది. నీ అసలు పేరేంటి?' అని రామదాసు అడుగుతాడని జితేంద్ర అనుకున్నాడు. అడగాలని రామదాసు అనుకున్నాడు. కానీ, నాటకం పేరు చదవగానే ప్రశ్న అడ

## కొత్తగాలి...

**అత్తా కోడళ్లు**
**ఒకే నాణేనికి**
**బొమ్మా బొరుసులు**
**ఎప్పటికీ కలవరు!**

– గుర్రం శ్రీనివాస్,
చెరుకుపల్లి, గుంటూరు జిల్లా

క్కుండా ముఖం కాస్త చిట్లించి "త్రేతాయుగంనాటి రామాయణాన్ని ఈనాటి కోణంలో చూడ్డమేంటి? " అని అడిగాడు.

జితేంద్ర మరో విషయంలోనైతే, మాట్లాడ్డానికి కాస్త సంకోచించేవాడేమోగానీ నాటకం గురించి కాబట్టి, రచయితగా ధైర్యంగా సమాధానం చెప్పాడు. "ఆనాడు జరిగాయని చెపుతున్న విషయాలు ఎంత వరకు సమంజసం? ముఖ్యంగా ఆడవారి విషయంలో అనే పాయింట్ ని ఆధారం చేసుకుని రాసిన నాటకం సార్"

"నువ్వు రామాయణాన్ని క్షుణ్ణంగా చదివేవా? "

"లేదండి. కాని కొన్ని ప్రధానాంశాల గురించి నాకు తెలుసు. తెలిసిన వాటి గురించి ఈనాటి మహిళల భావజాలానికి అనుగుణంగా రాసాను"

జితేంద్ర చెప్పిన సమాధానం రామదాసుని సంతృప్తి పరచలేదు. "ఈనాటి ఆడవాళ్ల భావజాలానికి అనుగుణంగా అంటే అదెలా? నాక్కాస్త అర్థమయ్యేలా చెప్పు" అన్నాడు. తను కూర్చున్న ఈజీ చైర్ లో వెనక్కి వాలుతూ.

జితేంద్ర తన ఫ్రెండ్సువైపు ఓసారి చూసి కాస్త హుషారుగా చెప్పాడు. "ఆనాటి రామాయణంలోని సీతాదేవిని శ్రీరాముడు రావణాసురుడి చెరనించి విడిపించాక అగ్నిపరీక్ష పెట్టాడు. అగ్నిగుండంలోకి దూకి తన శీలాన్ని నిరూపించుకోవాలనే షరతు పెట్టాడు. 'ఎందుకు నేను అగ్నిలో దూకాలి? ' అని ఆ సీత ప్రశ్నించలేదు. కానీ ఈనాటి సీత అలా కళ్లు మూసుకుని దూకెయ్యదు. అగ్నిగుండంలో దూకింతర్వాత అగ్నిదేవుడు ఆమెను తీసుకొచ్చి, ఆమె పవిత్రురాలేనని సర్టిఫై చేశాక రాముడు ఆమెను భార్యగా అంగీకరించాడు. తర్వాత ఆమెను అయోధ్యకి తీసుకొచ్చాక, ఎవరో అనామకుడు ఆమెను గురించి తప్పుగా కామెంట్ చేశాడని... కనీసం ఆవిడకి ముందుగా చెప్పనైనా చెప్పకుండా అడవులకు పంపించేశాడు. ఇది అమానుషమైన చర్య"

రామదాసు అకస్మాత్తుగా భగభగ మండుతున్న అగ్నిగుండంలా సమాధానం చెప్పాడు. "లోకపావని అయిన సీతాదేవి పాతివ్రత్య మహిమని ముల్లోకాలకి చాటి చెప్పడానికే అగ్నిప్రవేశం చేయించాడు గానీ, శ్రీరాముడికి సందేహం వచ్చికాదు. భర్తమాటకి ఎదురు చెప్పకుండా సీతాదేవి అగ్ని ప్రవేశం చేసింది కాబట్టే, ఆమె సర్వకాలాల్లో పూజనీయురాలయింది"

జితేంద్ర తనకి తెలియకుండానే తన గొంతుని పెంచాడు. పెంచిన గొంతులో ఆవేశమే ధ్వనించింది.

"నిజమే సార్! సీతాదేవి పాతివ్రత్యాన్ని సర్వలోకాలకీ తెలియజేయడానికే శ్రీరాముడు ఆమెచేత అగ్నిప్రవేశం చేయించాడు. అగ్నిదేవుడు ఆమెను చెక్కు చెదరకుండా తీసుకొచ్చి ఆమె పాతివ్రత్యానికి సర్టిఫికేట్ ఇచ్చాడు గదా! అలాంటప్పుడు, ఆ దంపతులు అయోధ్య కొచ్చాక, ఎవడో గన్నాయిగాడు చేసిన కామెంట్ విని సీతాదేవిని అడవులకి ఎందుకు పంపించాడు? ఆ సన్నివేశంలో, మా నాటకంలోని సీతాదేవి ఏం అడుగుతుందంటే.. ఇప్పుడెవడో అనామకుడు ఏదో కామెంట్ చేసినందుకు వాణ్ణి దండించకుండా నన్ను అడవులకి పంపించేస్తున్నారు! అలాంటప్పుడు నేను అగ్నిలో దూకేం ప్రయోజనం? అగ్నిదేవుడు నా పవిత్రత గురించి సర్టిఫై చేసేం ప్రయోజనం? ఓ అనామకుడు చేసిన కామెంట్, నా కేరక్టర్ కంటే.. అగ్నిదేవుడిచ్చిన సర్టిఫికెట్ కంటే విలువైనదనుకున్నప్పుడు... ఆనాడు నా చేత ఆ అగ్నిప్రవేశాన్ని అడవిలో కాకుండా, అయోధ్యా నగరంలో అందరూ చూస్తుండగా జరిపించా

# ఎర్రసిరా బైబిల్

ప్రపంచంలో మరే మత గ్రంథానికి లేని ఓ విశిష్టతను లూయిస్ క్లిఫ్స్ బైబిల్‌కి తెచ్చాడు. క్రిస్టియన్ హెరాల్డ్ అనే పత్రికకి మొదటి ఎడిటర్‌గా పనిచేసిన అతనికి ఓ రోజు బైబిల్‌లో ల్యూక్ భాగంలోని 22:21 చదివినపుడు ఓ ఆలోచన వచ్చింది. ఆ భాగంలో 'దిస్ కప్ ఈజ్ ది న్యూ కొవెనెంట్ ఇన్ మై బ్లడ్, విచ్ విల్ బీ షెడ్ ఫర్ యు' అన్న వాక్యాన్ని చదివాడు. అవి జీసస్ స్వయంగా పలికిన మాటలు. ఆ వాక్యాన్ని అందులో పేర్కొన్న రక్త వర్ణంలో ప్రచురించాలనీ, తర్వాత అసలు బైబిల్‌లో జీసస్ పలికిన అన్ని పలుకులనూ ఎర్ర అక్షరాల్లో ప్రచురించాలనే ఆలోచన కలిగింది. ఆయన అమెరికా, యూరప్‌లోని బైబిల్ పండితులని ప్రభువు నోటి నుండి వెలువడినవని భావించే వాక్యాలని తెలియజేయమని కోరాడు. ఫలితంగా నలుపు, ఎరుపు రంగుల్లో అచ్చయిన మొదటి బైబిల్ 1899లో వెలువడింది. అవి త్వరగా అమ్ముడవడంతో దానికిగల డిమాండ్‌కి ప్రెస్ రాత్రిళ్లు కూడా పనిచేసి బైబిల్స్‌ని ముద్రించ సాగింది. స్వీడన్ రాజు క్లిఫ్స్‌ను ఆ బైబిల్‌ని ప్రచురణ చేసినందుకు అభినందనలు తెలియజేశాడు. ఆనాటి అమెరికా అధ్యక్షుడు థియోడర్ రూజ్‌వెల్ట్ అతని వైట్ హౌస్‌కి తనతో కలిసి భోజనం చేయడానికి ఆహ్వానించాడు. మార్చి 28, 1910న క్లిఫ్స్ మరణించాడు. న్యూయార్క్ రాష్ట్రంలోని టొనవండ అనేచోట ఆయన స్థాపించిన అనాథాశ్రమ ఆవరణలో ఆయన శవాన్ని ఖననం చేశారు. క్లిఫ్స్ ఆదర్శం 'నువ్వు చేయగలిగే మంచి అంతటినీ నీవు చేయగలిగినంత మందికి చెయ్యి' అనేది. ఈ మాటలను ఆయన సమాధి మీద నేటికీ మనం చూడవచ్చు.



ల్సింది. అలా చేస్తే ఎవరూ నోరెత్తేవారు కాదు గదా! బయటివాడి గురించి ఆలోచించినంతగా మీ భార్య గురించి ఆలోచించరా? మీరీ విషయంలో రాజుగా ఆలోచించారా? భర్తగా ఆలోచించారా? భర్తగా ఆలోచిస్తే, అగ్ని దేవుడిచ్చిన సర్టిఫికేట్ గురించి ప్రజలకి చెప్పి, నన్ను సమర్థించాలి. రాజుగా ఆలోచిస్తే ఆ అనామకుడిని దండించాలి"

"ఫట్"

ఆవేశంగా మాట్లాడుతున్న జితేంద్ర చెంప చెళ్ళుమనిపించాడు రామదాసు. అనూహ్యమైన ఈ చర్యకి అక్కడున్న ఆడా మగా అందరూ ఉలిక్కిపడ్డారు. అలా ఉలిక్కిపడ్డంతోపాటు జితేంద్ర ఫ్రెండ్సు ఆగ్రహానికి లోనయ్యారు.

"ఎందుకొట్టారండి? " ఓ ఫ్రెండు ఆవేశంగా అడిగాడు.

"కొట్టడం కాదు.. సీతాదేవిని అసహ్యంగా చిత్రిస్తున్నందుకు ఈ నవతగాణ్ని ఏం చేసినా తప్పులేదు" రామదాసు కోపంతో వణుకుతున్నాడు.

"మావాడు ఏ విధంగానూ అవమానించలేదే!" మరో ఫ్రెండు బుసలు కొట్టాడు.

"సీతాదేవి ఏనాడూ ఏ దశలోనూ భర్తని ఎదిరించలేదు, ప్రశ్నించలేదు, తిరస్కరించలేదు. అందుకే అన్ని కాలాల్లోనూ స్త్రీలకి ఆమె ఆదర్శమయింది"

జితేంద్ర ధైర్యం తెచ్చుకుని "క్షమించాలి సార్! మీరు చెప్పిన మాట ఈ కాలానికి మాత్రం వర్తించదు. పురుషాహంకారం ప్రబలిపోతున్న ఈ కాలంలో, లైంగిక

వేధింపులు, గృహహింసలు పెచ్చు పెరిగి పోతున్న ఈ సమాజంలో.. సీతాదేవిని ఆదర్శంగా తీసుకుంటే.. ఆడవాళ్లు రోజుకి పదిసార్లు అగ్నిగుండంలోకి గెంతాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది" అన్నాడు.

"నోర్ముయ్యరా దౌర్భాగ్యుడా! సంస్కారం లేని చదువులు వాసనలేని పువ్వులతో సమానమని పెద్దలు చెప్పిన మాట, నిన్ను చూసాక నిజమేననిపిస్తోంది. నీకు రచనలు చేసి, నాటకాలాడాలనే దురద ఉంటే, నీ బతుక్కి తగిన సాంఘిక నాటకమేదో రాసుకుతగలడాలిగానీ, నీకు భారతీయ ఇతిహాసాలెందుకురా? రామాయణం ఆధారంగా నాటకం రాసే అర్హత నీకేం ఉందని ఆ నాటకం రాసేసావు?"

రామదాసు ఆవేశం, ఆయాసం కలగలుపుగా మాట్లాడుతున్న మాటలకి జితేంద్ర కంటే ఎక్కువగా అతని స్నేహితులే స్పందించి, తలా ఓ ప్రశ్న దడదడమంటూ అడిగేశారు.

"ఆ మాటకొస్తే మీకేం అర్హతవుందని రామాయణాన్ని రాసేస్తున్నారండి?"

"అక్కడికి ఆ సీతాదేవి మీకు బంధువో, చుట్టమో అయినట్టు అలా హీటెక్కిపోయారేంటి?"

"మీరు అరిషడ్వర్గాల్ని, రాగద్వేషాల్ని జయించేసానని ప్రెస్‌మీట్‌లో చెప్పారు. కానీ మావాడు ఓ నాటకంలోని పాత్ర గురించి చెప్తేనే, మీరు సహించలేక మావాణ్ణి కొట్టేసారు. రాగద్వేషాల్నీ, గాడిద గుడ్డునీ జయించేసానని చెప్పుకునే మీకంటే, అలాంటి కబుర్లేం చెప్పని మా కుర్రాళ్లే నయం. మీరు మావాణ్ణి కొట్టినా, మేం తిరిగి మిమ్మల్ని కొట్టలేదు"

ఈ ఘర్షణ ఎంతవరకు వెళ్లిపోతుందో అర్థంకాక శోభ, సత్యవతి భయపడి వారి మధ్యకొచ్చి ఏదో చెప్పబోయారు. కానీ, జితేంద్ర వారిని ఆగమని చెయ్యి చూపించి, రామదాసుతో శాంత గంభీర స్వరంతో చెప్పాడు. "నేను చేసిన రచన సనాతనభావాలు కలిగిన మీ బోటివార్ని ఇంతగా ఆవేశపరిచిందంటే.. దీన్ని తప్పకుండా అధునాతన భావాలు గలిగిన ఈ తరం ప్రేక్షకులు ఆదరిస్తారని నాకు అర్థమైపోయింది. మహిళా ప్రేక్షకుల చేత తీవ్రంగా ఆలోచింపజేస్తుందనీ నమ్మకం ఏర్పడింది. మీరు మా ప్రదర్శనకొస్తే సంతోషిస్తాను. నమస్కారం" అన్చెప్పి, రెండు చేతులతో నమస్కరించి, తన స్నేహితులతో సహా ఆ ఇంటి నించి నిష్క్రమించాడు జితేంద్ర!

తన ఇంటికొచ్చినందుకు తండ్రితో చెంపదెబ్బ తిన్నాడని శోభ, జితేంద్ర గురించి బాధపడింది. ఘర్షణ కాస్తా యుద్ధంగా మారి, వయసులో ఉన్న కుర్రాళ్లు తన భర్తని కొట్టకుండా వెళ్లినందుకు సంతోషించింది సత్యవతి. రామాయణ, భారతాన్ని, పురాణాల్ని వక్రీకరించి రాసేవాళ్లని ఉరి తీసే చట్టం ఇంకా రానందుకు అసంతృప్తి చెందాడు రామదాసు.

★ ★ ★

తన నాటకం పట్ల రామదాసు అంత దారుణంగా స్పందించినందుకు జితేంద్ర పెద్దగా బాధపడలేదు. రామదాసుకి సీతారాముల తర్వాతే ఈ ప్రపంచంలో మరెవరైనా లెక్కలోకి వస్తారని జితేంద్ర గ్రహిం

**కొత్తగాలి...**

**జిమ్మిక్కుల**
**పర్వం..**
**కుమ్మక్కులు**
**సర్వస్వం..**
**నేటి రాజకీయాలు!**

*– యు. చిట్టిబాబు,*
కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

చాడు! అతనిలాంటి రామభక్తుడి దగ్గరకి తను డైరెక్ట్‌గా వెళ్ళి, తన కొత్త కాన్సెప్ట్ గురించి వాదించడం కరెక్టా? కాదా? అనే ప్రశ్నయితే వేసుకున్నాడు గానీ.. సమాధానం మాత్రం చెప్పుకోలేకపోయాడు. అయినా.. తను యువతరం మస్తిష్కాల మీద ప్రాచీన భావజాలం పడకూడదని ఆలోచిస్తున్నాడు గానీ... సనాతనభావాలకు బందీలుగా బతుకుతున్న పాతతరానికి తాడుకట్టి, అధునాతనం వైపులాగాలని ప్రయత్నించడం లేదు.

పెద్దవారు తిట్టినా, వాటిని ఆశీర్వాదాలుగా భావించాలని జ్ఞానులు చెప్తుంటారు. పైగా అతను శోభకి తండ్రి! అన్నీ అనుకూలిస్తే భవిష్యత్తులో కాబోయే మావగారు, అంచేత తను ఆ సంఘటన గురించి పట్టించుకోకూడదని అనుకోవడంతో పాటు తన అభిప్రాయాన్ని శోభకి కూడా చెప్పాడు. తన ఇంట్లో అనుకోకుండా జరిగిన గొడవ ఎంతకు దారితీస్తుందోనని భయపడుతున్న శోభ ఆ మాటలు విని కుదుటబడింది.

జితేంద్ర తన నటబృందంతో ప్రదర్శించిన నాటకం అనుకున్న దానికంటే ఎక్కువగానే విజయవంతమయింది. శోభ ఆ ప్రదర్శనకు వెళ్లలేదు. రామదాసే ఆమెను శాసించి వెళ్లకుండా ఆపు చేసాడు. "ఆ బుర్ర తిరుగుడు వెధవ రాసి ప్రదర్శిస్తున్న నాటకానికి నువ్వు వెళ్లకూడదు. 'నాన్రుషిః కురుతే కావ్యం' అన్నారు శాస్త్రకారులు. అంటే రుషి కానివాడు కావ్యాన్ని రాయలేడని అర్థం. నాటకం దృశ్యకావ్యం కిందే లెక్కకొస్తుంది. కానీ రాసిన వాడికి హిందూ సంస్కృతి తెలియదు. పురాణ పురుషుల విలువలు తెలీవు. అలాంటి నికృష్టుడు రాసిన నాటకం చూసినా, దాని గురించి విన్నా పాపమే అవుతుంది. ఆడవారు చూస్తే, అందులోని దుష్ప్రభావాన్ని నేర్చుకుని హిందూ వైవాహిక వ్యవస్థకే కళంకం తెచ్చే ప్రమాదం ఉంది. వినయంగా ఉండాల్సిన స్త్రీ విప్లవ వనితగా మారే ఉపద్రవం ఏర్పడుతుంది. అంచేత నువ్వు వెళ్లకు" అంటూ కూతుర్ని కట్టడి చేసాడు.

నాటకం చూడడం వలన తన తండ్రి చెప్పిందంతా జరిగిపోతుందని కాకుండా ఆయనమాట కాదని వెళ్తే గొడవ మరింత పెరుగుతుందన్న భయంతోనే శోభ వెళ్లడం మానేసింది.




**ఒ**కరోజు శోభని తన బైక్ ఎక్కించుకుని జితేంద్ర శరత్ సంగమ్ థియేటర్‌లో సినిమా చూడ్డానికి మాట్నీ షోకి వెళ్లాడు. ఆరోజు మధ్యాహ్నం క్లాస్‌కి రావలసిన ప్రొఫెసరు లీవ్ పెట్టడం వల్ల, ఊరికే వెయిటింగ్ రూమ్‌లో గడపడం ఇష్టం లేక, ఆమెను తీసుకుని సినిమాకి వెళ్లాడు. బాల్కనీలో ఇద్దరూ తమకి కేటాయించిన సీట్లలోనే కూర్చున్నారు.

వారిద్దరూ బాల్కనీలో కొచ్చి కూర్చోవడాన్ని, వెనక వరుసలో కూర్చున్న ఓ వ్యక్తి గమనించాడు! అతని భృకుటి ముడిపడింది. సినిమా తెరమీద స్వాగతం స్లయిడ్ పడే సమయానికి థియేటర్లో లైట్లు ఆరాయి. ఓ నలుగురు హుషారయిన యువకులు వచ్చి, తమ సీట్ నెంబర్లు



చూసుకుని ఓ వరుసలో కూర్చున్నారు. ఆ వరుస సరిగ్గా శోభ, జితేంద్రలు కూర్చున్న వరుసకి వెనకనే ఉంది. తెరమీద ట్రయిలర్స్ వేస్తున్నారు. థియేటర్లో జనం ఎక్కువగానే ఉన్నారు. బాల్కనీ కూడా మూడొంతులు నిండింది.

హుషారుగా ఉన్న ఆ కుర్రాళ్లకి చదువు తక్కువ, అల్లరెక్కువన్న విషయం వాళ్ల మాటల్ని బట్టే తెలుస్తోంది. బిగ్గరగా మాట్లాడుతూ పగలబడి నవ్వుకుంటున్నారు. చుట్టూ ఉన్న ప్రేక్షకులకి తామెంత ఇబ్బంది కలిగిస్తున్నదీ వాళ్లు పట్టించుకోవడం లేదు. అందరూ వాళ్లవల్ల ఇబ్బంది పడుతున్నారేతప్ప ఎవరూ వారిని గదమాయించడంలేదు. ఆ నలుగురు కుర్రాళ్లలో ఇద్దరు తమ సెల్‌ఫోన్లలో బిగ్గరగా నవ్వుతూ మాట్లాడుతున్నారు.

సినిమా ప్రారంభమయింది.

ఆ విషయం గమనించి కూడా కుర్రాళ్లు సెల్‌ఫోన్లు ఆపకుండా మాట్లాడుతూనే ఉన్నారు. వాళ్లు వచ్చిన దగ్గర్నించి శోభ, జితేంద్ర వారి న్యూసెన్స్ అంతా భరిస్తూనే ఉన్నారు. సినిమా ప్రారంభమయ్యాక కూడా ఇంకా అదే ధోరణిని కొనసాగిస్తుంటే జితేంద్ర తన సహనాన్ని కోల్పోయాడు. వాళ్లవైపు తిరిగి "హలో, సినిమా బిగినయిందండి. ఇప్పుడైనా మీరు సైలెంట్‌గా ఉంటే, అందరూ ప్రశాంతంగా సినిమా చూస్తారు" అన్నాడు.

వాళ్లు 'సారీ' చెప్పి సైలెంట్ అవకుండా, గీరని ప్రదర్శిస్తూనే జవాబిచ్చారు. "రేయ్!



మహాత్మాగాంధీగారు గర్ల్‌ఫ్రెండ్‌ని తీసుకుని మ్యాట్నీషోకి వచ్చాడ్రా" ఒకడన్నాడు.

"వచ్చినప్పుడు వాళ్లపని వాళ్లు చూస్కోవడం మానేసి మనకి క్లాసులు పీకడమెందుకు? గర్ల్‌ఫ్రెండ్ ముందు ఫోజ్ కొట్టడానికా? "

"మేం సైలెంట్‌గా ఉంటానికిది లైబ్రరీ కాదు గురూ! సినిమా హాల్‌కి ఒక్కొక్కరూ ఒక్కో పనిమీదొస్తారు. ఎవరి పని వాళ్లు చూస్కోవచ్చుగా! దిసీజ్ సినిమా థియేటర్ మిస్టర్"

"అందుకే సైలెంట్‌గా ఉండమంటున్నాను. మీవల్ల అందరూ ఎంత ఇబ్బంది పడుతున్నారో దయచేసి గమనించండి. అయినా సినిమా హాల్లో సెల్‌ఫోన్లు మాట్లాడ్డం మేనర్స్ కాదండి"

"మేనర్స్ గురించి మాట్లాడేవాడివి, గర్ల్‌ఫ్రెండ్‌ని తీసుకొని ఇక్కడకెందుకొచ్చావు బాసూ? అలాగే మేమూ మాలో మేం మాట్లాడ్డానికొచ్చాం"

"మనలో మనకి గొడవెందుగ్గానీ నీ గర్ల్‌ఫ్రెండ్‌ను ఇక్కడికి పంపించు, మా సెల్‌ఫోన్లు నీకు హ్యాండోవర్ చేస్తాం. ఆ తర్వాత ఎవడిపనివాడు సైలెంట్‌గా చేస్కోవచ్చు"

"షటప్"

అంతే! క్షణాలమీద ఆ ఘర్షణ కొట్లాటగా మారిపోయింది. సినిమా ఆపేసి, థియేటర్లో లైట్లన్నీ వేసేసారు. ప్రేక్షకుల్లో ఒకరు బిగ్గరగానే అన్నారు. "ఈ మధ్య గర్ల్‌ఫ్రెండ్‌తో సినిమాలు చూడ్డం, మరో గ్రూప్ వాళ్లు వచ్చి గొడ

వలు పడటం ఎక్కువై పోయాయండి. ఇందాక పక్కవీధిలోనే టీవీ ఛానల్‌వాళ్లు ఏదో షూట్ చెయ్యడం చూసాను. వాళ్లకో ఫోన్ కొట్టి పిలిచేస్తే సరి! వీళ్ల మేట్నీ షో ఎపిసోడ్ అంతా సాయంత్రం టీవీలో ఓ గంటసేపు ఫ్రీగా చూపించేస్తారు"

"ఉండండి.. నా దగ్గర వాళ్ల ఫోన్ నెంబరుంది. వాళ్లకో ఫోన్ కొట్టేస్తాను" అంటూ ఒక వ్యక్తి తన సెల్‌ఫోన్ తీసి, టీవీవాళ్ల నెంబరుకి డయల్ చెయ్యడంలో నిమగ్నమయ్యాడు. అంతే! జితేంద్ర మనసులోని ఆవేశమంతా క్షణాలమీద ఆలోచనగా మారిపోయింది. సినిమా హాల్లోని గొడవ గురించి టీవీలో చూపిస్తే తనకేమి

కొత్తగాలి...

**కోలుకోలేని జ్వరం!**
**రూపాయి**
**పాపాయికి!**

– ఆరుద్ర శ్రీవిద్య,
ముల్కలపల్లి, వరంగల్ జిల్లా

నష్టం ఉండదు. రౌడీ కుర్రాళ్లకీ నష్టం ఉండదు. కానీ పరువు ప్రతిష్ఠలతో బతుకుతున్న రామదాసుగారి ఏకైక కుమార్తె పరువు టీవీలకి ఎక్కుతుంది. రామాయణంలోని సీత గురించి తను కాస్త విమర్శనాత్మకంగా రాస్తేనే సహించలేక తనని కొట్టాడు. ఇప్పుడు తన మూలంగా శోభ పరువు పోతే! ఆయన ఎంత మాత్రం సహించలేడు. ఈ ఆలోచన వచ్చిన క్షణమే, జితేంద్ర మాటలు ఆపుచేసి, శోభ చెయ్యి పట్టుకుని గబగబ బాల్కనీ నించి బైటకి లాక్కొచ్చాడు. థియేటర్ మెట్లు దిగుతూ, ఆమె చీర చెంగుని టీవీవాళ్లకి కనబడకుండా ఆమె ముఖం చుట్టూ చుట్టేసాడు. చూడగానే ఆమె ముఖం స్పష్టంగా కనబడ్డంలేదిప్పుడు. ఆమెతో తను టీవీ చానల్‌వారికి ఎదురుపడకుండా థియేటర్ కాంపౌండ్‌నించి బైటపడితేచాలు అనుకుంటూ గబగబ స్కూటర్ పార్కింగ్ దగ్గరకెళ్లి, పార్కింగ్ పాస్ ఇచ్చి బైక్ తీస్కుని ఆమెను వెనక కూర్చోబెట్టుకుని బైక్ స్టార్ట్ చేసి ముందుకు దూసుకుపోయాడు.

వారి బైక్ అలా బైటకి వెళ్తుంటే, ఓ ఛానల్ టీవీ రిపోర్టరు, కెమెరామేన్ మరో బైక్ మీద బయటనించి లోపలికి వచ్చారు. వాళ్లని చూడగానే అల్లరి కుర్రాళ్లు పెద్దగొంతుతో 'మిమ్మల్ని క్రాస్ చేసి వెళ్లిపోతున్న వాళ్లేనండీ ఆ ప్రేమదొంగలు! వాళ్లని ఛేజ్ చేసి పట్టుకోండి" అని అరిచారు.

వెంటనే వాళ్ల బైక్ వెనక్కి తిరిగింది. రోడ్డుమీద దూసుకుపోతున్న జితేంద్ర శోభల్ని చూసి, వాళ్లని తమబైక్‌తో అనుసరించారు. మధ్యాహ్నం మూడుగంటల సమయం కాబట్టి రోడ్డుమీద వాహనాలు ఎక్కువగా తిరగడం లేదు. జనసంచారమూ పెద్దగా కనబడ్డంలేదు. అంచేత, మొదట వెళ్తున్న బైక్‌ని సులభంగా ఓవర్‌టేక్ చేసి, వాళ్లని ఆపి మాట్లాడొచ్చని టీవీ ఛానల్‌వాళ్లు అనుకున్నారు కానీ, వాళ్లకి దొరక్కూడదన్న విషయాన్నే ప్రధానంగా పెట్టుకున్న జితేంద్ర తనకి కనిపించిన సందుల్నించి, గొందుల్నించి బైక్‌ని పోనివ్వడం వల్ల వాళ్లు టీవీ వాళ్లకి చిక్కడం లేదు. టీవీ కెమెరామేన్ తనబైక్ సీట్ మీద కూర్చునే కెమెరాని 'ఆన్' చేసాడు. కెమెరాకి తన, ముఖం కనబడకుండా శోభ తన చీర చెంగుతో మరింత కవర్ చేసింది. ఓ ఆరేడు నిమిషాల పాటు 'సినిమాటిక్ ఛేజ్' జరిగాక, శోభ ఇంటికి దగ్గర్లో ఉన్న సందులో జితేంద్ర తనబైక్‌ని

అపుచేసాడు.

"శోభా, ఆ టీవీ వాళ్ల దృష్టినుంచి తప్పించి ఇక్కడివరకు లాక్కొచ్చాను. మరేం భయపడకు. ఇక్కడికి మీ ఇల్లు దగ్గరే కాబట్టి నడుచుకుంటూ వెళ్లిపో! మీ ఇంటిముందే దింపుదామనుకున్నాను. కానీ, మీ నాన్నగారు చూస్తే సుడిగుండం నుంచి బైటపడి అగ్నిగుండంలోకి దూకిన ట్టవుతుంది. అందుకే ఇక్కడ డ్రాప్ చేసాను. భయపడకుండా ఇంటికి దర్జాగా నడుకుంటూ వెళ్లిపో" అన్నాడు.

శోభ అలాగేనని తలాడించి, తన పుస్త కాలు పట్టుకుని గబగబ తన ఇంటివైపు నడిచింది.

తెచ్చిపెట్టుకున్న ధైర్యంతో లోపలకి నడిచిన శోభ తన గదిలోకి వెళ్లి పుస్తకాలు టేబుల్ మీద పడేసి, 'హమ్మయ్య' అను కుంది. తన గదిలో పడుకున్న సత్యవతికి ఎవరో ఇంట్లోకి వచ్చినట్టనిపించి, లేచివచ్చి శోభని చూసి అడిగింది.

"అప్పుడే వచ్చేసావేం? "

"లెక్చరర్ లీవ్ పెట్టాడు. నాక్కూడా కాస్త తలనెప్పిగా ఉంది. అందుకే ఇంటికొ చ్చేసాను. నువ్వెళ్లి పడుకో" అంది శోభ కాస్త చిరాగ్గా.

సత్యవతి వెళ్లి పడుకుంది.

శోభ కూడా తన మంచం మీద పడు కుని నిద్రపోదామని కళ్లు మూసుకుంది. కానీ, ఆమె మనసు నిద్రపోలేకపోవడం వలన ఆలోచనలు రాకెట్ వేగంతో పరు గెడుతున్నాయి. టీవీ కెమెరాకి తన ముఖం కనబడకుండా తను చాలా జాగ్ర త్తపడింది. అయినా ఒక్కసారైనా కనిపిం చేసిందేమో! టీవీవాళ్ల దగ్గర చాలా శక్తి మంతమైన కెమెరాలు ఉంటాయని చెపు తుంటారు. చాలాసేపు సమాధానం దొర కని ప్రశ్నలతో సతమతమవుతూనే మంచంమీద అటూ ఇటూ దొర్లింది.

ఓ గంటన్నర గడిచాక ఆ వీధిలో ఉండే సరోజిని బైటనుంచి హాల్లోకొచ్చి "సత్యవ తమ్మ గారూ! సత్యవతమ్మ గారూ!" అంటూ పిలిచింది.

"ఎవరు? "

రామదాసు గదిలోనించి అతని గొంతు ఖంగుమంటూ వినిపించింది.

శోభ దిగున లేచి కూర్చుంది. తన తండ్రి నిద్ర లేచాడని గ్రహించి, కాస్త భయపడుతూనే "నేను చూస్తాను నాన్న గారూ, మీరు రాస్కోండి" అంటూ హాల్లోకి వచ్చి సరోజినిని పలకరించింది.

"ఏంటి సరోజినిగారూ!"

ఆవిడ ముఖమంతా నోరు చేసుకుని "అరే.. నువ్వు ఇంట్లోనే ఉన్నావా శోభా? " అంది.

"ఉన్నానండి. తలనెప్పిగా ఉందని కాలే జీ నుంచి వచ్చేసి పడుకున్నాను"

సరోజిని అక్కడున్న సోఫాలో కూర్చుని "ఇప్పటిదాకా డబ్ల్యూటీవీ చూసి ఉండబట్ట లేక వచ్చేసాను" అంది.

శోభ గుండె ఒక్కక్షణం ఆగింది. తనని ఇందాక కెమెరాతో వెంటాడింది డబ్ల్యూ ఛానల్ వాళ్లే! తన ముఖం టీవీలో కొద్దో గొప్పో కనబడబట్టే, సరోజిని పనిగట్టు కొచ్చి ఆ టీవీ ఛానల్ విషయం మాట్లా డుతోందా?

"నువ్వా ఛానల్ చూడలేదా? " సరోజినీ అడిగింది.

"పడుకున్నానని చెప్పానుగా"

సత్యవతి ఓ గదిలోనించి వచ్చింది. "నువ్వు ఏం చూసావని ఆ సంగతి అడు గుతున్నావు? " అని అడిగింది.

"మరేం లేదండి. ఇప్పుడా ఛానల్‌లో భలే స్టోరీ చూపించారు. ఈ మధ్య కొంత మంది కాలేజీ కుర్రాళ్లు, అమ్మాయిలు కాలేజీ ఎగ్గొట్టి మ్యాట్నీ సినిమాలకి లాగిం చేస్తున్నారట. ఇప్పుడలాంటి జంట

గురించి చూపించారు. టీవీవాళ్లని చూసి కుర్రాడు, అమ్మాయి మోటార్ సైకిల్ మీద ఉడాయించారు. అయితే టీవీవాళ్లు ఊరు కుంటారేటి? వాళ్లూ మరో మోటార్ సైకిల్ మీద వెంటాడారు. ఆ అమ్మాయి తన ముఖం కనబడకుండా పైటచెంగు ముఖం చుట్టూ కప్పేసుకుంది"

రామదాసు ఎప్పుడు అక్కడికొచ్చాడో ఎవరూ గమనించలేదు. "ఈ విషయాన్ని ఎందుకంతగా పనిగట్టుకొచ్చి చెప్తున్నావు? ఇది నేను రామాయణం రాసుకునే టైమ్" కర్కశంగా ప్రశ్నించాడు.

సరోజిని కాస్త భయపడి "నేను తర్వాత వస్తానండి" అంటూ వెళ్లబోయింది.

"ఎలాగూ వచ్చి నా ఏకాగ్రతకి భంగం కలిగించేసావు గదా! టీవీలో న్యూస్ ఛానల్ వాళ్లు లక్షాతొంభై వ్యవహారాల గురించి చెప్తుంటారు. అందులో ఏ విషయాన్ని చూసొచ్చి మా వాళ్లకు విషయం చెప్తున్నావు? ఫర్వాలేదు చెప్పు" గద్దించినట్టు అన్నాడు రామదాసు.

సరోజిని కాస్త ధైర్యం పుంజుకుని "మరేం లేదండి. ఆ కాలేజీ అమ్మాయి వెనక నుంచి మన శోభలా ఉంటేనూ.. ఆ ఉంగరాల జుత్తు... ఆ చీర... ఆ డిజైను... ఇప్పుడు కట్టుకున్న చీర ఒక్కలాగే ఉంటేను" ఆమె చెప్తూనే ఉంది.

శోభ మనసు భగభగలాడింది. తను ఇంటికి క్షేమంగా చేరిపోయాననే ధైర్యపడింది గానీ, ఇంటికి రాగానే చీర మార్చేసుకోవాలనే ఐడియా తట్టనందుకు బాధపడింది.

"ఇంక ఆపుతావా? " రామదాసు గర్జించే సరికి సరోజిని ఆగిపోయింది.

"ఎవరో అమ్మాయి.. ఎవరో కుర్రాడితో.. ఏదో సినిమాకి వెళ్తే దాన్ని తమ వ్యాపారానికి వాడుకోవడానికి ఆ టీవీవాళ్లు వెంటాడి మరీ కెమెరాతో చిత్రీకరించారు. దాన్ని నువ్వు టీవీలో చూసి, గబగబ మా ఇంటికి పరుగెత్తుకొచ్చేసావు. ఆ అమ్మాయి మా శోభేనని నీ అనుమానం. కానీ, నువ్విక్కడికి రాగానే నీకు శోభ కనిపించింది. అయినా, నీ సందేహం తీరక ఆ అమ్మాయి వెనకనించి అచ్చం శోభలాగే ఉందనడానికి నీకెంత ధైర్యం? ఆ ఉంగరాల జుత్తు, ఆ రంగు, ఆ డిజైనూ, అంటూ వివరాలు చెప్తున్నావు... ఈ లోకంలో ఉంగరాల జుత్తు మా అమ్మాయి ఒక్కదానికే ఉంటుందా? ఈ రంగు, ఈ డిజైన్ ఉన్న చీరని ఆ బట్టల కంపెనీ వారు ఒక్కటే తయారు చెయ్యరుగదా? "

"అది కాదండి.." అంటూ ఏదో చెప్పబోయింది సరోజిని.

"నోర్మూయ్.. అని నా చేత అనిపించకు సరోజినీ! శోభ ఎవరు? నా కూతురు! ఆ సంగతి తెల్సికూడా నీకా సందేహం వచ్చిందంటే.. అది నా పెంపకానికే అవమానం"

సరోజినికి ఎప్పుడూ ధుమధుమలాడే రామదాసంటే సహజంగానే భయం. ఇప్పుడు కూతురు గురించి, తన పెంపకం గురించి అంత ఆవేశంగా చెప్తున్నప్పుడు బదులు చెప్పడానికే కాదు.. ఎదురుగా నిలబడ్డానికే ధైర్యం చాలక, బైటికి వెళ్లిపోయింది.

రామదాసు ఇంకా ఏదో అనబోతుంటే... అతని సెల్ ఫోన్ మోగింది. గబగబా గదిలోకి వెళ్లి ఫోన్ అందుకుని "నమస్కారం యజ్ఞన్న బావగారూ" అన్నాడు మాటల్నిండా మర్యాద ప్రదర్శిస్తూ.

అతని పేరు వినగానే శోభ మనసు కాస్త భయంతో వణికింది.

సత్యవతి భర్త దగ్గరికి వెళ్లింది. అవతల్నించి ఇచ్ఛాపురం యజ్ఞన్న మాట్లాడుతున్నాడు.

"మీరు ఇందాక టీవీలో డబ్ల్యూ ఛానల్ చూశారా? మీరు చూడకపోయినా నేను

చూసాన్లెండి.."

రామదాసుకి ఆ ప్రస్తావన అర్థంకాక "బావగారూ! మీరేం మాట్లాడుతున్నారో.." అంటుంటే యజ్ఞన్న అతన్ని మాట్లాడనివ్వ కుండా తనే మాట్లాడాడు. "మీకు అర్థం కాకపోయినా నాకు అర్థమయింది. మీ అమ్మాయి తన ప్రేమికుడితో సినిమాకి వెళ్లి, అక్కడ ఎవరో అల్లరి కుర్రాళ్లతో గొడ వపడ్డం.. అక్కడ ఉన్న మీకు తెలియకపో యినా, అదే థియేటర్ బాల్కనీలో ఉన్న మా రామనాథం కళ్లారా చూసే నాకు ఫోన్ చేసి చెప్పాడు"

"అది కాదు బావగారూ... లోకులు కాకులు కాబట్టి..."

"హుఁ! మీ సంబంధం చాలా గొప్పదని నాకు ఫోన్ చేసి మీ ఇంటికి రప్పించింది రామనాథ నామధేయుడైన.. ఆ కాకే! ఇవాళ సినిమా హాల్లో మీ అమ్మాయిని బాయ్‌ఫ్రెండు సమేతంగా చూసింది.. ఆ కాకే! డబ్ల్యూటీవీ ఛానల్ వాళ్లు అక్కడికి రాబోతుంటే, భయపడి ఆ ప్రేమికుల జంట పారిపోతుంటే, ఆ ఛానల్ వాళ్లు వెంటాడి మరీ షూట్ చేసారని నాకు ఫోన్ చేసింది.. ఆ కాకే! వెంటనే నేను టీవీ ఆన్ చేసి ఆ ఛేజ్ ని చూసాను. మీ అమ్మాయి తన ముఖం కనబడకుండా ఎంత ప్రయత్నించినా, నా దిక్కుమాలిన కళ్లు ఆమెని గుర్తు పట్టేసాయి. అందుకే మీకు ఫోన్ చేసి, నా నిర్ణయం చెప్పకపోతే మీరు మరో సంబంధాన్ని చూసుకునే అవ కాశం ఉండదు గదా! ఈ పరిస్థితుల్లో మీ సంబంధాన్ని వదులుకుంటే అది మా తప్పవదని మీకూ తెలుసు కదా! ఎందు కంటే మీరు అరిషడ్వర్గాల్ని, రాగద్వేషాల్నీ వదులుకున్న అభినవ వాల్మీకి కదా!" యజ్ఞన్న మాటల్ని ఆపి ఫోన్ కట్ చేసాడు.

రామదాసు ఆవేశంతో కంపించాడు. తను ప్రాణప్రదంగా భావించే తన అభి

## భలే భలే!

సుప్రసిద్ధ ఫ్రెంచ్ రచయిత అలెగ్జాండర్ డ్యూమా తన రచనలను రంగు రంగు కాగితా లమీదే రాసేవాడట! కవితలైతే పసుపు రంగు, వ్యాసాలు గులాబీ, నవలలు నీలం రంగు కాగి తాలమీదే రాసేవాడట! రంగు మారితే రచన మారినట్టే!

జాత్యం మీద, ఆత్మగౌరవం మీద యజ్ఞన్న కమ్చీతో కొట్టినట్టుగా గిలగిల్లాడిపోయాడు. తనకూతురు ఓ యువకుడితో తిరుగుతు న్నదని ఆరోపించడమే కాకుండా ఆధారాలు కూడా చెప్తున్నాడు కాబట్టి అతని తప్పేం లేదు. తన పెంపకం మీద తనకో నమ్మకం.. తనలాంటి పెంపకం మరొకరు చెయ్యలేరని గర్వపడ్డాడు. వర్తమాన సమా జంలోని మిగతా కుటుంబాలకంటే తన కుటుంబం ఓ మినహాయింపని భావిస్తూ వచ్చాడు. ఇప్పుడు తన కూతురు వాట న్నింటి మీద దెబ్బకొట్టింది.

తండ్రి ముఖంలో కనబడుతున్న మార్పుల్ని బట్టి, అతని ఆలోచనలు ఎలా అతన్ని ఉద్రేక పరుస్తున్నాయో శోభ గమ నించింది. అతను అడగబోయే ప్రశ్నలకి తను చెప్పబోయే సమాధానాన్ని సిద్ధం చేసుకునే ప్రయత్నంలో పడింది.

"ఫట్"

శోభ చెంప పగలగొట్టాడు రామదాసు. కూతుర్ని ప్రశ్నించాక కొట్టాలనుకున్నా, ఆ నిర్ణయాన్ని అతని ఆవేశం అధిగమిం చింది.

"ఎవడా వెధవ?"

శోభ తన ప్రేమ విషయం చెప్పడానికి కొన్ని క్షణాలపాటు తటపటాయించింది. సత్యవతి ఆ స్వల్ప వ్యవధిని వుపయోగిం

చుకుని చెప్పింది!

"యజ్ఞన్నగారి కొడుకుతో నిశ్చితార్థం జరక్కపోయినా, నిన్ను తమకోడల్ని చేసుకుంటామని మాటిచ్చారు. కనీసం, ఆయనొచ్చి నిన్ను చూసినప్పుడైనా, నేను ఫలానా అబ్బాయిని ప్రేమించానని చెప్పుంటే..."

"నోర్ముయ్"

రామదాసు అరవడమే కాకుండా భార్యని కొట్టడానికి చెయ్యెత్తాడు. "అది కాదండీ, ఆ అబ్బాయెవరో తెల్సుకుంటే..? " సత్యవతి భయపడుతూనే గొణిగింది.

"తెల్సుకుంటే మాత్రం పెళ్లి చేసేస్తామా? నా నిర్ణయాల్ని, మన సంప్రదాయాల్ని విస్మరించి, అది యిష్టపడినవాడికే యిచ్చి పెళ్లి చేసేస్తానని ఎలా అనుకున్నావ్? అలా అనుకోవడానికి నువ్వెవరివి? ప్రేమించడానికి కులమతాలతో పని లేకపోవచ్చు కానీ పెళ్లి అనేసరికి కులం, మతం, గోత్రం, వాళ్ల కుటుంబం, దాని చరిత్ర యిలాంటి లక్షాతొంభై ఆలోచించాలి. అయినా.. యింత సంప్రదాయబద్ధంగా కొనసాగుతున్న మన వంశంలో యీ దిక్కుమాలిన ప్రేమజాడ్యం దీనికెలా పట్టుకుంది? "

శోభకి, రామదాసుకి మధ్య వాదన జరిగింది. తండ్రిగా రామదాసు అధికారాన్ని ప్రదర్శించినా, సంప్రదాయబద్ధ జీవితాన్ని సమర్థించినా, కులమతాలకి పెద్దపీట వేస్తూ మాట్లాడినా.. శోభ కూడా ఏమాత్రం తగ్గకుండా వాదించింది.

"నేను జితేంద్రని ప్రేమించాను. అతనూ నన్ను యిష్టపడ్డాడు" శోభ ధైర్యంగా తన అభిప్రాయం చెప్పింది.

"పెళ్లి విషయంలో ఇష్టాయిష్టాలకంటే... మంచిచెడ్డలే ప్రధానం" రామదాసు కచ్చితంగా చెప్పాడు.

"మీకు తోచిన మంచికి మీరు లాభం పొందుతారేమో గానీ, నాకిష్టంలేని పెళ్లి చేస్తే నష్టపోయేది నేను. జితేంద్ర ఆర్థికంగా పేదవాడే కావచ్చు. కానీ గుణానికి మాత్రం గొప్పవాడే. మన కులంవాడు, ధనవంతుడయితే నేను సుఖపడతానని మీ అభిప్రాయం. కానీ కులాల్తో, డబ్బుతో ప్రమేయం లేకుండా ఒకర్నొకరు అర్థం చేసుకుని పెళ్లి చేసుకుంటే, వాళ్లు తప్పకుండా సుఖంగా జీవిస్తారు.. ఇది నా నమ్మకం"

వాదన ఊగే ఉయ్యాల లాంటిది. ఎంత ముందుకు వెళ్తుందో అంత వెనక్కి కూడా వస్తుంది. ఆ తండ్రీకూతుళ్ల వాదన సమాంతరంగా సాగుతోందే తప్ప, ఎక్కడా ఏ పాయింట్ దగ్గరా కలవడం లేదు.

"యవ్వన సహజమైన ఆవేశాలకి, వ్యామోహాలకి ప్రేమ అని పేరు పెట్టుకోవడం.. ఆ ప్రేమకోసం పెద్దల్ని, సంప్రదాయాల్ని, వంశగౌరవాన్ని ఎదిరించి పెళ్లిళ్లు చేసుకోవడం.. యీ మధ్య పెచ్చుమీరిపోయింది. ఈ ప్రపంచంలో ప్రేమ లేకుండా నూటికి తొంభై మంది బతుకుతున్నారు. కానీ డబ్బు లేకుండా బతుకుతున్నవాణ్ణి ఒక్కణ్ణి.. ఒక్కణ్ణి చూపించు. ప్రేమనే వ్యామోహంలో మునిగిపోయినప్పుడు ప్రేమే సర్వస్వం అనుకుంటారు. కానీ సంసారంలో పడ్డాక అడుగడుగునా అవసరమయ్యేది.. డబ్బే! ఆ డబ్బు లేకపోతే

### కొత్తగాలి...

**మనమింకా**
**బానిసలం**
**నాడు ఇంగ్లండుకు**
**నేడు ఇటలీకి!**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

యీ ప్రేమికులంతా మొట్టమొదట మర్చిపోయేది కూడా... ప్రేమనే! నేను కుటుంబ జీవనం సాగిస్తూనే, తపస్సు చేసుకునే యోగిలాగ బతుకుతున్నాను. ఆధ్యాత్మిక చింతనలో పడి రామాయణాన్ని రాస్తున్నాను. నీ పెళ్లి ఒక్కటే నా జీవితానికి మిగిలిన బాధ్యతగా భావిస్తున్నాను. నిన్నో గొప్పింట్లో యిచ్చి, ఆకాశవీధుల్లో అందలాల మీద తిప్పుదామనుకున్నాను. కానీ.. నువ్వు ఎవడో అనామకుణ్ణి, ఎలాంటి ఆస్తిపాస్తుల్లేనివాణ్ణి యిష్టపడి నీ జీవితాన్ని నీ చేతుల్తోనే నాశనం చేస్కుంటున్నావు. మన బంధువర్గంలో నాకో ప్రత్యేకత వుంది. ద్విభాషా పండితుణ్ణి కావడంతోపాటు సనాతన సంప్రదాయాన్ని కచ్చితంగా అమలు చేయడమే ఆ ప్రత్యేకతకు కారణం! ఇప్పుడు రామాయణ మహా గ్రంథాన్ని రాస్తుండడం వల్ల మన బంధువర్గంలో వున్న ఏకైక కవిని నేనేనన్న గౌరవం కూడా కలిగింది. కానీ.. అదంతా, నువ్వో యితర కులస్థుణ్ణి పెళ్లి చేస్కోవడం ద్వారా సర్వనాశనమవుతుంది. పరువుగా బతుకుతున్న నన్ను నీ దిక్కుమాలిన ప్రేమ అగాథంలోకి లాగేస్తోంది. ఇలా చెయ్యడం న్యాయమా? ఆలోచించి ఎల్లుండి చెప్పు"

ఆ రోజుకి ఆ వాదన ముగిసింది. కూతురికి ఆలోచించుకునే అవకాశం యిచ్చినా శోభ ఆ అవకాశాన్ని వినియోగించుకుని ఆలోచించలేదు.

మర్నాడు మధ్యాహ్నం భోజనాలయ్యాక, రామదాసు పడుకున్న సమయంలో శోభని దగ్గర కూర్చోబెట్టుకుని సత్యవతి "మీ నాన్నగారు చెప్పిందాని గురించి ఆలోచించావా? " అని అడిగింది. శోభ ఏదో మేగజైన్ చదువుకుంటూ జవాబు చెప్పలేదు. సత్యవతి చిరాగ్గా కూతురు చేతిలోని పుస్తకం లాగేసింది. "ఆలోచించావా అని అడుగుతుంటే సమాధానం చెప్పవేంటే? " అంది.

శోభ యథాలాపంగా జవాబు చెప్పింది. "దేనికమ్మా ఆలోచించడం? నేను చేసింది తప్పా? రైటా? అనే సందేహం వుంటే ఒకటికి నాలుగుసార్లు ఆలోచించాలి. కానీ నేను చేసింది, చేస్తున్నది రైటేనని నాకు తెలుసు"

"నువ్వు చేస్తున్నది కరెక్ట్‌కాదని మీ నాన్నగారు చెప్పేరుగా? "

"చెప్పేరు. ఆయన కులమతాల గురించి ఆలోచిస్తున్నారు. నేను గుణగణాల్ని గురించి ఆలోచిస్తున్నాను. ఆయన డబ్బుంటే సుఖంగా జీవిస్తారని నమ్ముతున్నారు. నేను ప్రేముంటే సుఖంగా బతుకుతారని నమ్ముతున్నాను. ప్రేమించింది... నేను! పెళ్లి చేసుకునేది... నేను! నేను తీసుకున్న నిర్ణయంలో ఏదైనా తప్పుంటే, దానికి శిక్ష అనుభవించేది కూడా నేనే! అలాంటప్పుడు ఆయనెందుకు సంకోచిస్తున్నారు? మన బంధువర్గంలో ఆయనకి అప్రతిష్ఠ కలుగుతుందనా? ఒకవేళ ఆయనకి కావలసిన పరువు ప్రతిష్ఠలకోసం నేను నా ప్రేమని చంపుకోవలసిన పరిస్థితే ఏర్పడితే.. ప్చ్! వద్దులే! ముందుగా చెప్పడం వల్ల ప్రయోజనం వుండదు" శోభ ఆ మాటలు చెప్పేసి అక్కణ్ణించి వెళ్లిపోయింది.

కూతురి మాటల్లో అంతర్లీనంగా ఏదో తెగింపు ధ్వనిస్తోంది. అయితే ఆ తెగింపుకుండే స్వరూప, స్వభావాలు సత్యవతికి అర్థంకాకపోయినా.. మనసు మాత్రం ఏదో కీడుని శంకించింది. మర్నాడు వుదయం శోభ పక్కింటికి వెళ్లినప్పుడు సత్యవతి, పద్యాలు రాసుకుంటున్న రామదాసు దగ్గరకెళ్లి అక్కడున్న కుర్చీలో కూర్చుంది.

"మనసు మార్చుకుందా? " రాస్తూనే

అడిగాడు రామదాసు.

కొన్ని క్షణాలపాటు తటపటాయించి "లేదు" అంది సత్యవతి.

రామదాసు కలం ఆగింది. "అంటే..? మన పద్ధతులు, సంప్రదాయాలు, పెంపకాలు, నమ్మకాలకంటే తన ప్రేమే గొప్పదని చెప్పిందా? "

సత్యవతి మౌనం వహించింది. రామదాసు మాటకీ మాటకీ మధ్య ఎక్కువ టైమ్ తీసుకుంటూ మాట్లాడ్డం బట్టి... అతని మనసు ఎంతగా కలత చెందిందో ఆమె అర్థం చేసుకుంది. అలా ఓ పది నిమిషాలు గడిపాక సత్యవతి కాస్త ధైర్యం చేసుకుని తన మనసులోని మాటని బైట పెట్టింది.

"శోభ మనకి ఒక్కగానొక్క కూతురు. దాని ప్రేమని, దాని అభిప్రాయాన్ని సమర్థిస్తూ మాట్లాడ్డం లేదు. చాలా విషయాల్లో.. మన నమ్మకాలు, వాస్తవాలు వేర్వేరుగా వుంటాయి. శోభ గొడవ యింతవరకు వచ్చి, బంగారంలాంటి ఓ సంబంధం తప్పిపోయాక మనం మాట్లాడుకోవల్సింది వాస్తవాల్నే.

అది మనసు మార్చుకోనంటోంది. మన దృష్టిలో కులగోత్రాలు, సంప్రదాయాలు ఎంతముఖ్యమో, దాని దృష్టిలో దాని ప్రేమ కూడా అంత ముఖ్యమని వాదిస్తోంది. దాని ప్రేమకి మనం అంగీకరించకపోతే తెగిస్తాననే చెప్తోంది"

"దేనికి తెగిస్తుందట? " రామదాసు శూన్యంలోకి చూస్తూ అడిగాడు.

"ఈ కాలపు ఆడపిల్లలు చదువుల్లో ఎంత ముందుకు దూసుకుపోతున్నారో ప్రేమ విషయాల్లో అంతగా తెగించేస్తున్నారు. కొంతమంది వాళ్ల ప్రేమలు విఫలమవ్వగానే ఆత్మహత్యలకి పాల్పడుతున్నారు. మరికొంతమంది లేచిపోడానికి కూడా సిద్ధపడుతున్నారు. రేపు అది ఈ రెండుపనుల్లో ఏది చేసినా మనకి కడుపుకోత మిగులుతుంది. మనం జీవచ్ఛవాల్లా మిగిలిపోతాం. అంచేత, ఆ జితేంద్ర ఎవరో కనుక్కోండి. మన వర్ణంవాడు కాకపోయినా, యింకా అగ్రవర్ణాలు కొన్ని వున్నాయిగా! ఆ వర్ణం వాడయినా మనం రాజీ పడొచ్చు. మన బంధువర్గంలోనే రెండుమూడు పెళ్లిళ్లు ఆ తరహాలోనే జరిగాయిగా! ఇంకా... ఆర్థిక స్థితిగతులంటారా.. మనకంటే ఉన్నతుడు కాకపోయినా, కనీసం మనకి సమాన స్థాయివాడైనా ఫర్వాలేదని సరిపెట్టుకుందాం"

రామదాసు మధ్యలో ఆపకపోవడంవల్ల తను చెప్పాలనుకున్నదంతా పూర్తిగానే చెప్పింది సత్యవతి! ఆమె చెప్పిందానికి అంగీకరించకపోయినా, కాదని కూడా ఒక్కమాట అనలేదు. అతను ఆలోచనలో పడ్డాడని గ్రహించి సత్యవతి ఆ గదిలోనించి వెళ్లిపోయింది. అతనికి రాస్తున్న పద్యాలమీద ఏకాగ్రత కలగలేదు. మనసు బరువెక్కడంవల్ల కలం ముందుకు సాగడంలేదు. తీవ్రమైన అలజడితో కూడిన ఆందోళనకి గురయ్యాడు.

ఈ లోకంలో రెండు రకాల మనుషులున్నారు. ఏదో ఒక రకంగా బతికేవాళ్లు మొదటివర్గం వారు. అలాంటి వారి సంఖ్యే సమాజంలో అధికశాతం కనిపిస్తుంది. 'నేను ఇలాగే బతకాలి!' అనుకునేవారు రెండో వర్గానికి చెందుతారు. అలా బతకడానికి తగిన నియమనిబంధనల్ని ఏర్పర్చుకుంటారు. అలా అనుకున్నవారి సంఖ్య మొదటి దానికంటే తక్కువే వుంటుంది. వీళ్ళు జీవితంలో కొన్ని యిబ్బందులు ఎదుర్కుంటారు. మొదటి తరహా మనుషులు వాళ్లకి నచ్చిన పని జరక్కపోయినా, జరిగినపనే నచ్చిందని రాజీ పడిపోతారు. అలాంటి వారి జీవితాల్లో ఒత్తిడీ వుండదు, ఒడిదుడుకులూ వుండవు. కానీ రెండో తర

గతి మనుషులు తాము అనుకున్నట్టే జరగాలనుకుంటారు. అలా జరిపించుకోడానికి ఎంతమందినైనా బాధపెడతారు. వీళ్ళూ బాధపడతారు తప్ప.. రాజీమాత్రం పడరు. అలాంటివారిని కార్యసాధకులంటారు. ఇది లోకంలోని మనుషుల గురించి రామదాసు అభిప్రాయం!

తనూ అలాంటి కార్యసాధకుడే! కొన్నిరోజుల క్రితంవరకు రామదాసుకి ఈ అభిప్రాయం వుండేది.

తనలాంటి కార్యసాధకులకి కూతుళ్లు పుట్టకూడదు. పుట్టినా ప్రేమలో పడకూడదు. పడినా యితర కులాలవాడితో పడకూడదు. యిది యిప్పుడిప్పుడే ఆయనలో ప్రాణం పోసుకుంటున్న కొత్త అభిప్రాయం! ఆ రోజంతా తన భార్య చెప్పిన మాటల గురించి ఆలోచించాడు. మర్నాడు తన ఆత్మీయ మిత్రుడైన జ్ఞానేశ్వర్ యింటికి వెళ్ళాడు. ఏదైనా ఆంతరంగిక విషయం మాట్లాడాలనుకున్నప్పుడు అతనినే సంప్రదిస్తాడు. ఆ యింటికెళ్లి, అతన్ని వరండాలోకి తీసుకొచ్చాడు. అంత ఆత్మీయ మిత్రుడిక్కూడా, తన కూతురి ప్రేమవిషయం చెప్పకుండా "మన సామాజిక వర్గంవాడు కాకుండా, మరో వర్ణానికి చెందినవాళ్లు మా శోభని చేసుకుంటామనొచ్చారు. నీ అభిప్రాయం ఏంటి? " అని అడిగాడు.

జ్ఞానేశ్వర్ క్షణం కూడా తడుముకోకుండా చెప్పాడు. "లోగడే మన సమాజంలో కులాధిపత్యం వుండేది. అప్పుడు మన కులాలవారు అగ్రస్థానంలో వుండేవారు. కానీ కాలగమనంలో ధనాధిపత్యం ఆరంభమయింది. ఇక మీదట కూడా అదే అగ్రస్థానంలో వుంటుంది. వ్రతం చెడినా ఫలితం దక్కాలంటారు గదా! మన వర్ణం వాడిక్కాకపోయినా, ధనవంతుడైన మరో అగ్రవర్ణం వాడికిచ్చి ఆడపిల్ల పెళ్ళి జరిపిస్తే, మనవాళ్లెవరూ కిక్కురుమనరు.

## సుదీర్ఘ సాహితీ ప్రస్థానం



**కాశీ విశ్వనాథ్**

**సు**దీర్ఘమైన నా సాహితీ జీవిత ప్రస్థానంలో అనేక మంచి రచనలు చేశాను. ఇప్పటివరకు 38 నవలలు, 125 కథలు, 53 నాటకాలు, 128 సినిమాలు రాసాను. 137 చిత్రాల్లో నటించాను. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, నంది అవార్డులు, తెలుగు విశ్వవిద్యాలయంవారి ఉత్తమ రచయిత పురస్కారాలు పొందాను. గత నూరేళ్లలోని ఉత్తమ కథారచయితలైన 97మందిని ఎంపిక చేసి వారి ఒక్కో కథతో కళాసాగర్, మద్రాసువారు 'కథాసాగర్' అనే కథాసంపుటిని వెలువరించారు. ఆ రచయితల్లో నేనూ ఒకణ్ణి కావడం, ఆ కథాసంపుటిని ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వారి సివిల్స్ గ్రూప్ -1 మెయిన్స్ సిలబస్‌లో చేర్చడం నా అదృష్టం. విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ వారు ఈ శతాబ్దంలో వచ్చిన వేలాది నాటికల నుంచి ఉత్తమ సామాజిక ప్రయోజనం కలిగిన 58 నాటికల్ని ఎంపిక చేసి ఓ సంకలనాన్ని ప్రచురించారు. అందులోనూ నా నాటిక 'మీరైతే ఏం చేస్తారు' (1971) ఎంపికైంది.

చిరునామా:
**కాశీ విశ్వనాథ్**
31-30-37, నారాయణ స్ట్రీట్,
లీలా మహల్ దగ్గర,
దాబా గార్డెన్స్,
విశాఖపట్నం-530020

మరో విషయం.. మరో అగ్రవర్ణం వాడయినా, వాడికి ఆస్తిపాస్తులు, మంది మార్బలం, మంచి కుటుంబనేపథ్యం వుంటేనే వాళ్లు మనకి సమానమవుతారు" అంటూ చాలాసేపు ఆ విషయం గురించే ఆయన చెప్పాడు. నిన్న తన భార్య చెప్పిందీ, యిప్పుడీ మిత్రుడు చెప్పిందీ దాదాపుగా ఒక్కలాగే వుంది. ఆ రోజంతా ఆలోచించాక మర్నాడు జితేంద్ర గురించి వివరాలు తెలుసుకోవాలన్న వుద్దేశ్యంతో యూనివర్సిటీకి వెళ్ళాడు. శోభని జితేంద్ర గురించి అడిగితే అతిశయోక్తులు చెప్పొచ్చు. అతని స్నేహితుల్ని కనుక్కుంటే అబద్ధాలు చెప్పొచ్చు. అంచేత జితేంద్ర

## కొత్తగాలి...

**మంచి పుస్తకం**
**మెదడుకు పదును!**
**సరైన విత్తనం**
**పంటకు మెరుగు!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

చదివే కాలేజీ ప్రిన్సిపాల్ భూషణం దగ్గరకే వెళ్ళాడు.

ఆ సమయంలో భూషణం కాస్త ఖాళీగానే వున్నాడు. ఆయన రూమ్‌లోకి వెళ్ళాక రామదాసు తను రామాయణం రాస్తున్న రచయితనని చెప్పాడు. ఆమాట వినగానే 'మీ గురించి విన్నాను' అన్నట్టుగా చూసి... అంతలోనే అతను తమాయించుకుని 'నమస్కారం.. కూర్చోండి!' అని మాత్రం అన్నాడు.

రామదాసు ఎదుటి కుర్చీలో కూర్చుని "నేను మీకు తెలుసా? " అని అడిగాడు.

"తెలీదు, ఏం అలా అడిగారు? "

"ఆహా! నాపేరు వినగానే మీరు నన్ను బాగా తెలిసినట్టుగా.. "

"అదేం కాదండి. మిమ్మల్ని చూడగానే మీరేదో ఆశ్రమం నించొచ్చిన స్వామీజీలా అనిపించి అలా రియాక్ట్ అయ్యాను. చెప్పండి, ఏం పనిమీదొచ్చారు? "

రామదాసు పెళ్ళి విషయం, ప్రేమ విషయం చెప్పకుండా "మీ కాలేజీలో చదువుతున్న జితేంద్ర అనే అబ్బాయి గురించి నాక్కాస్త సమాచారం కావాలి. అంటే... అతని స్వస్థలం ఏమిటి? తల్లిదండ్రులెవరు? తత్సంబంధమైన వివరాలు దయచేసి చెప్పగలరా? అవన్నీ మీ రికార్డ్స్‌లో వుంటాయి కదాని? " అన్నాడు.

భూషణంగారు చిన్నగా నవ్వి "ఇవే ప్రశ్నలు పోలీసులడిగితే.. అతను ఏ నేరం చేసాడని అడుగుతాను. కానీ మీబోటి పెద్ద మనుషులు అడిగితే, అది కచ్చితంగా పెళ్ళి నిమిత్తమే అడిగారనుకుంటాను" అన్నాడు.

రామదాసు కాస్త యిబ్బంది ఫీలవుతూ "అబ్బే.. అలాంటిదేం లేదులెండి" అన్నాడు.

"సర్లేండి.. మీరు ఎందుగురించి అడిగినా, జితేంద్ర వివరాల్ని అతని రికార్డ్స్ ఏవీ చూసి చెప్పక్కర్లేదు. అతని గురించి అంతా తెలిసినవాణ్ణి నేనే" భూషణం నవ్వుతూ చెప్పాడు.

"మీ కాలేజీలో జాయినయిందగ్గర్నుంచీ మీకు తెలిసుంటుందనుకోండి"

"కాదు, నాకు జకరయ్య చాలాకాలం నించీ తెలుసు"

"జకరయ్య ఎవరు? "

"కొన్నేళ్ళక్రితం వరకు అతను మా కాలేజీలోనే అటెండర్‌గా పని చేసేవాడు. అతన్ని తీసుకొచ్చి ఆ వుద్యోగంలో వేయించింది నేనే! బట్, ఆయనిప్పుడు లేడనుకోండి"

భూషణం ఎందుకంత ప్రత్యేకంగా చెప్పున్నాడో రామదాసుకి అర్థం కాలేదు. "నేను అడిగింది జితేంద్ర గురించి" అన్నాడు.

"అందుకే జకరయ్య గురించి చెప్పేను. జకరయ్య జితేంద్రకి పెంపుడు తండ్రి"

"పెంపుడు తండ్రా? మరి కన్న తల్లిదండ్రులెవరు? "

"ఎవరంటే ఏం చెప్పమంటారు? చాలా సంవత్సరాల క్రితం, ఓ తెల్లారుజామున ఓ కాలవ దగ్గరున్న డస్ట్‌బిన్‌లో క్యార్‌క్యార్‌మని ఏడుస్తున్న ఓ పసికందుని ఎవరో పుణ్యాత్ముడు తీసుకొచ్చి అనాథాశ్రమంలో వేసాడట. జకరయ్యకి అప్పటికి పెళ్లయి ఆరేడు సంవత్సరాలయినా పిల్లలు పుట్టకపోయేసరికి నన్ను సలహా అడిగాడు. నా సలహాతోనే, అనాథాశ్రమం నించి ఓ బిడ్డని తీసుకొచ్చి పెంచుకున్నాడు. ఆ బిడ్డే జితేంద్ర! మొదటేమో జకరయ్య తన కొడుక్కి తవిటయ్య అని తన తండ్రి పేరుపెట్టాడు. కానీ, నేనా కుర్రాణ్ణి స్కూల్లో జాయిన్ చేసేటప్పుడు జితేంద్ర అని పేరు మార్చాను"

రామదాసుకి అతను చెప్పిన వివరాలు ఆసక్తి, ఆనందం కలిగించకపోగా 'వెగటు' లాంటి భావాన్ని కలిగిస్తున్నట్టు యిబ్బంది పడ్డాడు. ఆ యిబ్బందిలోనించి ఓ ప్రశ్న బైటకొచ్చింది.

"జకరయ్య యిక్కడికి రాకముందు ఏం చేసేవాడు? "

"ఫుట్‌పాత్ మీద చెప్పులు కుట్టేవాడు"

రామదాసు అభిజాత్యం, ఆత్మగౌరవాల మీద ముళ్ళకమ్చీతో ఛెళ్లుమని కొట్టినట్టయింది.

"అతను మీకెలా తెలుసు? "

"వాళ్లనాన్న, మా నాన్న మా గ్రామంలో వుండేటప్పుడు మంచి స్నేహితులు. వివరాలు తెలీవుగాని, ఏదో దూరపు చుట్టరికం కూడా వుందనుకుంటాను"

రామదాసు సందేహం పూర్తిగా నివృత్తి అయిపోయింది. జితేంద్ర, భూషణం ఒక చెట్టులోని కొమ్మలే! రామదాసు తన మనసులోని ఆవేశాన్ని దాచుకుందామని ఎంత ప్రయత్నించినా దాచుకోలేకపోయాడు. "జితేంద్రకి తల్లెవరో తెలీదు. తండ్రి ఎవరో తెలీదు. కులం ఏంటో తెలీదు. మతమేంటో తెలీదు. పెరిగింది కూడా ఓ దళితుడి యింట్లో.. దళితుల పెంపకంలో" అంటూ లేచి నిలబడ్డాడు.

భూషణం అతన్ని శాంతపరుస్తూ కూర్చోబెట్టాడు. "కూర్చోండి సార్! ఈ వివరాలన్నీ దేనికడిగారు? మీ అమ్మాయిని జితేంద్రకివ్వాలనుకుంటున్నారా? " అని అడిగాడు.

రామదాసు అయిష్టంగానే కూర్చుని "నేనో విషయం అడుగుతాను. మీరు అబద్ధమాడకుండా నిజం చెప్తారా? " అని అడిగాడు.

"మనకున్న యీ కొద్దిపాటి పరిచయంలో, మీ దగ్గర అబద్ధమాడాల్సిన అవసరం నాకుంటాదంటారా? అడగండి.. నిజమే చెప్తాను"

"ఒకవేళ మీరే నాలాంటి స్థాయిలో వుంటూ, సనాతన సంప్రదాయాలకి ప్రతినిధిగా జీవితాన్ని కొనసాగించే వ్యక్తి అనుకోండి... మీరు మీ అమ్మాయిని జితేంద్ర లాంటి వాడికిచ్చి వివాహం చేస్తారా? "

"తప్పకుండా చేస్తాను. కానీ దురదృష్టవశాత్తు నాకు ఆడపిల్లల్లేరు"

"అందుకే చేస్తామంటున్నారు. కానీ వివాహం చేసేటప్పుడు అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాల మంచి చెడ్డల్ని ఆలోచించి, పరీక్షించి, పిల్లనిచ్చి పెళ్లి చెయ్యాలనంటారు. పోనీ, యిప్పుడున్న కాలమాన పరిస్థితుల్ని బట్టి, ఆ ఏడుతరాల వరకు వెళ్లకుండా వర్తమానం వరకే చూసుకున్నా.. ఆ అబ్బాయి చరిత్రేంటో

చెప్పండి. అతనికున్నవన్నీ మైనస్ పాయింట్లే అయినప్పుడు ఏం చూసి పెళ్లి చేయాలంటారు? "

అటెండర్ రెండు కప్పులతో కాఫీ పట్టు కొచ్చాడు. రామదాసుకి ఓ కప్పు అందించాడు. భూషణం కాఫీ తాగుతూ అన్నాడు "మీరు జితేంద్ర గురించి అడగ్గానే, నేను పెళ్ళి గురించే అడిగారని వూహించాను. వెయ్యి అబద్ధాలాడి ఓ పెళ్ళి చెయ్యాలనే సామెతనీ విన్నాను. మీరు వ్యక్తి ప్రతిభ కంటే కులమతాలు, పుట్టుక, పెంపకాలకే విలువిస్తారనీ విన్నాను. జితేంద్ర అగ్రకుల స్థుడని చెప్పుంటే.. జకరయ్యా గురించి చెప్పకుండా వుండుంటే.. మీరు నమ్మేవారు గదా? "

"నమ్మను. మిమ్మల్ని అడిగాక, మీ రిజిస్ట్రార్‌గార్ని, వైస్ ఛాన్సిలర్‌గార్ని కూడా కలిసి, ఆ కుర్రాడి రికార్డ్స్ తీయించి, స్వయంగా పరిశీలించేవాణ్ణి" కచ్చితంగా చెప్పాడు రామదాసు.

"అలా మీరు పుట్టుకల గురించి అంత శల్యపరీక్ష చేయడానికి యిదే శతాబ్దం అనుకున్నారు? ఇప్పుడు మనిషి సాధించిన ప్రతిభకే పట్టాభిషేకాలు జరుగుతున్న కాలం సార్! మారుతున్న కాలాన్ని కూడా మనం గమనించాలి"

"గతానికీ యిప్పటికీ ఎన్నో మార్పులు వచ్చాయి కానీ, కొన్ని విషయాలు మాత్రం కాలంతో పనిలేకుండా గతంలో లాగే యిప్పుడూ కొనసాగుతున్నాయి కదా? "

"కాలంతో పాటూ నడవనివాళ్లు, అలా కొనసాగిస్తూనే వున్నార్లెండి"

"అలాగా! మీరు కాలంతోపాటు నడుస్తున్నారుగా! కొన్నాళ్ళ క్రితం మీరు నోటితోనే తిన్నారు. ఇప్పుడు రెండువేల పదమూడు కూడా దాటిపోతోంది కదాని.. నోటితో కాకుండా మరి దేంతోనైనా తింటున్నారా? ముక్కుతో కాకుండా మరిదేంతోనైనా గాలి పీలుస్తున్నారా? ఇలా ఎన్నయినా చెప్పొచ్చు ఎప్పుడూ చేసే పనుల్లోనే తేడాలు రానప్పుడు, జీవితంలో ఒక్కసారే చేసే పెళ్ళి విషయంలో మాత్రం ఎందుకు భిన్నంగా ఆలోచించాలి? "

రామదాసుకుండే నమ్మకాల గురించి, పంతాలు పట్టింపుల గురించి భూషణం కొద్దిగా విన్నాడు. కానీ మరీ యింత మూర్ఖంగా మాట్లాడుతాడని వూహించ లేదు.

"తన మధుర గాత్రంతో మనసుదోచు కునే కోయిల పెరిగేది కాకి గూట్లోనే! అలాగని దాని గాత్రాన్ని ద్వేషించగలమా? జితేంద్రకి జన్మనిచ్చిన పేరెంట్స్ గురించి ఎవరికీ తెలీదు. కానీ, అతన్లో ఓ మంచి రచయిత వున్నాడు. అతను ప్రప్రథమంగా రాసిన కథకే ఓ ప్రముఖ పత్రిక వారు రెండు బహుమతులిచ్చారు"

ఈ మాటలు చెప్తూనే భూషణం తన టేబుల్ సొరుగులో దాచిన రెండు వారపత్రికల్ని బైటికి తీసాడు. అందులో జితేంద్ర కథ ప్రచురించిన పేజీల్ని చూపించాడు. ఆ పేజీల్లో ఫొటో వేశారు.

ఆ ఫొటోని చూడగానే రామదాసు తుళ్లిపడ్డాడు. ఈ జితేంద్రే 'ఈనాటి కోణంలో ఆనాటి రామాయణం' రాసానంటూ తన దగ్గరకొచ్చి తనతో వాదించి లెంపకాయ తిన్నాడు ఆరోజు. తన కలంపేరు 'నవత' అని చెప్పాడు గానీ, అసలు పేరు చెప్పలేదు. భూషణం చెప్పిన ప్రకారం జితేంద్ర ఓ దిక్కుమొక్కులేని అనాథ! అతన్ని పెంచీ పెద్ద చేసినవాళ్లు దళితులు, నిరక్షరాస్యులు. కుటుంబ నేపథ్యం హీనమయింది, వాళ్లు కూడా యిప్పుడు లేరు. తన స్నేహితుల రూమ్‌లో తలదాచుకుంటున్నాడు. ఇప్పుడు జితేంద్ర ఫొటో చూసాడు. అతనో అహంకారి. భారతీయ ఇతిహాసాలమీద, హిందూజీవన సంస్కృతి

మీద అవగాహన లేదు. ఉన్న మేరక యినా.. వాటిమీద గౌరవం లేదు! అందుకు కారణం అతని అజ్ఞానం! దాన్ని అజ్ఞానం అని అంగీకరించకుండా సమర్థిం చుకోవడం.. మూర్ఖత్వం! అలాంటి భావా లున్నవాడు ప్రేమికుడిగానే కాదు.. మాన వుడిగా కూడా బతకడానికి పనికిరాడన్నది తన అభిప్రాయం! ఇవే మాటల్ని భూష ణంతో చెప్పి విసురుగా ఆ రూమ్‌నించి బైటకి వచ్చేశాడు.

రామదాసు యింటికి వచ్చాక చెప్పులు విప్పి సరాసరి తన గదిలోకెళ్లిపోయి బట్టలు మార్చుకుని ఈజీచైర్‌లో కూర్చు న్నాడు. సత్యవతి అతనికో గ్లాసు మజ్జిగ తీసుకొచ్చి అందించింది. "శోభని పిలువ్" అన్నాడు మజ్జిగ తాగుతూ.

అతని వుద్దేశ్యం ఆమెకు అర్థంకాక "అబ్బాయి గురించి ఆరాతీయడానికి యూనివర్సిటీకి వెళ్తానన్నారు.. వెళ్ళ లేదా? " అని అడిగింది. ఆయన మళ్ళీ శోభని పిలవమనే చెప్పాడు. ఆమె అక్క ణ్ణించి వెళ్ళి శోభని తీసుకొచ్చింది.

అతను కూతురి వైపు చూడకుండా "ఆరోజు నాటకం గురించి మాట్లాడ్డానికి వచ్చినవాడు, నువ్వు యిష్టపడినవాడు ఒక్కడేనని ఆ తర్వాతైనా చెప్పలేదేం? " అని అడిగాడు.

ఆమె సమాధానం చెప్పకుండా పైన తిరుగుతున్న ఫ్యాన్‌వైపు, టేబుల్ వైపు చూస్తూ నిలబడిపోయింది.

"సమాధానం చెప్పడం అనవసరమను కుంటున్నావా? " యీసారి మరికాస్త గట్టిగా అడిగాడు.

అయినా ఆమె సమాధానం చెప్పలేదు.

"నాన్నగారు అడుగుతున్నప్పుడు సమా ధానం చెప్పవేం? " సత్యవతి కూతుర్ని గద్దించింది.

"దాన్నేం అనకు.. నువ్వెళ్లొచ్చు" రామ దాసు ఆ మాట అనగానే శోభ అక్క ణ్ణుంచి తనగదిలోకి వెళ్లిపోయింది. సత్య వతిని అక్కడున్న కుర్చీలో కూర్చోమ న్నాడు. తను భూషణం దగ్గరకెళ్లి సంపాదించిన సమాచారమంతా ఆమెకు వివరించాడు.

అంతా విన్నాక ఆమె నివ్వెరపోయింది. "నీ సలహా విన్నాక, నేనూ ఆచారాలకీ, అంతరాత్మకీ విరుద్ధంగా నాలుగుమెట్లు కిందకి దిగాను. కానీ ఆ కుర్రాడి స్వభావం ఎలాగూ సవ్యమయినది కాదని, అతనికు న్నవన్నీ తీవ్ర భావాలేనని యిక్కడికొచ్చి మాట్లాడినప్పుడే తెలిసింది. ఇంక, పెళ్లికి కావలసిన ముఖ్యమయిన రెండవది.. కుటుంబ నేపథ్యం! అది ఎలాంటిదో చెప్పే నుగా.. యిప్పుడు ఆలోచించుకోవలసింది నేను మాత్రమే? ఎందుకంటే చర్చించడా నికి కనీసం మరోమనిషి కావాలి! ఆ మనిషి.. శోభ! కానీ అదిప్పుడొచ్చి దిక్కులు చూస్తూ నిలబడిందే తప్ప, ఒక్క ముక్కా మాట్లాడలేదు. నీ అభిప్రాయం ఏంటో యింతకుముందే చెప్పేసావు కాబట్టి.. నేను రాజీపడుతూ వెళ్లాను! అంచేత.. యిప్పుడు ఆలోచించుకోవల సింది.. నేను మాత్రమే" అన్చెప్పాడు. ఆమెకు ఆ తర్వాతేం మాట్లాడాలో అర్థం కాక అక్కణ్ణించి వెళ్లిపోయింది.

సాయంత్రం నాలుగున్నర దాటాక...

## భళేభళే!

అతి తక్కువ సమయంలో రాతపనిని పూర్తి చేయాల్సివస్తే బయటికి వెళ్లేందుకు వీల్లేకుండా ఒంటి మీద బట్టలన్నీ తీసేసి, ఓ కప్‌బోర్డులో పెట్టి తాళం వేసేసేవాడట ప్రసి ద్ధ రచయిత విక్టర్‌హ్యూగో. ఓ శాలువా మాత్రమే ఒంటికి చుట్టుకు కూర్చుని రాసుకునే వారట ఆయన.

కాలింగ్ బెల్ మోగుతుంటే సత్యవతి వెళ్లి వీధి తలుపుతీసింది. అక్కడ కనిపించిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది.

అతను జితేంద్ర!

"నమస్తే మేడమ్" అని అన్నాడు గానీ, అతన్ని లోపలికి రమ్మనాలో, వద్దనాలో వెంటనే ఆమెకు స్ఫురించలేదు. "నేను రామదాసుగారితో మాట్లాడాలని వచ్చాను. దయచేసి అనుమతించండి!" అన్నాడు వినయంగా.

ఆమెకు రమ్మనక తప్పలేదు. అతను లోపలికొచ్చి హాల్లో వున్న సోఫాలో కూర్చున్నాడు. ఆమె లోపలికి వెళ్లి భర్తతో జితేంద్ర వచ్చాడని చెప్పింది. అతను అక్షరాలా రెండు నిమిషాలపాటు మౌనంగా వుండిపోయి, దీర్ఘంగా ఆలోచించాక, ఆమెతోపాటు హాల్‌లోకి నడిచాడు. జితేంద్రకి ఎదురుగా మరో సోఫాలో కూర్చున్నాడు సీరియస్‌గా.

"నమస్కారం సార్! ఉదయం నా గురించి కనుక్కోడానికి మా ప్రిన్సిపల్ దగ్గరికొచ్చారట. ఆయనే చెప్పారు. నాకు ఆయనే గాడ్‌ఫాదరు. మీతో పెళ్లి విషయం మాట్లాడ్డానికి ఆయన్ని తీసుకుని ఎప్పుడు రమ్మంటారో కనుక్కుందామని వచ్చానండీ" అన్నాడు జితేంద్ర.

శోభ తన గదిగుమ్మం దగ్గర నిలబడి వింటోంది.

రామదాసు స్థిరంగా, స్పష్టంగా చెప్పాడు. "పెళ్లి విషయంలో నేను యిప్పటికే ఓ నిర్ణయానికి వచ్చాను. నువ్విప్పుడు ఫైనలియర్ కదా చదువుతున్నావు. చదువు పూర్తి చేసాక, కనీసం ముప్ఫై నలభై వేలు జీతం వచ్చే ఉద్యోగం సంపాదించాక వచ్చి కనిపించు"

ఈ నిర్ణయం ఎప్పుడు తీసుకున్నాడో సత్యవతికీ అర్థం కాలేదు, శోభకీ అర్థంకాలేదు. జితేంద్రకీ యీ నిర్ణయం చాలా ఆశ్చర్యం కలిగించింది. భూషణంగారు తనని పిల్చి, రామదాసు ప్రదర్శించిన ఆవేశం గురించి, అయిష్టత గురించి చెప్పారు. కానీ యిక్కడ రామదాసు అనూహ్యంగా తన అంగీకారాన్ని తెలియజేస్తున్నాడు.

"నేను ఉద్యోగం సంపాదించాక తప్పకుండా పెళ్లి చేస్తారా? "

"అదేకదా చెప్పాను. వెళ్లిరావొచ్చు"

"అలాగే సార్, ఒక్కనిమిషం శోభతో మాట్లాడి..."

"ఆc! మరో ముఖ్యమైన విషయం చెప్పడం మర్చిపోయాను. ఈ రోజు నించి, యీ క్షణం నించి శోభ యిల్లు కదలదు. ఆమె సెల్‌ఫోన్ పనిచెయ్యదు" రామదాసు శోభ గదిలోకెళ్లి ఆమె సెల్‌ఫోన్ తీసుకొచ్చి, అందులోనించి 'సిమ్' కార్డ్ తీసేసి, ఆ ఫోన్‌ను తన జేబులో పెట్టుకున్నాడు.

"అలాగే ఈ క్షణం నించి మాయింటి ల్యాండ్‌ఫోన్ కూడా నా పర్సనల్ రూమ్‌లోకి షిఫ్ట్ చేస్తున్నాను" అన్చెప్పి, ల్యాండ్ ఫోన్ కనెక్షన్ పీకేసాడు. "ఇక మీదట మాయింట్లో నాతో తప్ప వేరెవ్వరితో మాట్లాడాలనుకున్నా సాధ్యం కాదు. బయటివారు ఎవరైనా సరే, నాకు మాత్రమే ఫోన్ చేయాలి. నా సెల్‌కు నువ్వెలాగు

## కొత్తగాలి...

**బడి మీద**
**పెట్టుబడంటే..**
**బాల్యం మీద**
**మూల్యమన్నమాట!**

*– జి.వి.యస్. ప్రియంవద,*
అరసవిల్లి

ఫోన్ చెయ్యవు. చేసినా, నేను శోభకి వ్వను. ఆమె కూడా నా ఫోన్‌ద్వారా మాట్లాడదు. గుమ్మందాటి పక్కింటికి కూడా వెళ్లదు. నువ్వు మొదటి నెల జీతం అందుకున్నాకే నాకు కనిపిస్తున్నావు. ఈలోగా నువ్విక్కడికి రావడం మర్యాదకా దని నీకు తెలుసని నాకు తెలుసు. ఒకవేళ అలా జరిగితే, మా అభిప్రాయం మారు తుందని నువ్వు తెలుసుకుంటే మంచిది" అన్చెప్పి రామదాసు రెండు చేతులతో నమ స్కరించాడు.

జితేంద్ర చాలాసేపు చాలా విషయాలు మాట్లాడాలని వచ్చాడు. కానీ రామదాసు ఎదుటివాడు నోరెత్తి సమాధానం చెప్పలేని విధంగా తన నిర్ణయాన్ని చెప్పాక జితేం ద్రకి మరేం మాట్లాడాలో అర్థంకాక, నిస్స హాయంగా చూసి, వెళ్లిపోయాడు. తండ్రిలో వచ్చిన యీ మార్పుకి కారణం తన మొండితనమేనని శోభ తన మనసు లోనే అనుకుని సంతోషించింది.

మర్నాడు ఉదయమే జితేంద్ర భూషణం గారింటికెళ్లి, రామదాసు తనతో చెప్పిన విషయం గురించి చెప్పి "నాకు వెంటనే ముప్ఫై నలభై వేలు జీతం వచ్చే ఉద్యో గాన్ని మీరు యిప్పించగలరా? " అని కాస్త అమాయకంగా అడిగాడు.

ఆయన చిన్నగా నవ్వి "నీకు ఉద్యోగమే కావాలనుకుంటే, మన కాలేజీ ఆఫీసులోనే యివ్వగలను. అయితే అందులో నీకు పది, పన్నెండు వేలకంటే ఎక్కువ జీతం రాదు. ప్రారంభంలోనే ముప్ఫై నలభైవేలు జీతం రావాలంటే, సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పనిచెయ్యాలి. కానీ యిప్పుడారంగం కూడా చాలా క్లిష్ట పరిస్థితుల్లో వుంది. అయినా నువ్వేమీ నిరుత్సాహపడనక్కర్లేదు. ముందు నువ్వు శ్రద్ధగా చదివి నీ ఫైనలి యర్ ఎగ్జామ్స్ రాయ్!" అన్నాడు.

"నేను పరీక్ష పాసయ్యాక జాబ్‌కోసం ట్రై చేస్తే చాలా లేటైపోతుందేమో? "

"రామదాసుగారితో మాట్లాడ్డం జరిగింది కాబట్టి, అతని మనస్తత్వాన్ని కొంతవరకు అర్థం చేసుకున్నాను. ఆయన సనాతనుడు, చాదస్తుడు, మొండివాడే కావచ్చు. కానీ అలాంటివాళ్లు యిచ్చిన మాటమీద చచ్చిం దాకా నిలబడతారు. ఆయన కూతురి జీవి తానికో భరోసా కావాలన్న వుద్దేశ్యంతో, నీకు ఉద్యోగం తప్పకుండా వుండాలనే షరతు పెట్టాడు కానీ, ఫలానా టైమ్ లోప లే నువ్వు ఉద్యోగం సంపాదించాలనే నియమం పెట్టలేదు. అంచేత ముందు నువ్వు చదువు మీద మనసుపెట్టు" అన్నారు భూషణం చాలా నమ్మకంగా!

★ ★ ★

'రామదాసు మనస్తత్వాన్ని నేను చాలా వరకు అర్థం చేసుకున్నాను. అతనిలాంటి వారు పెట్టిన షరతులు కఠినంగావున్నా, వాటిని మాత్రం కచ్చితంగా అమలు చేస్తారు' అని భూషణం చెప్పిన మాటలు అబద్ధమయ్యాయి.

రామదాసు గదిలోని ల్యాండ్ ఫోన్ మోగింది. హాలులో వున్న మనిషి గది లోకెళ్లిపోయి ఫోన్‌లో ఏదేదో మాట్లాడుతు న్నాడు. అదీ మెల్లగా మాట్లాడ్డానికి ప్రయ త్నిస్తున్నాడు. ఆ మాటలు స్పష్టంగా అర్థం కాకపోయినా.. అతను ఎవరితోనో శోభ పెళ్లి విషయమే మాట్లాడుతున్నాడని గ్రహించింది సత్యవతి. "వాళ్లకి మన సంబంధం నచ్చిందంటున్నారు కాబట్టి వాళ్లు కోరిన విధంగానే మన పెట్టుపోత లుంటాయి. కాకపోతే వాళ్లు అమ్మాయిని తీసుకుని అమలాపురం వచ్చేస్తే, అక్కడే పెళ్లి చేసుకుంటాం అంటున్నారు. అందు వల్ల నాకు పెళ్లి ఖర్చులు తగ్గే మాట నిజమే అయినా.. సంప్రదాయమంటూ ఒకటుందిగా! ఆడపిల్లకి నా తాహతుకి తగ్గట్టుగా పెళ్లిచేసి పంపడం నా ధర్మం క

దా అనే ఆలోచిస్తున్నాను" అంటున్న రామదాసు గది తలుపులు దగ్గరగా మూసి లోపలకి వచ్చిన సత్యవతిని చూసి ఫోన్ కట్ చేసాడు.

"ఏంటీ, ఏదో పెళ్లి సంబంధం గురించి ఎవర్తోనో మాట్లాడుతున్నారు? " అడిగింది సత్యవతి.

"బాగానే గ్రహించావు. శోభ కే సంబంధం చూస్తున్నాను"

"అదేంటి? ఆ జితేంద్రకి కొంత టైమి చ్చారు. ఆ టైము పూర్తి కాకుండానే మరో సంబంధం చూస్తున్నారేం? "

"పొయ్యి మీద పెట్టిన పాలు బుస్సు మని పొంగితే ఏం చేస్తావు? ఓ గుప్పెడు నీళ్లు జల్లి దాని పొంగుని ఆపుతున్నావు కదా! నేను చేసిన పనీ అదే! ప్రేమలో పడినవాళ్లకి పెద్దవాళ్లు అభ్యంతరం చెప్పి నప్పుడు వాళ్లూ పొయ్యి మీద పెట్టిన పాల లాగే పొంగుతారు"

"కావచ్చు. కానీ అతనికి మాటిచ్చా క్కాడా మీరు వేరే పెళ్లి జరిపించేస్తే మోసం చేసామని అంటారేమో!"

"ఎవరు ఎవర్ని మోసం చేసారు? సంప్రదాయబద్ధంగా, క్రమశిక్షణతో పెరి గిన నా కూతురు కులం, మతం లేని వెధ వని ప్రేమించడం మోసంకాదా? ఆ జితేం ద్రగాడు మనగుమ్మంలోకి అడుగుపెట్టే అర్హత కూడా లేని నికృష్టుడై వుండి కూడా నా కూతుర్ని వలలో వేస్కోవడం వాడు చేసిన మోసం కాదా? ఆడిన మాటమీద నిలబడ్డానికి నేను హరిశ్చంద్రుణ్ణి కాదు.. ఆడపిల్ల తండ్రిని! నేను ఓ మంచి సంబంధం చూసి పెళ్లి జరిపిస్తే వాళ్లు బాధపడతారా? పడనియ్!

నా పెంపకానికి భిన్నంగా, నా మనస్త త్వానికి వ్యతిరేకంగా శోభ మనకి చెప్ప నైనా చెప్పకుండా ఆ భ్రష్టుడితో ప్రేమ లోకి దిగడం మోసం కాదా? సినిమా హాల్లో జరిగిన గొడవని బట్టి, దాని నిర్ణయం మనకి తెలిసింది. నేను రహస్యంగా చేసే పెళ్లి ద్వారా నా నిర్ణయం వాళ్లకు తెలుస్తుంది. నువ్వీ విషయాన్ని శోభకి ఎంతమాత్రం తెలియనివ్వకూడదు. నేనిప్పుడు జైలుకెళ్ళే పరిస్థితిలో లేను"

సత్యవతి ఆ మాటకి ఉలిక్కిపడింది. ఇప్పుడాయన జైలుకెళ్లే ప్రస్తావన ఎందుకు తెచ్చారో ఆమెకు అర్థం కాలేదు. "మీరు జై లుకెందుకెళ్తారూ? " అని అడిగింది.

"నేను కుదురుస్తున్న సంబంధం విషయం, చెయ్యబోతున్న పెళ్లి విషయం శోభకి చెప్పేవనుకో, నేను నిన్ను చంపే స్తాను కదా! మరి ఖూనీ చేసేవాణ్ణి జైలుకే పంపిస్తారుగానీ, పార్లమెంట్‌కి పంపించరు గదా? " ఆ విధంగా రామదాసు తను ఎంత కఠినమైన నిర్ణయాన్ని తీసుకున్నదీ భార్యకి తెలియజేశాడు.

"ఒకవేళ మీరు తీసుకున్న నిర్ణయం సంగతి ఆ కుర్రాడికి తెలిస్తే? " స్వరం తగ్గించి గొణిగింది సత్యవతి.

"ఎలా తెలుస్తుంది? నేన్నీకు చెప్పినా, నువ్వు శోభకి చెప్పవుగా.. అంచేత ఆ విషయం అమ్మాయికి తెలీదు. అది గుమ్మం దాటి బయటికెళ్ళే అవకాశం గానీ, వాడు గుమ్మంలోకి వచ్చే అవకాశం గానీ లేనప్పుడు ఎలా తెలుస్తుంది? " భర్త చెప్పింది నిజమేననిపించింది సత్యవతికి.

రామదాసు ప్రస్తుతం ఆలోచిస్తున్నది తను మధ్యవర్తి ద్వారా కుదిర్చిన అమలా పురం సంబంధం గురించే! వాళ్లు తమ ఊళ్లోనే పెళ్లి చేసుకుంటామంటున్నారు. ఆడపిల్లను పుట్టింటివారు పెళ్లిచేసి పంప డమే సంప్రదాయమని తను వాదిస్తు న్నాడు. అదింకా ఓ కొలిక్కి రాలేదు. ఇప్పుడేమో సత్యవతి 'ఒకవేళ ఈ సంగతి ఆ కుర్రాడికి తెలిస్తే? ' అనే సంశయాన్ని ప్రకటించడం వల్ల దాని గురించే రాత్రింబ

వళ్లు ఆలోచిస్తున్నాడు. నిద్ర పోదామని కళ్లు మూసినా ఆ విషయమే కలలోకొస్తోంది.

జితేంద్ర తన స్నేహితులతో వుంటున్న ఇంటికి రాజు అనే యువకుడు పరుగెత్తుకుంటూ వచ్చి "రేయ్! ఆ రామదాసు నిన్ను మోసం చేసాడు" అంటూ శోభని రహస్యంగా మరో అబ్బాయికిచ్చి పెళ్లి చేసేస్తున్నాడని చెప్పాడు.

అంతే! జితేంద్ర, ఆ రూమ్‌లో వున్న ఫ్రెండ్సు ఆవేశంతో వూగిపోయారు. "రాగ ద్వేషాల్ని జయించేసి రామాయణం రాసేస్తున్నవాడే మోసానికి దిగినప్పుడు మనం దౌర్జన్యానికి దిగి, వాడి కూతుర్ని ఎత్తుకొచ్చి, జితేంద్రగాడికిచ్చి పెళ్లి చేయడంలో తప్పేం లేదు" ఓ కుర్రాడు చెప్పిన మాటలకి అందరూ అంగీకరించారు.

## కొత్తగాలి...

**జననం**
**నేల మీద నడక!**
**మరణం**
**నేల కింద పడక!!**

– పైడి ప్రణయ్,
చెన్నై

జితేంద్ర మాత్రం "ఈ సమస్యని సామరస్యంగా సాధిద్దాం" అన్నాడు.

అందరూ అతని మీద కస్సుమంటూ లేచారు.

"రేయ్! ఈనాటి సమాజం నువ్వు కథల్లో రాసినంత అందంగా లేదు. 'తంతాం' అంటే తప్ప ఎవడూ మాట వినడంలేదు. నీ కథల్లో నువ్వు సృష్టించిన పాత్రలు ఆఖరు పేజీలో బుద్ధి తెచ్చుకుంటాయి. దుర్మార్గులు కూడా మంచివాళ్లుగా పరివర్తన చెందుతారు. కానీ వాస్తవ జీవితంలో, ఆఖరి పేజీలూ లేవు, పరివర్తనలూ లేవు!" అంటూ అక్కడున్న వారంతా తమ సెల్‌ఫోన్లు తీసి, తమ క్లోజ్ ఫ్రెండ్సుకి జరిగిన అన్యాయాన్ని వివరించారు. అర్జెంటుగా మనం సమావేశమవ్వాలని చెప్పారు. ఓ గంట తర్వాత రామదాసు ఇంటి ముందు ఓ పది మోటారు బైక్‌లు, ఓ సుమో వచ్చి ఆగాయి. కొంతమంది కుర్రాళ్లు బిలబిలమంటూ ఇంట్లోకొచ్చి, శోభని చెయ్యి పట్టుకుని లాక్కొచ్చి సుమోలో కూర్చోబెట్టారు.

రామదాసు ఈ అనూహ్యమైన దాడికి ఆందోళన చెందుతూ "ఏంట్రా యీ దౌర్జన్యం? " అని అరిచాడు.

"నువ్వు పెద్దవాడివై వుండి చేసిన మోసానికి, మా కుర్రాళ్ళం చేసే యీ దౌర్జన్యమే సమాధానం" జితేంద్ర ఆవేశంగా జవాబు చెప్పాడు.

"మీరంతా నా ఇంటికొచ్చి నా కూతుర్ని బలవంతంగా ఎత్తుకుపోయారని పోలీస్ కంప్లయింట్ ఇస్తే మీ అందరిని జైల్లో పెడతారు" అంటూ తన సెల్‌ఫోన్ తీసి పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చెయ్యబోయాడు రామదాసు.

అతన్ని ఫట్‌మని కొట్టాడో స్టూడెంట్.

'అమ్మో' అని అరుస్తూ దిగ్గుమని నిద్రలోంచి లేచాడు రామదాసు. 'తను రహస్యంగా పెళ్లి చేస్తున్న విషయం జితేంద్రకి తెలిస్తే, అతనేమయినా ప్రతిఘటిస్తాడా? ' అని ఆలోచిస్తూ నిద్రలోకి జారడం వలన, అదే విషయం కలగా వచ్చి కలవరపెట్టింది. లైట్ వేసి టైమ్ చూసాడు. తెల్లారుజాము నాలుగున్నరయింది. తెల్లారుజామున వచ్చే కలలు నిజమవుతాయని తనే చాలామందికి చెప్పాడు. కానీ ఈ కలని నిజం కానివ్వకూడదని దృఢంగా నిశ్చయించుకు

న్నాడు. తను సంప్రదాయానికి కట్టుబడి, యీ వూళ్లో గనక పెళ్లి చేస్తే జితేంద్రకి తెలిసే అవకాశం వుంది. అంచేత మగపెళ్లివారు కోరుతున్నట్టుగా అమలాపురంలో పెళ్లి చేసెయ్యడానికే నిర్ణయించుకున్నాడు.

★ ★ ★

ఓ నెల గడిచింది. రామదాసు ఓరోజు భార్యని తీసుకుని సీతారామస్వామి దేవాలయానికి బయల్దేరాడు. "శోభని కూడా తీసుకువెళ్దాం. దేవుడి గుడిలో ఏం ప్రమాదం వుంటుంది? " అంది సత్యవతి.

"దేవాలయాలు ప్రశాంతతకి నిలయాలనే మాటలకి కాలం చెల్లింది. ఇన్ని రోజులు శోభని ఇంట్లో బంధించడం నాకూ ఇష్టం లేదు. కానీ ఇంకెన్నాళ్లు? మూడు వారాలేగా? ఆ తర్వాత వూరే మారిపోతుంది" అన్చెప్పి శోభని ఇంట్లోనే వుంచి, తలుపుకి తాళంవేసి ఆటోలో బయల్దేరాడు. సగం దూరం వచ్చాక పెళ్లి కుదిర్చిన మధ్యవర్తికి ఫోన్ చెయ్యడానికి సెల్ ఫోన్ తీయబోయాడు. కానీ, ఏ జేబులోనూ అది కనిపించలేదు. ఆటోవాణ్ణి ఆటోని వెనక్కి తిప్పి ఇంటికి పోనిమన్నాడు.

"దేవుడి దర్శనమయ్యాక ఇంటికెళ్లి తీరిగ్గా మాట్లాడొచ్చుగా" అంది సత్యవతి. అయినా అతను వినలేదు. ఇంటిదగ్గర ఆటో ఆపి, తాళంతీసి ఇంట్లోకి వచ్చాడు. సత్యవతి అతన్ని అనుసరించి వచ్చింది.

శోభగదిలో కనిపించిన వ్యక్తిని చూసి రామదాసు నివ్వెరపోయాడు. సత్యవతి కంగారుపడింది.

ఆ వ్యక్తి జితేంద్ర!

"వాళ్ళు ఇప్పుడేగా గుడికెళ్లారు. ఆలోగా ఏ కొంపలూ మునిగిపోవు, ఏ ఉపద్రవాలూ జరిగిపోవుగా" జితేంద్రతో శోభ అంది. ఆమె మాటల్లో పెడసరమూ, పొగరే కనిపించినాయి తప్ప, గృహ నిర్బంధంలో వున్న ఓ ఖైదీ గొంతులోని దైన్యం ధ్వనించలేదు.

జితేంద్ర హఠాత్తుగా వచ్చిన శోభ తల్లిదండ్రుల్ని చూసి తడబడుతూ, భయం భయంగా చెప్పాడు "నేను మీ షరతుల్ని మర్చిపోయో, అశ్రద్ధ చేసో మీ ఇంటికి రాలేదండి. శోభతో ఓ విషయం చెప్పాలని వచ్చాను. వీధి తలుపుకి తాళం వేసున్నా, శోభ హౌస్ అరెస్టులోని ఉంది కాబట్టి పెరటిగోడ గెంతి లోపలికి వచ్చాను"

ఆ మాట వినగానే రామదాసు నిప్పుల ఉప్పెనలా, ప్రళయకాల ప్రభంజనంలా మారిపోయి వేయి పడగల శేషుళ్లా బుసకొడతాడని సత్యవతి వూహించింది. కానీ అతను ఒక్క మాట కూడా మాట్లాడకుండా, హాల్లో వున్న సోఫాలోనే కూర్చుండిపోయాడు. జితేంద్ర వైపు కాకుండా నేలవైపు నిశ్చలంగా చూస్తూ వుండిపోయాడు. జితేంద్ర మాటలు అతని చెవిన పడుతూనే వున్నాయి. "నల్గొండలో వున్న మా ఫ్రెండ్‌కి నా విషయం చెప్పాను సార్! రెండు మూడు వారాల పాటు నేనొచ్చి ఆ వూళ్లో వుంటే, నేను కోరుకున్న ఉద్యోగాన్ని ఇప్పిస్తానన్నాడు. ఎల్లుండి ఆ వూరు వెళ్తున్నానని చెప్పడానికే, ఈ దార్లో రావడానికి సాహసించాను తప్ప మరే దురుద్దేశ్యంతోనూ కాదు" అన్నాడు జితేంద్ర.

కాస్సేపు మౌనం తర్వాత "మరి నేను వెళ్లొస్తానండి, రేపు రాత్రికి బయల్దేరుతున్నాను" అన్చెప్పి, వీధిగుమ్మంలోనించే బైటకి వెళ్లిపోయాడు జితేంద్ర.

ఆ తర్వాత కూడా చాలాసేపు రామదాసు అదే భంగిమలో, అక్కడే పేలడానికి సిద్ధంగా వున్న అగ్నిపర్వతంలా వుండిపోయాడు.

అదే రోజు రాత్రి.. జితేంద్ర గాజువా

కలో వున్న ఓ ఫ్రెండు దగ్గరకెళ్లి తనకి ఓ పది, పదిహేను వేలు అప్పు కావాలని అడిగాడు. నల్గొండలో ఎక్కువ రోజులు వుండాలి కాబట్టి, తనకి డబ్బు అవసరమని చెప్పగానే అతను ఇస్తానన్నాడు. జితేంద్ర వెళ్లి ఆ డబ్బు తీసుకువస్తున్నాడు. ఆ ప్రాంతం, నిర్మానుష్యంగా వుంది.

చుట్టూ వున్న చీకటి చిక్కగా వుంటే.. ఆ చీకటిని పారదోలాల్సిన వీధిదీపాలు వెదజల్లే వెలుతురు బహుపల్చగా వుంది. నల్గొండ వెళ్లడం గురించి కాకుండా, తిరిగా రావడం మాత్రం వుద్యోగంతోనే జరగాలని, తీవ్రంగా ఆలోచిస్తూ బైక్ మీద వస్తున్న జితేంద్ర తలకి ఫట్‌మంటూ ఓ దుడ్డుకర్ర తగిలింది. 'అమ్మా' అంటూ బైక్ మీద నుంచి ఎగిరి ఎక్కడో చీకట్లో పడ్డాడు. బైక్ ఎక్కడో నేల మీద దభ్‌మంటూ పడింది.

ఎవరు కొట్టారు? ఎందుకు కొట్టారు? అనుకోకుండా తగిలిన ఆ దెబ్బ గురించి జితేంద్ర ఆలోచించేలోగా ఎవరో నలుగురు వ్యక్తులు ముఖానికి రుమాళ్ళు కట్టుకుని, చేతుల్లో దుడ్డుకర్రలు పట్టుకుని అతని చుట్టూ చేరి, కర్రల్తో దబ్‌దబ్ మంటూ కొట్టడం మొదలుపెట్టారు. "ఎవరు మీరు? నన్నెందుకు కొడుతున్నారు?" ప్రశ్నలు అడుగుతున్నా, ఆ మాటలు స్పష్టంగా బైటికి రావడంలేదు. కొడుతున్న రౌడీలు కూడా తామొచ్చింది కూడా కొట్టడానికే తప్ప, అతను అడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పడానికి కాదన్నట్లుగా దభ్ దభ్‌మంటూ కొడుతున్నారు. జితేంద్ర జీవనాడులన్నీ జివ్వుమంటున్నాయి. పంచప్రాణాలు పైకి ఎగిరిపోవడానికి రెక్కలాడిస్తున్నాయి. అతని ఒంటి నించి కారుతున్న రక్తంతో బట్టలు తడిసిపోయాయి. స్పృహ తప్పిపోతున్న తరుణంలో ఓ రౌడీ వార్నింగ్ ఇచ్చాడు. "మళ్లీ రామదాసుగారి కూతురివైపు చూసినా, మాట్లాడినా, ఎదురుపడినా.. నువ్వెక్కడున్నా వెతుక్కుంటూ వచ్చి కనబడిన చోటే నరికేసి, అక్కడే పాతెయ్యమన్నారు. నువ్వు మొండికేసి అమ్మాయిని కలవడానికి మరే ప్రయత్నం చేసినా, తన కూతుర్ని చంపేసి తను జైలు కెళ్లిపోవడానిక్కూడా ఆయన సిద్ధంగా వున్నారు"

మాటలు అస్పష్టంగా చెవుల్లో దూరుతున్నప్పుడు జితేంద్ర నేల మీద పడి స్పృహ కోల్పోయాడు!




కొండ మీద...

జితేంద్ర తన ఈ పరిస్థితి వెనక జరిగిన కథంతా వివరించాడు. మాధవరావు అతను చెప్పిన కథలోని అక్షరం అక్షరం శ్రద్ధగా విన్నాడు. జితేంద్ర తన కథకి ముగింపుగా చెప్పాడు "ఆ రామదాసు కిరాయి రౌడీలతో కొట్టించాక నేను స్పృహ తప్పి పడిపోయాను. ఆ దారంట ఎవరొచ్చినా, నన్ను చూసి ఆగి, నన్ను ఆసుపత్రిలో వేసేవారేమో! కానీ, ఎవరూ రాని నిర్జన ప్రదేశమది! నాకు ఓ గంట క్రితం తెలివొచ్చింది. నేను తీవ్రమైన ఆలోచనలో పడ్డాను. నన్ను రామదాసు కిరాయి గూండాలతో కొట్టించిన విషయం పోలీసులకు చెప్తే అతని మీద కేసు పెట్టి కోర్టుకీడుస్తారు. నా ప్రేమ కోసం శోభ కుటుం




బాన్ని కోర్టుకీడ్చడం నా అభిమతం కాదు. నా ఫ్రెండ్సుకి విషయం చెప్తే కాలేజీల్లో వున్న మరికొంతమంది స్టూడెంట్స్‌తో కలిసి ఆ యింటిమీద దాడి చేస్తారు. రామదాసుగార్ని కొడతారు. ఎలక్ట్రానిక్ మీడియా మా ప్రేమకథని, ఈ రక్త పాతాన్ని పదేపదే టీవీల్లో చూపించి, మా సమస్యని రాష్ట్రమంతటా తెలిసేటట్టు చేస్తుంది. అలా కుటుంబ పరువుప్రతిష్ఠల్ని పదిమందిలో పడేయడం కూడా నాకిష్టంలేదు. నేను శోభని తీసుకుపోయి, ఎవరికీ తెలీకుండా పెళ్లి చేస్కోవచ్చు. కానీ దానికీ నా అంతరాత్మ అంగీకరించలేదు. ఎందుకంటే నాకెలాగూ తల్లీదండ్రీ, అయినవాళ్లు, బంధువులూ లేరు. అలాంటివారందరూ వున్న శోభకి, నా వల్ల వారంతా దూరమవడమూ నాకిష్టం లేదు. నేను మళ్లీ శోభని కలిసే ప్రయత్నం చేస్తే... శోభని చంపేసి, తను జైలుకెళ్లిపోతానని రామదాసు రౌడీల ద్వారా నన్ను హెచ్చరించాడు. కాదని, మొండికెత్తి వెళ్తే శోభని శాశ్వతంగా పోగొట్టుకుంటాను. ఆమె లేనిదే నేను బతకలేను. అందుకే శోభనైనా బతకనివ్వాలని నేను ఆత్మహత్యకి సిద్ధపడ్డాను"

కాస్సేపు మాధవరావు మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయాడు. "ఏంటాలోచిస్తున్నారు? వీణ్ణి అనవసరంగా ఆపేననుకుంటున్నారా? " జితేంద్ర అడిగారు.

"లేదు. నీ ఆత్మహత్యా ప్రయత్నం వెనక నాకు ఒక్క కారణమే కనిపిస్తోంది. నువ్వు ఆశించింది పొందలేక, పొందిన అవమానాన్ని భరించలేక చచ్చిపోదామనుకున్నావు"

జితేంద్ర రవ్వంత చిరాకు పడుతూ "నేనింత స్పష్టంగా వివరంగా చెప్పినా మీరింత సింపుల్‌గా ఒక్క వాక్యంలో కొట్టి పారేస్తారేంటి? " అన్నాడు.

"ఎన్ని వాక్యాల్లో చెప్పినా నీ సమస్య

## భలేభలే!

గొరాల పిల్లికూన 'కాటరీనా' తన భుజాల మీద ఎక్కి కూచుంటేగానీ కవి ఎడ్గార్ అలెన్ పో రాయడం మొదలుపెట్టేవాడు కాదట!

★ మేరీ షెల్లీ తన పెంపుడు పామును భుజాల చుట్టూ వేలాడదీసుకుని రాసేదట! ఆ పాము నిశ్శబ్దంగా ఉన్నంత సేపు రాసుకుని అది ఎప్పుడైతే బుసలు కొడుతుందో అపుడు రాయడం ఆపేసేదట!

అదేనని నాకు అర్థమయిందిలే! నాకు తెలీకడుగుతున్నాను. ప్రేమించడం, ప్రేమించిన వ్యక్తిని పెళ్లాడ్డం, పెళ్లాడకపోతే చచ్చిపోవడం.. ఇంతేనా జీవితం? మనిషిగా సాధించడానికి ఈ లోకంలో ఇంకేం లేదా? " మాధవరావు సూటిగా అడిగాడు.

ఉపాధ్యాయుడు అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పలేని విద్యార్థిలా తల దించుకుని మెల్లగా గొణుగుతున్నట్లు అడిగాడు. "మీ సంగతేంటి? మీరు జీవితం చేతిలో బాగా నలిగిపోయిన మనిషిలా వున్నారు. మిమ్మల్ని ఏ పరిస్థితులు తరుముకొస్తే ఇలా ఆత్మహత్యకి సిద్ధపడ్డారు? "

"నా సంగతి వదిలెయ్యవయ్యా! అవసరమైతే తర్వాత చెప్తాన్లే! నీ గురించి నువ్వు చెప్పడం అయింది కానీ, దాని మీద నా అభిప్రాయం నేను చెప్పలేదుగా! నీ సమస్య మందుల్లేని ప్రాణాంతక వ్యాధిలాగేం కనబడ్డంలేదు. నీ సమస్యని సులభంగా పరిష్కరించొచ్చు"

"ఎలా? "

"నాలాంటి సీనియర్ సిటిజన్ ఒకడు, ఇంకా కొన్ని సపోర్టింగ్ కేరక్టర్స్ కావాలి. మీ ఫ్రెండ్సు ఎక్కడున్నారో చెప్పు, నేను మాట్లాడుతాను"

అలాంటి ప్రయత్నాలు చెయ్యడం తనకిష్టం లేదన్నట్టుగా తల అడ్డంగా ఆడిం

చాడు జితేంద్ర. "నేను చేద్దామనుకుంటున్న పని నిన్ను ఉద్ధరించడానికే కాదయ్యా! నేనో గొప్ప పాపం చేసి, ఆత్మహత్యకి సిద్ధపడ్డాను. చనిపోయే ముందు ఓ మంచి పని చేసి, నా పాపాన్ని ప్రక్షాళన చేసుకోవాలనే స్వార్థంతోనే అడుగుతున్నాను. మీ రూమ్‌కి వెళ్దామా? "

జితేంద్ర ఆ ప్రశ్నకి సమాధానం చెప్పడానికి కొంత టైమ్ తీస్కుని "మా ఫ్రెండుకి నేను ఆత్మహత్యకి తలపడ్డానని తెలిస్తే కారణాలు అడుగుతారు. కాబట్టి.." పూర్తి చేయకుండా ఆగిపోయాడు.

"ఆ తర్వాత ఎలాగూ వాళ్లకి తెలుస్తుంది. రక్తంతో తడిసిన నీ షర్ట్‌ని చూస్తే మీ ఫ్రెండ్స్‌కు తప్పకుండా అనుమానం వస్తుంది. అంచేత వెళ్లేటప్పుడు ఓ రెడీమేడ్ షర్ట్ కొనేద్దాం. నా దగ్గర డబ్బులున్నాయిలే! పదా!!" అన్నాడు మాధవరావు.

★ ★ ★

వాస్తవాలకంటే కల్పనలు అందంగా ఉంటాయి. ఆశ్చర్యంగా వుంటాయి. వినడానికి ఆసక్తికరంగా వుంటాయి. ఈ సత్యం అన్ని కాలాల్లోనూ నిరూపణయింది. కానీ, కొన్నిసార్లు కల్పనల కంటే వాస్తవాలే బహు విచిత్రంగా వుంటాయి. కారణాలు చూపించి, లాజిక్కులు వినిపిస్తే తప్ప నమ్మశక్యంగా కూడా వుండవు. అలాంటి సంఘటనలు అనేకం వున్నాయి. అయినా, అందరికీ తెలిసిన ఒకటి రెండు సంఘటనల గురించి గుర్తుచేస్తే, "ఔను. కల్పన కంటే విడ్డూరంగా వాస్తవాలే వుంటాయి" అని అందరూ అంగీకరిస్తారు.

మాజీ భారత ప్రధానమంత్రి రాజీవ్ గాంధీని 1991వ సంవత్సరంలో 'థాను' అనే ఓ శ్రీలంక మహిళ ఓ బహిరంగ సభలోనే ఆత్మాహుతి దాడిలో చంపేసింది. అది కూడా అతన్ని కత్తితో పొడవకుండా, తుపాకీతో కాల్చకుండా.. కేవలం తన నడుముకి ఓ బెల్ట్‌బాంబ్ కట్టుకొచ్చి, అతనికి పాదాభివందనం చేస్తున్నట్లుగా కిందికి వంగి, రిమోట్‌ని నొక్కింది. దాంతో రాజీవ్‌గాంధీ, థానూలతోపాటు మరి కొంతమంది తునాతునకలైపోయారు. ఇది యావత్ ప్రపంచానికి తెలిసిన వాస్తవం తప్ప.. కల్పన కాదు!

'కరుణామూర్తియైన ఆడది ఒక మనిషిని ఇంత దారుణంగా చంపడమేంటి? బెల్ట్‌లో బాంబ్ అమర్చుకు రావడమేంటి? అసలు అలాంటి బాంబ్ వుంటుందా? ఏ వ్యక్తి అయినా, తన శత్రువును చంపి, తను బతకాలనే ఆశిస్తాడు. కానీ తన శత్రువుని చంపుతూ, తానూ చావడానికి సిద్ధపడతారా? ఇవన్నీ చాలామంది తీసే లాజిక్కులు! కానీ ఇలా లాజిక్కులకి అతీతంగా.. ఆనాడు ఆ సంఘటన వాస్తవంగా జరిగిపోయింది.

ఆనాటి నమ్మలేని వాస్తవాన్ని ఎందుకు గుర్తు చెయ్యాల్సొచ్చిందంటే.. ఇప్పుడు జితేంద్ర జీవితంలో మాధవరావు జరిపించబోయే ఓ సంఘటన కూడా అలాంటిదే!

మాధవరావుని తీసుకుని జితేంద్ర తన రూమ్‌కి వచ్చాడు. వాళ్లకేం చెప్పాలో ముందుగా ఆ యిద్దరూ కూడబలుక్కోవడం వలన అదేమీ పెద్దసమస్య కాలేదు.

**కొత్తగాలి...**

**ఒంటరిగా ఉంటే**
**అందరినీ**
**అందరిలో ఉంటే**
**ఏకాంతాన్నీ**
**కోరుతుంది మనసు!**

– *అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

మాధవరావు ఎవరు? అనే ప్రశ్నకి.. 'దేవు డిచ్చిన బాబాయ్' అని జితేంద్ర చెప్ప డంతో అందరికీ ఆనందం కలిగింది. ఎందుకంటే ఆ ఇంట్లో వున్న వారంతా జితేంద్రలాంటి అనాథలు, అట్టడుగు వర్గా నికి చెందినవారే! పెళ్ళి విషయంగా రామ దాసు జితేంద్రకిచ్చిన మాట తప్పాడనే విషయాన్ని మాధవరావు చెప్పడంతో అందరి ధ్యాస ఆ విషయం వైపు మళ్లింది.

మాధవరావు చెప్పాడు "జరిగిపోయిన దాని గురించి పదేపదే ఆలోచించడంకంటే, పరిష్కారం గురించి ఒక్కసారి ఆలోచిస్తే మంచి ఫలితాలు కలుగుతాయి"

ఆ తర్వాత తన పథకం గురించి చెప్ప నారంభించాడు. "యుద్ధాలు రెండు రకాలు. ఒకటి ధర్మయుద్ధం! రెండు యుద్ధధర్మం! మొదటిరకం యుద్ధంలో ఇరుపక్షాలకీ కావలసింది గెలుపే అయినా ఆ గెలుపు కోసం పోరాటంలో కొన్ని నియ మాలకీ, నిబంధనలకీ కట్టుబడి ఉండాలి. ఇంక రెండోరకం యుద్ధంలో కూడా ఆ వీరులకి కావలసింది గెలుపే అయినా, వారు ఆ లక్ష్యాన్ని సాధించడానికి కొన్ని సార్లు 'ఫౌల్‌గేమ్' ఆడాల్సి వుంటుంది. ప్రత్యర్థిని ఎదుటినుంచి పొడిచామా? పక్కనుంచి పొడిచామా? వెనక నించి పొ డిచామా? అని ఆలోచించరు. పొడి చామా? లేదా? గెలిచామా? లేదా? ఇదే ప్రధానమవుతుంది. ఏ కాలంలోనైనా, గెలి చినవాడే మొనగాడనిపించుకుంటాడు కాబట్టి ఈ ఫౌల్‌గేమ్‌ను యుద్ధధర్మంగా పిలవడం జరుగుతుంది. మహాభారత కాలం నాటినుంచీ ఇప్పటి ప్రజాప్రభు త్వాల్లో జరిగే ఎలక్షన్ల వరకు జరుగుతు న్నది ఈ ఫౌల్‌గేమే! ఈ యుద్ధధర్మమే! ఈ విషయం ఎందుకు చెప్పానంటే...మన ప్రత్యర్థి రామదాసే మొదటగా ఫౌల్‌గేమ్ ఆరంభించాడు. అలాంటి వాడితో మనం ధర్మయుద్ధం చెయ్యకూడదు. మనకున్న ధ్యేయం జితేంద్రకి, శోభకి పెళ్లి జరిపిం చడం"

అక్కడున్న కుర్రాళ్లందరికీ ఆ మాటలతో ఓ నూతనోత్సాహం కలిగింది. "మీరు చెప్పండి బాబాయ్, మేం కుమ్మేస్తాం" అన్నాడో యువకుడు.

"గతంలో జితేంద్రతోపాటు రామదాసు ఇంటికెళ్లిన, నాటకానికి ఆహ్వానించిన కుర్రాళ్ళు పక్కకి వచ్చెయ్యండి. ఎందుకంటే వాళ్లని చూడగానే రామదాసు గుర్తుపట్టే స్తాడు. కాబట్టి మన నాటకం నడవదు"

అతనలా చెప్పగానే ఓ ముగ్గురు యువ కులు పక్కకి వెళ్లి నిలబడ్డారు.

"ఇప్పుణ్ణేను కొన్ని అవసరమయిన పాత్ర లకి మనుషుల్ని నిర్ణయిస్తాను. అయితే రామదాసు భార్య సత్యవతి, శోభకి కూడా మన నాటకం సంగతి తెలియాలి. తెలి సాక మనల్నే సమర్థిస్తారని నా నమ్మకం! మరి శోభ వద్ద ఇప్పుడు సెల్‌ఫోన్ లేదు కాబట్టి, ఈ విషయం చెప్పడమెలా?" మాధవరావు అడిగాడు.

ఆ మాట అనగానే మధు అనే అబ్బాయి గబగబా వెళ్ళి ఓ పెట్టెలో వున్న ఫొటో ఆల్బమ్ తీసుకొచ్చి అతనికిచ్చాడు. అందులో ఒక అమ్మాయి ఫొటోలు ఆరు న్నాయి. "ఈ అమ్మాయి ఎవరు?" మాధ వరావు అడిగాడు.

"ముందా అమ్మాయి బాగుందో లేదో చెప్పండి బాబాయ్" అన్నాడు మధు.

"చాలా బాగుంది. పెళ్ళైందా?"

అందరూ ఘొల్లుమన్నారు.

"అందులో వున్నది అమ్మాయి కాదు బాబాయ్‌గారు, మా మధూగాడే! కాలేజీ వార్షికోత్సవానికి ఫ్యాన్సీ డ్రెస్ పోటీల్లో ఆ వేషం వేసి ఫస్ట్‌ప్రైజ్ కొట్టేసాడు. ఆ ఫంక్షన్‌లో శోభ కూడా పాల్గొంది" అన్నాడో యువకుడు. మాధవరావు

మెరిసే కళ్ళతో మధూని చూశాడు.

మర్నాడు ఉదయం పది గంటలవేళ మధు అమ్మాయి వేషంలో రామదాసు ఇంటికి వెళ్ళాడు. అతడ్ని చూడగానే శోభ గుర్తుపట్టి నివ్వెరపోయింది. ఎలాంటి భావప్రకటన చెయ్యొద్దని కళ్లతోనే సైగ చేసి "నా పేరు మాధవి పిన్నిగారూ. శోభకి క్లాస్‌మేట్‌ని. చాలా రోజుల్నించి శోభ కాలేజీకి రాకపోతే, ఓసారి చూసి వెళ్ళడానికి వచ్చాను" అన్నాడు మధు ఆడ గొంతుతో.

తన గదిలోనించి రామదాసు వచ్చి "ఎవరు? " అని అడిగితే శోభ సమాధానం చెప్పింది.

మధు చాలా నేర్పుగా మాట్లాడుతూ "నేనింతవరకు వాల్మీకి రాసిన రామాయణాన్ని చూసాను. ఇప్పుడు రామాయణం రాసిన వాల్మీకిని చూస్తున్నాను" అంటూ రామదాసు పాదాలకి నమస్కరించాడు. వాల్మీకితో పోల్చగానే రామదాసు మనసు గాలిలో గిరికీలు కొట్టింది.

"మీరా గదిలో కూర్చుని మాట్లాడుకోండి. నేను నా గదిలో కూర్చుంటాను" అన్చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయాడు. శోభ, సత్యవతి, మధు ఓ గదిలో కూర్చున్నాక, రామదాసు జితేంద్రని కొట్టించిన విషయం, మాధవరావు అనే వ్యక్తి ఈ పెళ్లి సమస్యని పరిష్కరించడానికి ఆడబోయే నాటకం విషయం వివరించి, అందుకే ఆడవాళ్లు ఏవిధంగా సహకరించాలో కూడా చెప్పి, ఆ ఇంటి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం బాబూరావు అనే ఓ మ్యారేజ్ బ్యూరోకి సంబంధించిన వ్యక్తి వచ్చి రామదాసుతో మాట్లాడాడు. అప్పుడు సత్యవతి, శోభ కూడా అక్కడే వున్నారు.

"గుంటూరు వెంకట్రావుగారనే ఓ మహా శ్రీమంతుడు గుంటూరు నించి ఈ వూరొచ్చారు. అది కూడా మిమ్మల్ని కల్సుకోవడానికే! గుంటూరులో వున్న సగం ఆస్తులు ఆయనవే! ఆయనకి మోహన్ ఒక్కడే కొడుకు. ఓసారెప్పుడో ఈ వూరు వచ్చినప్పుడు, ఆ అబ్బాయి మీ అమ్మాయిని చూసారుట. అప్పట్నుంచి మీ అమ్మాయిని తప్ప మరొకర్ని చేస్కోనని భీష్మించుకున్నాడట. దాంతో గత్యంతరం లేక, ఈ వూరొచ్చి, స్టార్ హోటల్లో దిగి, ముందుగా నన్ను రాయబారిగా పంపించి ఈ విషయం తెలియజేయమన్నారు. మీరు 'ఊ' అంటే చాలు, నేనో ఫోన్ కొట్టి వారిని రప్పిస్తాను" అంటూ గడగడమని చెప్పేసాడు.

గుంటూరులో సగం ఆస్తులున్న వ్యక్తి తనని వెతుక్కుంటూ వచ్చాడని చెప్పగానే రామదాసు రెక్కలు కట్టుకుని చుక్కల లోకానికి ఎగిరిపోయినట్లు భావించుకుంటూ తన అంగీకారాన్ని తెలియజేశాడు. కానీ సత్యవతి భర్తని ఓ గదిలోకి రమ్మని సైగ చేసి, పిలిచింది.

అతను వెళ్లాక "ఎవరో అమలాపురం వాళ్లకి అమ్మాయిని ఆ వూరు తీస్కొచ్చి మరీ పెళ్లి చేస్తానని మాటిచ్చారుగా? " అంటూ సత్యవతి గుర్తు చేసింది.

"సాక్షాత్తూ కుబేరుడంతటి గుంటూరు వెంకట్రావుగారే నన్ను వెదుక్కుంటూ ఇక్కడికొచ్చాక మన అమ్మాయిని వాళ్ల వూరు తీసుకొస్తే తప్ప పెళ్లి చేస్కోమని చెప్పిన అమలాపురం సంబంధం గురించి నేనెందుకు ఆలోచిస్తాను? నువ్వు ఆ విషయం మర్చిపో" అనేసి హాల్లోకి వెళ్లాడు.

బాబూరావు గుంటూరు వెంకట్రావు గారికి ఫోన్ చేసి మీరు రావచ్చునని చెప్పాడు. ఓ పావుగంట తర్వాత ఓ టాక్సీలో గుంటూరు వెంకట్రావు పేరుతో మాధవరావు సఫారి సూట్ వేసుకుని, హుందాగా దిగాడు. అతని వెంట అతని

కొడుకు మోహన్‌గా మరో వ్యక్తి, బావమరిది వీరభద్రంగా మరో వ్యక్తి దిగారు. పెళ్లికి సంబంధించిన విషయాలన్నీ ఏకపక్షంగానే జరిగాయి. అంటే... మాధవరావు చెప్పడం, మిగతావారు వినడమే జరిగింది.

"మీరు మాకేం ఇవ్వక్కర్లేదు. సగం గుంటూరు మాదే అయినప్పుడు... మీరు కట్నం రూపంలో ఇచ్చే పదిలక్షలూ పాతిక లక్షల్లాంటి చిల్లర పైసల్ని నేనే జేబులో వేసుకు తిరగను? అంచేత అవేం అక్కర్లేదు. మావాడికి తమ కూతుళ్లనిచ్చి పెళ్లి చెయ్యాలని కరెక్ట్‌గా అరడజను సంబంధాలు ప్రయత్నిస్తున్నాయి. అన్నీ దగ్గరి సంబంధాలే! ఎవర్ని కాదని, ఎవర్ని ఔనన్నా గొడవలొస్తాయి. అంచేత ఇక్కడే అతి నిరాడంబరంగా పెళ్లి చేసేసి, గుంటూరు వెళ్లాక అతి భారీ స్థాయిలో అందరికీ విందు భోజనాలు ఏర్పాటు చేస్తాను" అన్నాడు మాధవరావు కాస్త తమాషాగా మాట్లాడుతూ.

రామదాసు తన ఆనందానికి, ఆమోదానికి చిహ్నంగా రెండు చేతులెత్తి నమస్కరించాడు.

"పెళ్లి అన్నాక ఏ మాటకామాటే మాట్లాడుకోవాలిగా! మీకు కులమతాల గురించి, అభిజాత్యాల గురించి మహా పట్టింపని మా బావమరిది వీరభద్రం చెప్పాడు. నా పేరు గుంటూరు వెంకట్రావునాయుడు. మరి మీరు ఈ కులాంతర వివాహానికి అంగీకరిస్తారా? "

భర్తవైపు చూడనైనా చూడకుండా సత్యవతి సమాధానం చెప్పింది. "ఈ రోజుల్లో మతాంతర వివాహాలు, దేశాంతర వివాహాలే జరిగిపోతున్నప్పుడు, కులాంతర వివాహాలొక లెక్కా? మాలో కూడా ఈ మధ్య చాలా కులాంతర వివాహాలు జరిగిపోతున్నాయి. పైగా మీ అంతటి ధనవంతులు అన్ని మెట్లు దిగి, ఆఖరిమెట్టు మీదున్న మా దగ్గరకొచ్చినప్పుడు, కులం పేరుతో మేమెందుకా అదృష్టాన్ని కాలదన్నుకోవాలి!"

మాధవరావు రామదాసు వైపు చూసి "మీ ఆవిడగారు లేటెస్ట్ బ్రాండ్ మాటలు చెప్పినా, మీ ముఖంలో ఇంకా లైటు వెలగ లేదు. మీ అభిప్రాయం ఏమిటి? " అని అడిగాడు.

"నా అభిప్రాయాన్నే మా ఆవిడ

## ముట్నూరి కృష్ణారావు చతురోక్తులు



నాలుగు దశాబ్దాలుగా కృష్ణాపత్రిక సంపాదకులుగా చేసిన ముట్నూరి కృష్ణారావు ఆంధ్రదేశంలో తమ పత్రిక ద్వారా స్వాతంత్ర్యోద్యమాన్ని వ్యాపింపజేశారు. పాత్రికేయ వృత్తిలో విలువలకు ప్రాణప్రతిష్ఠ చేసిన ఆయన వివిధ సందర్భాలలో నుడివిన చతురోక్తులు కొన్ని..

### ఈవారం ఎవరు చింతించాలి?

ఎవరైనా ప్రముఖులు చనిపోతే అందరూ బాధపడటం అత్యంత సహజం. అయితే పత్రికల్లో పనిచేసేవారికి ఆ చనిపోయిన వ్యక్తి గురించి ఏమి రాయాలి? ఎలా రాయాలి? అనే ఒత్తిడి ఉంటుంది. బాధపడేటంత తీరిక ఉండదు.

గొప్పవారు మరణించినప్పుడు ముట్నూరి వారు కొంచెం హాస్యధోరణితో 'అయితే ఈ వారంలో నేను చింతించాలన్నమాట? ' అనే వారు. అంటే దీనర్థం తను ఆ వ్యక్తి గురించి సంపాదకీయం రాయాలని.

కొన్ని సందర్భాల్లో 'పోనీ.. ఈవారం మీరు చింతించరాదూ? ' అని మిగతా సబ్ ఎడిటర్లతో అనేవారు. దాంతో మరణించిన వ్యక్తి గురించి సంపాదకీయం రాయాల్సిన అవసరం లేదనీ, వార్తగా రాసేయాలనీ సిబ్బంది అర్థం చేసుకునేవారు.

చెప్పింది" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"మా బావమరిది మీ అమ్మాయి గురించి ఏదో విన్నాడట. ఆ విషయం గురించి అడగమంటూ నా చెవులు కొరికే స్తున్నాడు"

రామదాసు గుండెలు దడదడలాడినా "ఏ విషయం?" అని అడక్క తప్పింది కాదు.

"అదేనండీ.. మీ అమ్మాయి ఎవరో జితేంద్రనే అబ్బాయిని ప్రేమించిందట. ఓసారి సినిమా హాల్లో జరిగిన గొడవలో కూడా ఇరుక్కున్నాదట. ఆ విషయం తెలిసి ఇచ్ఛాపురం సంబంధం ఒకటి తప్పి పోయిందట. ఇదీ వాడిగోల! అదంతా మీడియా సృష్టి అయి ఉంటాదిరా అని

## కొత్తగాలి...

**స్వార్థం కాదు..**
**మానవ జీవితానికి**
**పరమార్థం ఉండాలి!**
**అపుడే జన్మ ధన్యం!!**

*– గుర్రం శారదాశ్రీనివాస్,*

*చెరుకుపల్లి, గుంటూరు జిల్లా*

చెప్పినా వినడే!" మాధవరావు కావాలనే 'మీడియాసృష్టి' అనే మాటని రామదాసుకి అందించాడు.

దాంతో అతను ఎక్కువగా తడుముకో కుండా "ఔనండి.. అదంతా మీడియా సృష్టే.. మీడియాసృష్టే.." అంటూ రామ దాసు తన భార్యవైపు చూసాడు. సత్యవతి వెంటనే జోక్యం చేసుకుని 'ఔను అన్నయ్య గారు, అదంతా మీడియాసృష్టే! ఆ అబ్బాయి ఇక్కడికి రావడం, అతను మంచి ఉద్యోగం సంపాదించుకొస్తే మా అమ్మాయినిచ్చి పెళ్లి చేస్తామని షరతులు పెట్టడం ఇదంతా మీడియా సృష్టే తప్ప నిజం కాదు" అంది

వీరభద్రం బోలెడంత ఆశ్చర్యపోతూ "ఆ కుర్రాడు మీ ఇంటికి రావడం, మీ ఆయనగారు షరతులు పెట్టడం ఈ విషయం మాకు తెలియనే తెలీదు ఇప్పుడు మీరు చెప్పడమే" అన్నాడు.

రామదాసు భార్యని గుడ్లురుముతూ చూసి, మళ్లీ మాధవరావు వైపు నవ్వుతూ చూసి "ఆనాడు సీతాదేవి మీదే నిందలొ చ్చాయి. రాముడి మీదే విమర్శలొచ్చాయి. అలాంటిది సామాన్యులమీద రావడంలో ఆశ్చర్యమేం ఉంది. మీరు విశాల హృద యులు కాబట్టి నిజమేదో, నింద ఏదో ఇట్టే తెల్సుకోగలిగారు" అన్నాడు.

మరికాస్సేపు సంభాషణ జరిగాక "ఈ పెళ్లిసంగతి మా బంధువులకి తెల్సిపోయి నా మీదకి యుద్ధానికి రాకముందే పెళ్లి జరిపించేద్దాం. వచ్చేటప్పుడు ముహూర్తం చూపించుకునే వచ్చాను. ఎల్లుండే ముహూర్తం" అన్నాడు మాధవరావు. దానికి రామదాసు కూడా ఆనందంగా అంగీకరించాడు.

★ ★ ★

ఓ చిన్న కళ్యాణమండపంలో అతి తక్కువ మంది అతిథుల సమక్షంలో పెళ్లి ఏర్పాటు చేసారు. వధూవరులు పెళ్లి పీట ల మీద కూర్చున్నారు. మంగళ వాయి ద్యాలు మోగుతున్నాయి. పురోహితుడు మంత్రాలు చదువుతుండగా.. టప్‌మని కరెంట్ పోయి, చీకటి అలముకుంది.

రామదాసు తెగ చిరాకుపడిపోయాడు. "కరెంట్ కోత విమోచనం లేని శాపంలా తయారైంది. రోజుకి మూడుసార్లు తీసేస్తు న్నాడు. ఈ మధ్య వర్షాలు పడ్డం వల్ల ఓ వారం పదిరోజులుగా కరెంట్ తీయడం లేదు. కానీ ఇవాళ మళ్లీ పోయింది. శుభ ఘడియలు దాటితే ముహూర్తం బలం తగ్గి

పోయే ప్రమాదం ఉందికదా? "

మాధవరావు అతనికి ధైర్యం చెప్తూ.. "ఈ కరెంటు కోతల విషయం, ముహూర్త బలాల విషయం నాకు తెలుసు కాబట్టే జెనరేటర్ ఏర్పాటు చేసాన్లెండి" మాధవ రావు అంటుండగానే మంటపంలోని లైట్లు వెలిగాయి.

శోభ పక్కన వరుడి అలంకరణలో కూర్చున్న వ్యక్తిని చూసి రామదాసు తుళ్లి పడ్డాడు.

అతను జితేంద్ర!

మంటపానికి ఓ పక్కన నిలబడిన వ్యక్తి కాలేజీ ప్రిన్సిపల్ భూషణం!

రామదాసు ఆశ్చర్యం నించి తేరుకునే లోగా జితేంద్ర శోభ మెడలో తాళికట్టాడు. "మోసం" అంటూ అరుస్తూ లేచి పీటల మీద కూర్చున్న జితేంద్రని చెయ్యి పట్టుకుని లాగాడు. అడ్డుకోబోయిన భూషణాన్ని లెంపకాయ కొట్టాడు. మాధవరావు దగ్గరకి వచ్చి ఆవేశంతో మాట్లాడాడు, "ఇదంతా మాయ, మోసం, కుట్ర బావ గారూ! వీడెవడో మాకు తెలీదు. ఇదంతా యీ భూషణంగాడే చేసాడు. ఇప్పుడే పోలీసుల్నీ పిలిచి వీళ్లని అరెస్ట్ చేయిస్తాను"

భూషణం కూడా ఆవేశంగానే జవాబు చెప్పాడు. "ఎందుకండీ అరెస్టు చేయిస్తారు? వాళ్లిద్దరూ మేజర్లు.. ఒకర్నొకరు ప్రేమించుకున్నారు. హిందూ వివాహ చట్టం ప్రకారం వాళ్లిద్దరికీ పెళ్లి చేస్కునే హక్కుంది. ఆ హక్కుని కాదంటూ ఎవరు అభ్యంతరం పెట్టినా, వారిని జైల్లో పెట్టాలని చెప్పే చట్టాలున్నాయి"

"ఏడిసావ్! చట్టాలు మనం రాసుకున్నవి. కానీ శాస్త్రాలు, సంప్రదాయాలు సనాతన కాలంనించి ఉన్నాయి. పెళ్లి చేసేటప్పుడు సంప్రదాయాలు చూస్తాం, జాతకాలు చూస్తాం, ముహూర్తాలు చూస్తాం తప్ప చట్టాలు, సెక్షన్లు చూడం. పెద్దల అంగీకారం లేకుండా, ఎవరో దారంట పోయేవాడు తాళికట్టేస్తే దాన్ని తెంచి పారేస్తాంగానీ, పెళ్లిగా ఆమోదిస్తామా? " అంటూ శోభ మెడలోని తాళిని లాగెయ్యబోయాడు రామదాసు.

ఇప్పుడు మాధవరావు జోక్యం చేసుకుని మాట్లాడాడు "అందరూ దయచేసి శ్రద్ధగా వినండి. ఇందాక లైట్లు ఆరాయి, మళ్లీ వెలిగాయి. ఈ చీకటి వెలుగుల మధ్య పెళ్లి కొడుకు మారాడు. ఈ మార్పు వెనక మాయ మోసాలున్నాయని వాదిస్తూ అరుస్తున్నారు. పెళ్లికొడుకుని సమర్థించిన భూషణంగారిని కొట్టారు కూడా! ఇప్పుడు నేను కొన్ని విషయాలు చెప్పాల్సిన అవసరం ఉంది. ఆ విషయాల్లో కొన్ని నిజాలూ ఉన్నాయి. కొన్ని అబద్ధాలూ ఉన్నాయి. ముందుగా ఆ అబద్ధాల సంగతి చెప్తాను. నాపేరు గుంటూరు వెంకట్రావు అనేది అబద్ధం. గుంటూరులోని సగం ఆస్తులు నావేనని చెప్పడం కూడా అబద్ధమే! ఇంక నిజాల సంగతంటరా!

శోభ, జితేంద్రలు ప్రేమించుకోవడం నిజం! జితేంద్ర మంచి ఉద్యోగం సంపాదించుకొస్తే, రామదాసు తన కూతుర్నిచ్చి పెళ్లి చేస్తానని చెప్పడం నిజం! కానీ ఆ గడువు తీరకముందే, ఆయన తన కూతురికి మరో సంబంధం కుదర్చడం నిజం! జితేంద్ర అడ్డుని తొలగించుకోడానికి రౌడీలతో రామదాసు దారుణంగా కొట్టించడం నిజం!"

రామదాసు లోలోపల కళవెళపడుతున్నా బైటికి మాత్రం గాంభీర్యం ప్రదర్శిస్తూ "మీరంతా కలిసి చేసిన కుట్రని సమర్థించుకోడానికి ఇలాంటి కట్టుకథలు చెప్తున్నా, నేను ఆ కుర్రాణ్ణి కొట్టించానని చెప్పడం మాత్రం శుద్ధ అబద్ధం. రాగ ద్వేషాలని జయించి, రామాయణం రాస్తున్న వాణ్ణి, నేనలాంటి హింసాకాండకి



ఎందుకు పాల్పడతాను? " అన్నాడు.

మాధవరావు మళ్లీ తన ధోరణిలోనే చెప్పాడు "ఈ రామదాసు రాగద్వేషాల్ని, అరిషడ్వర్గాల్ని జయించానని తనకి తానే ప్రచారం చేస్కోవడం నిజం! కానీ ఇతని మనస్తత్వం సగటు స్థాయిలో కూడా లేకుండా అధమస్థాయిలోకి వెళ్లిపోయిందని కూడా గ్రహించాల్సి ఉంటుంది. ఈ పెళ్లికి రామదాసు అభ్యంతరం చెప్తే, ఓ మేజర్‌గా అతని మీద శోభ పోలీస్ కంప్లయింట్ ఇవ్వడానికి సిద్ధంగా ఉండడం నిజం!"

"నా కూతురు నా మీద కంప్లయింట్ ఎందుకిస్తుంది? "

"మీ కూతురిగా కాదు... పెళ్లికూతురిగా ఇస్తుంది. నా కూతురు నామీదెందుకు కంప్లయింట్ ఇస్తుందన్నారే! మీ కూతురని తెల్సికూడా తను ప్రేమించినవాడిని మీరెందుకు చంపించాలని చూసారు? జితేంద్ర కూడా మీ మీద రెండు కంప్లయింట్లు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. మీరు తన పెళ్లికి అడ్డు తగులుతున్నందుకు ఒకటి, తనని రౌడీలతో చంపించడానికి ప్రయత్నించారన్నది రెండోది! రామదాసు కుదుర్చిన నలుగురు కిరాయి రౌడీలలో ఇప్పటికే ఒకడు దొరకడం నిజం! వాడి ద్వారా పోలీసులు మిగతా వాళ్లనీ పట్టుకోవడం నిజం! కోర్టులో హత్యా ప్రయత్నం కేసు పె



ట్టడం నిజం! తర్వాత రామదాసు హీన పక్షం పదేళ్ల పాటు జైలుకెళ్లడం నిజం!”

శోభ తన జాకెట్‌లోంచి ఓ కంప్లయింట్ కాగితాన్ని తీసి మాధవరావుకి అందించింది. జితేంద్ర కూడా తన జేబులోంచి రెండు కంప్లయింట్ కాగితాలు తీసి అతనికి అందించాడు. అతని స్నేహితులు తాడుతో చేతులు కట్టేసిన ఓ రౌడీని లాక్కొచ్చి కళ్యాణ మంటపంలో నిలబెట్టారు.

రామదాసులో ఆవేశం తగ్గి, ఆ స్థానంలో భయం ప్రవేశించింది. ఆధారాలతో సహా అడ్డంగా దొరికిపోయిన నేరగాడిలా బిత్తర చూపులు చూస్తున్నాడు. మాధవరావు ఇప్పుడు మరోవిధంగా మాట్లాడాడు.

“ఇప్పుడు చెప్పండి.. అన్యాయం చేసిందెవరు? దాన్ని ప్రతిఘటించిందెవరు? అరిషడ్వర్గాల్ని జయించేశానని ఆత్మవంచన చేసుకుంటూనే, అమానుషంగా ప్రవర్తించిందెవరు? మీరు ఎంతసేపూ జితేంద్ర ఓ అనాథనీ.. ఓ దళితుడి పెంపకంలో పెరిగాడు కాబట్టి, అతను మీ అల్లుడు కావడానికి అనర్హుడని భావించారే గానీ.. అతనిలోని సుగుణాన్ని చూడ్డానికెప్పుడైనా ప్రయత్నించారా? మీ అమ్మాయి అతన్ని ప్రేమించినా, అతను మాత్రం తన పరిధుల్ని దాటి ఎప్పుడూ ప్రవర్తించలేదు. మీ అమ్మాయిని లేవదీసుకుపోయి రహస్యంగా వివాహం చేసుకుంటే మీరు అడ్డుకోగలరా? అలాంటి అవకాశం అతనికి వున్నా పెద్దల అంగీకారంతోనే పెళ్లి చేసుకుంటానన్నాడు. తను ఎలాగూ ఎవరూ లేని అనాథగానే పెరిగాడు. ఈ పెళ్లి

## నర'సింహ' వెనుకటి జన్మ!

ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ నరసింహం, గొట్టిపాటి బ్రహ్మయ్య ఏదో పనిమీద ఒక ఊరికి వెళ్లారు. కాసేపటికే పెద్దపెట్టున వర్షం మొదలయింది. ఎవరో ఒక ఆసామిని పిలుచుకు వచ్చేందుకని చెరుకువాడవారు తల



మీద తెల్ల ముసుగు వేసుకుని గాలివానలోనే బయలుదేరారు. కృష్ణారావు, బ్రహ్మయ్య కారులోనే కూర్చుని వున్నారు. తలమీద విచిత్రంగా గుడ్డవేసుకుని వెళుతున్న చెరుకువాడవారిని చూసి ఒక ఆంబోతు వెంట పడింది. ఆయన పారిపోయి 'బతుకు జీవుడా!' అనుకుంటూ ఇంటి అరుగెక్కి నిలబడ్డారు.

అది చూసి కృష్ణారావు వెంటనే 'మన నరసింహంగారు వెనుకటి జన్మలో ఆవు సుమండీ!' అన్నారు నవ్వుతూ.

మూలంగా శోభని తల్లిదండ్రుల్నించి దూరం చేసి, ఆమెను కూడా అనాథగా మార్చడమెందుకని ఆలోచించాడు.

చూడండి రామదాసుగారూ! జలుబు చేసిన ముక్కుతో మల్లెపూలు వాసన చూసి, వాటికి సువాసన లేదని ఛీత్కరించే ముందు.. మన ముక్కులకి జలుబు చేసిందేమోనని ఆలోచించడం మంచిది కదా! ఓ మనిషిని మరో మనిషి అర్థం చేస్కోవాలంటే కొండంత సంస్కారం కావాలి. కానీ అపార్థం చేస్కోడానికి పిడికెడు మూర్ఖత్వం చాలు. అతనిలో సంస్కారం ఉంది కాబట్టి పెళ్లి విషయంలో అడ్డదారి తొక్కకుండా మీ అనుమతితోనే మీ అమ్మాయిని పెళ్లి చేస్కోవాలనుకున్నాడు. మీరు మూర్ఖంగా ఆలోచించారు కాబట్టే, పెళ్లి చేస్తానని మాటిచ్చి కూడా అతన్ని చంపించడానికి ప్రయత్నించారు.

నేను మోసానికి మోసమే మందుగా భావించి, వీళ్లతో ఈ నాటకమాడించి ఈ శుభకార్యం జరిపించాను. ఇప్పుడీ నూతన దంపతులకి మిగిలిన మార్గాలు రెండే రెండు. ఒకటి.. చట్టప్రకారం నడుచుకుని మిమ్మల్ని జైలుకి పంపించడం! రెండు సంప్రదాయబద్ధంగా నడుచుకుంటూ, మిమ్మల్ని క్షమించి మీ దీవెనలు పొంది, మిమ్మల్ని పెద్ద దిక్కుగా మిగుల్చుకోవడం! మానవత్వాన్ని మించిన మతం లేదని నిరూపించడానికి నేను ప్రయత్నించాను. మీరు కూడా కులాలు, మతాలు, పగ, ప్రతీకారాలు మర్చిపోయి వాళ్ళని దీవిస్తే మీరు మనసున్న మనిషిగా మిగుల్తారు"

ఒకటి, రెండు, మూడు, నాలుగు క్షణాలు గడుస్తున్నాయి. రామదాసులోని ఘనీభవించిన మూర్ఖత్వం, అవధులు మీరిన అహంకారం కరగనారంభించాయి. అతను ఏం చేస్తాడా? అని అందరి కళ్లూ ఆయన్నే చూస్తున్నాయి.

అతను పళ్లెంలోని అక్షింతలు తీసి నూతన దంపతుల శిరసు మీద జల్లి ఆశీర్వదించాడు!

★ ★ ★

పెళ్లైన మూడోరోజు జితేంద్ర ఇంటి డాబామీద అతను, అతని స్నేహితులంతా దీన వదనాలతో నిలబడ్డారు. ఘనకార్యం లాంటి శుభకార్యం జరిగినందుకు అందరి ముఖాల్లోనూ ఆనందం తాండవించాలి. రామదాసులాంటి వ్యక్తిలో పరివర్తన కలిగించినందుకు గర్వపడాలి. కానీ ఆ గర్వాలు, ఆనందాలు వారి మనసులో కలగలేదు. మనసుకి ముఖమే ఓ అద్దం కాబట్టి, ఆ ముఖాల్లో సంతోషం కనిపించ

డంలేదు. అందుకు కారణం ఒకటే!

వారికి ఆపద్బంధువులా వచ్చి సాయం చేసి రెండు జీవితాల్ని నిలబెట్టిన మాధవ రావు వారి నించి నిష్క్రమిస్తున్నాడు.

జితేంద్రకి పెళ్లి చేసుకున్నానన్న ఆనందం కంటే... తన పెళ్లి జరగడానికి కర్త, కర్మ, క్రియ అయిన మాధవరావు వెళ్లిపోతున్నందుకు బాధే ఎక్కువుంది. అతను ఈ లోకం నించి నిష్క్రమించడానికే, ఇక్కడి నించి ప్రయాణమవుతున్నాడు.

"మీరు మా సమస్యని పరిష్కరించినట్టే, మేమూ మీ సమస్యని పరిష్కరిస్తాం. దయచేసి అదేంటో చెప్పండి" అన్నాడు జితేంద్ర.

"మా నాన్నగారి మూర్ఖత్వం వల్ల మా ప్రేమ బలిపీఠం ఎక్కిపోతుందనుకున్నాం. అలాంటి సమయంలో మీరా దేవుడు పంపిన ఆపద్బాంధవుడిలా వచ్చి మా ప్రేమకథని పెళ్లిపీటల మీదకి ఎక్కించారు. ఆ రుణం తీర్చుకోడానికైనా మేం మీకు సాయం చెయ్యాలి గదా!" అంది శోభ.

అక్కడున్నవారు అందరూ ఇదే అభిప్రాయాన్ని రకరకాల మాటలతో వినిపించారు.

మాధవరావు జితేంద్ర పెళ్లి చేసే ప్రయత్నంలో, అతను గుంటూరు వెంకట్రావుగా హుషారుగా తిరుగుతూ చలాకీగా మాట్లాడాడు. ఆ హుషారు ఇప్పుడు మాత్రం కనిపించడంలేదు. అందరి అభ్యర్థన విని అతను శుష్క మందహాసం చేసి చెప్పాడు.

'మీ వయసు దాటొచ్చిన మనిషినీ, జీవితంతో పోరాడిన మనిషిని కాబట్టి, మీ యువతరం సమస్యని నా యథాశక్తి పరిష్కరించగలిగాను. కానీ, మీరింకా యవ్వనం తొలిమెట్టుమీదున్నారు. మీకు ఆవేశం వున్నంతగా ఆలోచన ఉండదు. మీరు నా సమస్యని పరిష్కరించలేరు"

"నా సమస్యని మీరు ఆలోచనతో పరిష్కరించారు. ఆలోచనతో మీరు పరిష్కరించుకోలేకపోయిన మీ సమస్యని మేం మా ఆవేశంతో పరిష్కరించగలమేమో ఆలోచిస్తాం. మీ సమస్య చెప్పండి" అంటూ వారు పట్టుపట్టి మరీ అడుగుతుంటే.. మాధవరావు గత్యంతరంలేక తన జీవితాన్ని మాటల్లో ఆవిష్కరించాడు.




"నేనో సాదాసీదా సగటు మనిషిని. ఓ ప్రైవేటు కంపెనీలో హెడ్ క్లర్క్‌గా పని చేసేవాణ్ణి. నా గురించి చెప్పడానికి రెండోవాక్యం లేదు. నాకు ఒక్కడే కొడుకు భానుమూర్తి. వాణ్ణి ప్రసవిస్తూనే మా ఆవిడ సీతాలక్ష్మి మరణించింది. అంటే... నా జీవితం నుంచి నా భార్య నిష్క్రమణం, నా కొడుకుగా భానుమూర్తి ఆగమనం ఒకేసారి జరిగాయి. అప్పట్నించి వాణ్ణి పెంచీ పెద్దచేసీ ప్రయోజకుడిగా మార్చడానికే నా జీవితాన్ని అంకితం చేసాను. నేను మళ్లీ పెళ్లి చేసుకుంటే నాకు భార్య వచ్చినా, మా వాడికి మారుటి తల్లి కష్టాలు కలుగుతాయని భయపడి, నా గురించి నేను ఆలోచించుకోవడం మానేసాను. మావాణ్ణి బాగా చదివించి, గవర్నమెంటు ఆఫీసర్ను చేయాలని, వాడికి నా

చేతుల మీదుగా పెళ్లిచేసి, కూతుర్లాంటి కోడలితో హాయిగా గడుపుతూ, నా మన వళ్ళు, మనవరాళ్ళతో ఆడుకుంటూ, వాళ్ళ తోపాటు నేనూ ఓ పసిబిడ్డగా మారి పోయి, కేరింతలు కొట్టాలనే చిన్న చిన్న కోరికలతో కాలక్షేపం చేసేవాణ్ణి. ఆ రోజుల కోసమే, నా కొడుకుని నా ఆశగా, నా ధ్యాసగా, శ్వాసగా మార్చుకుని పెంచాను.

పరుగెత్తి పాలు తాగడం కంటే నిలబడి నీళ్లు తాగడమే మంచిదనుకునే భావాలతో మా తరం వాళ్లు పెరిగారు. కానీ పరుగె త్తయినా పాలు తాగాలి. అసలు.. పరుగె

**కొత్తగాలి...**

**మనిషి...**
**ఆకాశంలో పక్షిలా ఎగురుతున్నాడు**
**నీటిలో చేపలా ఈదుతున్నాడు కానీ**
**మనిషిలా బ్రతకడం మరిచిపోయాడు**

– ఇ. మల్లిక్,
ఏలూరు

త్తకుండానే పాలు తాగాలి. అందుకోసం అడ్డదారి తొక్కినా, అదే దొడ్డదారి అవు తుంది. ఓ చిన్న లాభం పొందడానికి ఓ పెద్ద తప్పు చేసినా ఫర్వాలేదు. మెట్టు మెట్టూ ఎక్కి మేడ మీదకి వెళ్లడం తెలివి లేనివాళ్ల పద్ధతి. లిఫ్ట్ ఎక్కి కింద స్విచ్ నొక్కితే, క్షణంలో పై అంతస్తుకి చేరిపో వడం ఈనాటి వాళ్ల పద్ధతని అనుకునే ఈ తరం యువకులు చాలామందిలో మా భానుమూర్తి కూడా మొదటి వరుసలో వుంటాడు. ఈ భావవైరుధ్యం వల్లే మా తండ్రీకొడుకుల మధ్య అగాథం ఏర్ప



డింది..” అంటూ చెప్తున్న మాధవరావు ఆగిపోయి, కాస్సేపు అలా రెప్పార్పకుండా శూన్యంలోకి చూస్తూవుండిపోయాడు.

★ ★ ★

ఆ రోజు మాధవరావు పని చేస్తున్న ఆఫీసుకే పెళ్లి సంబంధాలు కుదిర్చే ఆది మూర్తి కొన్ని ఫొటోలు పట్టుకొచ్చాడు. “ఈమధ్య లవ్ మ్యారేజీలు ఎక్కువైపో వడం వలన, మ్యారేజీబ్యూరోలు ఎక్కువై పోవడం వలన మా బిజినెస్ దెబ్బతినే సింది” అంటూ ఆదిమూర్తి ప్రాధేయపడ్డం వల్ల, అతన్ని ప్రోత్సహించడానికి అతను చూపించిన సంబంధాల్నే చూస్తున్నాడు మాధవరావు. అతనిచ్చిన ఆరుగురి అమ్మాయిల ఫొటోల్ని వరుసగా టేబుల్ మీదున్న ఫైల్స్ మీద పెట్టి.. ఒక్కొక్క అమ్మాయి రూపురేఖల్ని చూస్తూ, వాళ్ళ కుటుంబ వివరాల్ని అడుగుతున్నాడు.

అటెండర్ వెంకట్రావు వచ్చి, ఆఫీసర్ గారు ఏదో ఫైల్ ఇమ్మని అడిగితే మాధ వరావు కంగారు కంగారుగా ఓ ఫైల్ ఇచ్చి పంపించాడు. ఆఫీసర్‌గారు ఆ ఫైల్ విప్ప గానే రెండు ఫొటోలు కనిపించాయి. అతను చిరాగ్గా తల పట్టుకుని మాధవరా వుని పిలిపించి “ఏంటయ్యా ఇది? ప్రతీ రోజూ, నీనించి ఏ ఫైల్ వచ్చినా, అందులో ఒకటో రెండో అమ్మాయిల ఫొటోలు కని పిస్తున్నాయి. ఇంకా మీ అబ్బాయికి సంబంధం కుదర్లేదా? నువ్వేమయినా, కట్నం విషయంలో కొండెక్కి కూర్చు న్నావా? ” అని అడిగాడు.

మాధవరావు కాస్త బిడియపడుతూనే వాస్తవం చెప్పాడు “కట్నాలమీద నాకు ఎలాంటి ఆశ లేదు సార్! నాకు నా కొడుకు, వాడికి నేను తప్ప మరెవరూ లేరు. అంచేత నా ఇంటికొచ్చే కోడలు పేదింటి అమ్మాయి అయినా ఫర్వాలేదు, కానీ పాలలో నీళ్లు కలిసిపోయినట్టుగా కలిసి పోవాలని కోరుకుంటున్నాను.

ఎందుకంటే మాలాంటి మిడిల్ క్లాస్ తండ్రుల తలరాతల్ని ఫస్ట్ హాఫ్ అంతా ఆ భగవంతుడురాస్తే, సెకెండ్ హాఫ్ మాత్రం కొడుకులూ, కోడళ్లే రాస్తున్నారు. అంచేత, ఒక్కో సంబంధం గురించి ఒకటికి నాలు గుసార్లు అడిగి తెలుసుకుంటున్నాను"

ఆఫీసరు మరేం మాట్లాడకుండా, ఆ ఫైల్‌కి సంబంధించిన విషయమేదో అడి గాడు. మాధవరావు సమాధానం చెప్తూనే ఆ టేబుల్ మీదున్న ఓ శుభలేఖని చూసాడు. అది చాలా అందంగా, పెద్ద దిగా కనిపించింది.

"సార్ ఆ పెళ్లి అయిపోయిందా?" ఆ శుభలేఖని చూపించి అడిగాడు.

"నిన్ననే అయిపోయింది. ఏం అలా అడిగావు?"

"ఏంలేదు సార్! నాకున్నది ఒక్కడే కొడుకు. వాడికి నేను పెళ్లి చేసేది కూడా ఒక్కసారే కదా! అంచేత వాడిపెళ్లికి నేను వేసే శుభలేఖ కూడా మా సర్కిల్లోని వారందర్నీ ఆశ్చర్యంలో ముంచేయాలను కుంటున్నాను. ఆ తర్వాత ఒక శుభలేఖని లామినేషన్ చేయించి మా ఇంటి హాలు మధ్యగా అందరికీ కనింపించేలా పెట్టాల నుకుంటున్నాను. అంచేత దయచేసి ఆ కార్డు నాకు ఇప్పిస్తే.."

ఆఫీసరు చిన్నగా నవ్వి ఆ కార్డు ఇచ్చి "ఈ కార్డులాంటిదే వేయిస్తావా?" అని అడిగాడు.

"లేదుసార్, ఇలాంటి మంచి మంచి కార్డులు ఇంతవరకు డెబ్భైఏడు సంపాదిం చాన్సార్. అందులో బెస్ట్‌గా వున్న కార్డ్‌ని నేనూ, మా ఫ్రెండు రాఘవా కలిసి ఎంపి కచేసి, దాన్నే వేయిస్తాను" అన్నాడు మాధ వరావు.

ఆ మర్నాడు తన స్నేహితుడు రాఘవ ఇంటికి వెళ్లి తను చూసిన చాలా సంబం ధాల్నించి ఓ నాలుగు సంబంధాల్ని సెమీ ఫైనల్స్‌కి తీసుకొచ్చానని చెప్పి ఓ నలు గురు అమ్మాయిల ఫొటోలు చూపించాడు.

"ఈ నాలుగింట్లో నువ్వు ఏ ఫొటోని ఓకే చేస్తే దాన్నే ఫైనలైజ్ చేసేస్తాను" అన్నాడు.

"ఫైనలైజ్ చెయ్యాల్సింది నువ్వో నేనూ కాదు.. మీ భానూగాడే! ఔనూ.. వాడు నాలుగు నెలల ట్రైనింగ్ అంటూ విజయ వాడ వెళ్లాడు. ఆర్నెల్లు దాటినా ఇంకా రా లేదేం?" అడిగాడు రాఘవ.

"ఏమో! వాడి ట్రైనింగ్ పీరియడ్‌ని పొడి గించి వుండొచ్చు. మరో విషయం! గురు చరణ్‌గారనే ఓ బ్యాంక్ ఆఫీసరు తన కూ తుర్ని మావాడికిచ్చి పెళ్లిచేసే ఉద్దేశంలో వున్నాడని ఓ ఫ్రెండు చెప్పాడు. సరే, రేపొచ్చి మాట్లాడమని నేను కబురు చేసాను. రేపు నువ్వో హాఫ్‌డే లీవ్ పెట్టి మా ఇంటికిరా? నా తరపున మాట్లాడ్డా నికి నువ్వు తప్ప మరెవరున్నారు?" అన్నాడు మాధవరావు.

మర్నాడు ఉదయం మాధవరావు ఉంటున్న అపార్ట్‌మెంట్‌కి, ఓ ఆడపిల్ల వారు వచ్చి పెళ్లి విషయం మాట్లాడుతు న్నారు. "మీరు కట్నం విషయంలోనూ, మేం పెట్టబోయే బంగారం విషయం లోనూ నిర్ణయం మాకే వదిలేసారు. బాగానే ఉంది. కానీ ఇదేమాటని మీ అబ్బాయి కూడా 'సరే' అనేస్తే మేం మిగతా విషయాలు చూస్కుంటాం కదా!" అంది అమ్మాయి తల్లి.

మాధవరావు చిన్నగా నవ్వాడు.

"ఆడపిల్ల తల్లిగా మీరు అలా అనడం న్యాయంగానే ఉంది. మా ఇంటికి మూడు గదులు, ఆరు కిటికీలూ ఉండొచ్చు. కానీ, మా ఇంట్లో రెండు అభిప్రాయాలు మాత్రం ఉండవండి. ఎందుకంటే, మా అబ్బాయికి నేనే తల్లీ తండ్రీ అయి పెంచాను. నా రక్తం మీద, నా పెంపకం

మీద నమ్మకం ఉంది"

ఈ మాటలు పూర్తవకుండగానే గయ్ మంటూ కాలింగ్‌బెల్ మోగింది. అందరూ అటు చూసారు. తలుపు తీసేవుంది. గుమ్మం బయట భానుమూర్తి, అతని పక్కనే రేఖ అనే అమ్మాయి నిలబడి వుంది. మెడలో పెళ్లిదండలు, నుదుట కల్యాణ తిలకం.. వాళ్లు నూతన దంపతులని ఆ అలంకరణే తెలియజేస్తోంది. రేఖ పక్కనే స్లీవ్‌లెస్ బ్లౌజ్ వేసుకుని ఆమె తల్లి మనోరమ చూయింగ్‌గమ్ నములుతూ నిలబడి ఉంది. ఇంట్లో వున్నవారికి ఏం జరిగిందో అర్థమైపోయింది. ఆ అపార్ట్‌మెంట్స్‌లో వున్న కొంతమంది వరండాలో కొచ్చి ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆడపిల్ల వారు మాధవరావువైపు ఆగ్రహంగా కాకుండా, జాలిగా చూసి బైటకి వెళ్లిపోతే, గుమ్మం బయట వున్నవాళ్లు లోపలికి వచ్చారు. 'మేం అనుకోని పరిస్థితుల్లో మీకు తెలీకుండా యీ తప్పు చేసాం' అనే అపరాధ భావన వారిలో ఎవరి ముఖంలోనూ కనబడ్డం లేదు.

"కొత్త దంపతులకి హారతిచ్చే దిక్కు కూడా ఈ కొంపలో తగలబ్లేదా? " మనోరమ గొంతులో మందలింపుతో కూడిన పెత్తనం వినిపించింది.

స్తబ్ధుడై నిలబడిపోయిన మాధవరావు కంటికి అతని కలలపూదోట కాలిపోతూ కనిపించింది. అనూహ్యమైన యీ సంఘటనకి అతను అక్షరాలా 'అవాక్కై' ఉండిపోయాడు.

అతని స్నేహితుడు రాఘవ మాత్రం భానూమీద కోపం ప్రదర్శిస్తూ "ఇదేంట్రా భానూ.. మీనాన్న ఆశలన్నీ నీమీదే పెట్టుకుని బతుకుతున్నాడు. నీ భవిష్యత్తు గురించే కలలు కంటున్నాడు. అలాంటప్పుడు నువ్విలా చెయ్యడం ఏమాత్రం బాగాలేదు" అన్నాడు.

మనోరమ ఆవేశంతో రెచ్చిపోయి మాట్లాడింది.

"ఏయ్ మిస్టర్! మీరెవరో, మీకూ ఈ ఇంటికీ వున్న సంబంధమేంటో నాకు తెలీదు. బట్ హియర్ మీ! మాది రాయల్ ఫ్యామిలీ. మావాళ్లంతా వ్యసనాలకోసం, దానాలకోసం తగలెట్టగా మిగిలింది వందకోట్లు. అది ప్రస్తుతం కోర్టు తగువుల్లో ఉంది. త్వరలో నాచేతికొస్తుంది. నా ఏకైక కుమార్తెను పెళ్లి చేస్కోడానికి కోటీశ్వరులయిన వ్యాపారస్థులు, సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు, డాక్టర్లు ఎగబడుతున్నారు. ఈ భానుమూర్తి డర్టీస్కౌండ్రల్ గాడు ఏం ట్రైనింగ్ అవడానికి విజయవాడ వచ్చాడోగానీ, మా లాయరు ద్వారా మా ఆస్తి వివరాలు తెలుసుకుని, మా అమ్మాయికి వల విసిరాడు. గర్భవతిని చేసాడు. మీవాణ్ణి చెప్పు తీసుకుని కొట్టాను. అయినా గర్భం విషయం పదిమందికీ తెలిస్తే, పోయేది నా పరువే కదా? అందుకే రహస్యంగా ఓ గుళ్లో పెళ్లిచేసి, వీళ్లతోపాటు నేనూ ఈ వూరికి వచ్చేసాను. ఇప్పుడు చెప్పండి! ఈ భానూగాడు చేసిన దుర్మార్గం వల్ల లాభపడిందెవరు? నష్టపోయిందెవరు? అదృష్టం ఎవర్ని వరించింది? దరిద్రం ఎవరినెత్తి కెక్కింది? నేను మీ లెవల్‌కి వెయ్యిమెట్లు దిగివచ్చానా? లేక మీవాడే మా అంతఃపురం మీదకి ఎగబాకి మమ్మల్నీ బురద గుంటలోకి తోసేసాడా? అంచేత మీరంతా నోర్మూస్కోవడం మంచిది"

జరిగిన విషయం చెప్పడంతో పాటు ముమ్ముందు మాధవరావు తనమాటకి అడ్డం తగలకూడదన్నట్టుగా వార్నింగ్ ఇచ్చింది. తనకొడుకుని ఎప్పుడైతే విజయవాడలో చెప్పుతో కొట్టి ఇక్కడికొచ్చి 'స్కౌండ్రల్' అని తిట్టిందో అప్పుడే ఆవిడ ఆజ్ఞాపించే యజమానురాలి స్థానానికి ఎది

గిపోయింది. ఎప్పుడైతే ఆవిడా విషయాల్ని బాహాటంగా చెప్పినా భానుమూర్తి కిక్కురు మనకుండా వూరుకున్నాడో అప్పుడే అతను బానిసగా మారిపోయాడు. తల్లీకూతుళ్ల చేతిలో అప్పుడే అతను కీలుబొమ్మగా మిగిలిపోయాడు. ఈ విషయం మాధవరావుకి అర్థంకావడానికి ఎంతోకాలం పట్టలేదు. ఆ విషయం అర్థమయ్యాక అతను ఆవేదన అణచుకోలేక ఓ మాటన్నాడు.

"మునుపు కనీ పెంచిన పిల్లలకి పెళ్లిళ్లు చేయడం తల్లిదండ్రులకి బాధ్యతల జాబితాలో వుండేది. కానీ ఇప్పుడది అదృష్టాల జాబితాలోకి జారిపోయింది. ఓ రోజు సడన్‌గా కన్నకొడుకు ఓ అమ్మాయిని తీసుకొచ్చి తల్లిదండ్రుల ఎదుట నిలబెట్టి.. 'ఇదిగో నాన్నా మీ కోడలు' అని పరిచయం చేస్తే ఆమోదించక తప్పని స్థితిలో తల్లిదండ్రులున్నారు"

ఈ మాటవిని మనోరమ దీన్ని తనకి అన్వయించుకుంటూ "బాగా చెప్పారు. మా అమ్మాయి ఓ సాదాసీదా గుమస్తా కొడుకుని తీసుకొచ్చి ఇతనే మీ అల్లుడని చెప్పినప్పుడు నేనూ ఇలాగే బాధపడ్డాను" అంది.

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి కోర్టు కేసు వున్నప్పుడు భానుమూర్తి విజయవాడ వెళ్లి లాయర్‌కి డబ్బులిస్తున్నాడు. కేసు ఫలానా రోజుకి వాయిదా పడిందనే వార్త మాత్రం మోసుకొచ్చి అత్తగారికి వినిపిస్తున్నాడు. తర్వాత మాధవరావుకి తెలిసొచ్చిన వాస్తవం ఏంటంటే వినేవాడు వెర్రివెధవ యితే చెప్పేవాడు వివేకానందుడంతటి మహాజ్ఞానిలా పోజు కొడతాడన్నట్టు మనోరమ మొదట చెప్పినట్టూ వాళ్లది రాయల్ ఫ్యామిలీ కాదు. కోర్టులో వున్న కేసు కూడా వందకోట్ల గురించి కాదు, కేవలం పదికోట్ల గురించే. అది ఎప్పుడు ఎవరివైపు తీర్పుకొస్తుందో తెలీదుగానీ వాయిదా వాయిదాకీ భానుమూర్తే లాయరుకి ఫీజు

## చేప.. ఉంగరం!

ఫెయిత్ పీటర్‌సన్ 1972లో తన భర్త కెవిన్‌తో కలిసి అడిరోనేడా అనే చోటికి హనీమూన్‌కి వెళ్లింది. పక్కనే ఉన్న మానవనిర్మితమైన సరస్సులో బోటింగ్ చేస్తూండగా ఆమె తన చేతిని చల్లటి నీళ్లలో ఉంచి సరదాకి నీటిని కొట్టసాగింది. కొద్దిసేపటికి తన వేలికి ఉన్న ఎంగేజ్‌మెంట్ రింగ్ మాయమవడం గుర్తించి ఆ సంగతి భర్తకి చెప్పింది.




కెవిన్ కొన్ని గంటల పాటు ప్రశాంతంగా ఉన్న ఆట్టే లోతు లేని ఆ నీటి అడుగుభాగానికి వెళ్లి ఉంగరం కోసం వెతికాడు. నీరు ప్రవహించకుండా, స్థిరంగా ఉండడంతో అది కొట్టుకుపోయి ఉండదన్న నమ్మకం అతనిది. కానీ



అది దొరకలేదు.

"నీకు ఇంకో ఉంగరం కొనిస్తాను" కెవిన్ తన భార్యకి చెప్పాడు.

"కానీ నువ్వు నన్ను పెళ్లి చేసుకోమని ప్రపోజ్ చేసినపుడు ఇచ్చిన ఉంగరం అది. నాకు ఇంకొకటి వద్దు" ఆమె నిరాకరించింది.

ఇరవై ఏళ్ల తర్వాత 1992లో ఫెయిత్ కెవిన్ తమ టీనేజ్ పిల్లలతో అడిరోనేడాకి ఎప్పటిలా సెలవులకి వెళ్లారు. పిల్లలు ఎక్కువ సమయం ఆ సరస్సు దగ్గరే గడపడానికి ఇష్టపడతారు కాబట్టి వెంటనే అక్కడకి వెళ్లిపోయారు. ఆ రాత్రి ఫెయిత్ వంట చేస్తూ పిల్లలు ఆ సరస్సులో పట్టిన ట్రౌట్ చేపని కోస్తే ఇరవై ఏళ్ల క్రితం నీళ్లలో పడిపోయిన ఆమె ఉంగరం కనిపించింది.

## చతుర ప్రవేశిక

### నవంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపిక చేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. అమ్మాయిలా శోభ ఇంటికి వచ్చింది?
జ.
2. జితేంద్ర ప్రేమించిన అమ్మాయి?
జ.
3. రేఖ తల్లి ఎవరు?
జ.
4. మాధవరావు కొడుకు పేరు?
జ.
5. ఇతరుల మాటల్ని చాటుగా వినేది?
జ.
6. భానుమూర్తి ఢిల్లీ స్నేహితుడు?
జ.
7. ఈ ఏడాది బుకర్ విజేత?
8. 'టు ది లైట్ హౌస్' రచయిత్రి?
జ.
9. నాటి కృష్ణా పత్రిక సంపాదకులు?
జ.
10. 'కృష్ణాతీరం' నవల ఎవరి రచన?

---

పంపినవారి పేరు: ----------------

----------------వయసు (   )

చిరునామా: ----------------

----------------

----------------

పిన్‌కోడ్:            ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

**విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.**

లిచ్చుకుంటూ వస్తున్నాడు.

ఓ రోజు మాధవరావు తన మిత్రుడు రాఘవతో సముద్రపుటొడ్డున నడుస్తూ పరమ సంతోషంగా తనకొడుక్కి వచ్చిన గవర్నమెంట్ ఉద్యోగం ఇంటర్వ్యూ గురించి చెప్పాడు. రాతపరీక్షలో ఉత్తీర్ణుడయ్యాక భానుమూర్తి ఆరోజు ఇంటర్వ్యూకి వెళ్లాడు. ఆ విషయం గురించి మిత్రులిద్దరూ కొంతసేపు మాట్లాడుకున్నారు.

ఓ వారం తిరక్కముందే భానుమూర్తిని గవర్నమెంట్ ఆఫీసరుగా అపాయింట్ చేస్తున్నట్టు ఆర్డర్స్ వచ్చాయి. అంతకు ముందు రోజు రేఖ ఓ ప్రైవేట్ ఆసుపత్రిలో మగబిడ్డని ప్రసవించింది. శుభం మీద శుభం జరుగుతోంది కాబట్టి జీవిత మంతా నిత్యకళ్యాణం పచ్చతోరణంలాగే కళకళలాడిపోతుందన్న ఆనందంలో భానుమూర్తి, రేఖ, మనోరమవున్నారు. తన కొడుకుని గవర్నమెంట్ ఆఫీసరుగా చూడాలని మాధవరావు ఆశించాడు. అతని ఆశయం నెరవేరింది. మనవడితో కలిసి ఆడుకోవాలి. ఆ సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

★ ★ ★

మాధవరావు తను పనిచేసే ఆఫీసులో అందరి దగ్గరికీ స్వయంగా వెళ్లిమరీ తనకొడుక్కి క్లాస్‌వన్ గవర్నమెంట్ ఆఫీసరుగా ఉద్యోగం వచ్చిందని చెప్తున్నాడు.

"గమ్మత్తేమిటంటే గురూ! ప్రస్తుతం దేశమంతటా అవినీతి పేరుకుపోయిందంటున్నారు. లంచాలు యిస్తే తప్ప ఏ పనీ జరగడం లేదంటున్నారు. రికమెండేషన్ లేనిదే ఏ పెద్ద ఉద్యోగమూ రాదంటున్నారు.

కానీ మావాడికి ఎవరి రికమెండేషనూ లేకుండా, ఒక్కరూపాయి ఇవ్వకుండా ఉద్యోగం వచ్చేసింది. ప్యూర్‌మెరిట్ మీద వచ్చేసింది" అంటూ ప్రతివ్యక్తి దగ్గరా తన కన్నతండ్రి హృదయాన్ని ఆవిష్కరిస్తు

న్నాడు.

"ఇంత మంచివార్తని ఇలా సింపుల్‌గా చెప్పెయ్యడం ఏం బాగాలేదు మాధవరావ్! ఈ రోజుల్లో స్టేట్ గవర్నమెంట్‌లో ప్యూన్, గుమాస్తా ఉద్యోగాల్నే వేలకి వేలు లంచాలు పోసి కొంటున్నారన్న విషయం ఓపెన్ సీక్రెట్ అయిపోయింది. అలాంటిది నీకొడుకు చూస్తే ఏకంగా గవర్నమెంట్ ఆఫీసరు పోస్టు కొట్టేసాడు. అంటే మీ ఇంటి పెరట్లో కామధేనువుని కట్టేసి, ఇంటి ముంగిట కల్పవృక్షాన్ని నిలబెట్టినట్టే! అంచేత సాయంకాలం అజంతా బార్ అండ్ రెస్టారెంట్‌లో పార్టీ ఇవ్వాల్సిందే " అన్నారు.

మాధవరావు ఎంతమాత్రం వెనకాడకుండా సరేనన్నాడు.

ఆ రాత్రి అజంతా బార్ అండ్ రెస్టారెంట్‌లో మాధవరావు తన సెక్షన్‌లో పని చేసే ఎనిమిది మందికి కాక్‌టైల్ పార్టీ ఇచ్చాడు. పార్టీలో అతను తాగకుండా కూల్ డ్రింక్ మాత్రం తాగుతూ వాళ్లకి కంపెనీ యిస్తున్నాడు. ఓ పెగ్గుదాటి రెండో పెగ్గులోకి వెళ్తుండగా అందరూ మాధవరావుకి సలహాలు ఇవ్వడం ప్రారంభించారు.

"జీవితమంటేనే కష్టసుఖాల కలబోతం టారు. కానీ మాకు తెలిసినంత వరకు మీ జీవితంలో కష్టాలే తప్ప సుఖాలు ఏ దశలోనూ కనబడలేదు. అంచేత యికమీదటైనా సుఖపడండి సార్" ఒక నడివయస్కుడు సలహా యిచ్చాడు.

"కొన్ని సుఖాల్ని అనుభవించడానికి యవ్వనమే సరైన వయసు. కానీ ఆ వయసులో మీరు మీ జీవితాన్ని కొడుకు పెంపకానికి అంకితం చేసేసారు. అఫ్‌కోర్స్, మీ అంకితభావం వృథా పోలేదనుకోండి. మీ అబ్బాయి గవర్నమెంట్ ఆఫీసరయ్యాడు"

చెప్తున్న వ్యక్తికి అడ్డం తగుల్తూ మాధవరావు అన్నాడు "మావాడు గవర్నమెంట్ ఆఫీసరూ, గవర్నమెంట్ ఆఫీసరూ అని ఊరికే అనెయ్యకండి. లక్షలకి లక్షలు లంచంయిస్తే ఏ 'పుస్కీ'గాడికైనా ఆఫీసరు పోస్ట్ వస్తుంది. ఓ మినిస్టరుతో రికమెండ్ చేయిస్తే ప్రతీ కౌన్‌కిస్కా గాడికీ ఉద్యోగం వస్తుంది. కానీ మావాడు గంజాయివనంలో మొలిచిన తులసిమొక్క. కేవలం వాడి మెరిట్‌ని బట్టే జాబ్ వచ్చిందని కూడా మాటల్లో కలుపుకుంటే బావుంటుంది గదా!"

ఆ తర్వాత పార్టీ పూర్తయ్యేవరకు అందరూ సలహాలనిస్తూనే ఉన్నారు. మనుషులు తేడా కావచ్చు మాటలు తేడా కావచ్చు కానీ ఆ మాటల తాత్పర్యం మాత్రం ఒక్కటే. "కాలం ఎవరికోసమూ ఆగదండి.. ముందుముందు మన సైంటిస్టులు మృత్యువు రాకుండా మందులు కని పెట్టగలరేమోగానీ.. కాలచక్రం ముందుకు పరుగెత్తకుండా మాత్రం ఆపలేరు. అన్ని బాధ్యతలూ అయిపోయాక సుఖపడదామని కొంతమందనుకుంటారు" ఎవరో ఒకతను చెబుతుంటే, సాగర్ అనే ఉద్యోగి ఆ మాటల్ని ఆపి, తన మాటల్ని చెప్పాడు "మీరు చెప్పింది సెంట్ పర్సెంట్ కరెక్టండి. మీ అందరికీ సంజయ్‌కుమార్ అనే ఇండస్ట్రియలిస్ట్ తెలుసు కదా! ఆడిటర్ లెక్కగట్టి చెప్తే తప్ప ఎంత ఆస్తి ఉందో అతనికే తెలియదట. అతను ఈ ఊరికి కట్టుబట్టల్తో వచ్చాడట. నానాగడ్డీ కరచి కోటాను కోట్లు సంపాదించాడట. మొన్నామధ్య ఆయన బంగళాకెళ్లాను. ఆ రోజు ఆయన ఏ మూడ్‌లో వున్నాడో గానీ తనకి సంబంధించిన విషయాలన్నీ చెప్పేసాడు. తను అనుకున్నంత ఆస్తిని సంపాదించేవరకు ఒక్కరూపాయి కూడా ఖర్చుపెట్టి సుఖ పడకూడదనుకున్నాడట. ఇప్పుడాయన వయసు అరవై సంవత్సరాలట. జాతకం ప్రకారం ఆయన ఎనభైయేళ్ల

## కొంటె ఎడిటర్!

ముట్నూరివారు చూసేందుకు గంభీరంగా కనిపించినా చాలా సరదాగా ఉండేవారు. అప్పుడప్పుడు తమవద్దకు వచ్చేవారికి కొంటె పేర్లు పెట్టి నవ్విస్తూ వుండేవారు. కృష్ణాప



త్రిక కార్యాలయానికి దశిక సాంబశివరావు అనే ఒకాయన తరచుగా వస్తుండేవారు. ఆయన చాలా బక్కగా ఉండేవారు. వచ్చిన ప్రతిసారీ కూరగాయలను ఒక కర్చీఫ్‌లో జాగ్రత్తగా మూట కట్టుకుని, దానికి ఒక ములక్కాడను గుచ్చుకుని తెచ్చేవారు.

అది చూసి కృష్ణారావుగారు ఆయనకు 'ములక్కాయ పహిల్వాన్' అనే పేరు పెట్టారు.

బతుకుతాడట. కానీ, సుఖమేం ఉంది? ఇప్పుడు కూర్చుంటే లేవలేడు, లేస్తే కూర్చో లేడు. తింటే అరగదు, తాగితే యిమడదు, లక్షలు ఖరీదుచేసే బంగారపు మంచం చేయించాడు. కానీ ఆయన మంచంమీద పడుకోకుండా నేలమీద పడుకోవాలని డాక్టర్లు చెప్పారట. అలాంటివాడు అన్ని వేల కోట్లు సంపాదించే ప్రయోజనం చెప్పండి? డబ్బు సంపాదించడానికి నానా గడ్డీ కరిచాడు. కోట్లకి కోట్లు సంపాదించా క్కూడా డాక్టరు సలహా మీద గడ్డిలాంటి ఫుడ్డే తింటున్నాడు"

ఆ మాటలన్నీ అయ్యేసరికి పార్టీ ముగి సింది. ఆఖరుగా మాధవరావు సంతృప్తితో కూడిన సంతోషాన్ని వ్యక్తం చేస్తూ అన్నాడు "మీరందరూ నేను సుఖపడాలనే చెప్పారు. నిజం చెప్పాలంటే ఇకమీదట నేనేం చెయ్యాలనుకుంటున్నానో మీరు అదే చెప్పారు. అన్ని బాధ్యతలూ నెరవేర్చాక సుఖపడాలంటే సముద్రంలోని కెరటాలు ఆగాక స్నానం చేద్దామనుకున్నట్టేవుంటుం ది. ఆ సంజయ్‌కుమార్ డబ్బు సంపాదిం చాక, సుఖపడదామని అనుకునేసరికి ఆరోగ్యం సహకరించడం లేదు. కళ్లుపో యాక సూర్య నమస్కారాలు చేయడం వల్ల ప్రయోజనం లేదంటారు గదా? నేన లాంటి మూర్ఖుణ్ణికాదు. మనిషి జీవితంలో అంటే మగాడి జీవితంలో యవ్వనం పద మూడు భాగాల రొమాంటిక్ సీరియల్ లాంటిది, బాగుంది బాగుంది.. చాలా చాలా బాగుంది.. అనుకునేలోగా ఆ సీరి యల్‌కి శుభం కార్డు పడిపోతుంది. ఇదెం దుకు చెప్పానంటే నా జీవితంలోని యవ్వనం ఇంకా పదకొండో ఎపిసోడ్‌లోనే ఉంది. అంచేత నేను ఉద్యోగంనించి వా లంటరీ రిటైర్మెంట్ తీసుకుని, మిగిలిన జీవితాన్ని నా ఇష్టానుసారంగా సుఖపడ్డా నికే నిర్ణయించుకున్నాను"

ఆ మాటతో ఆ పార్టీ ముగింపుకొచ్చే సింది.

మాధవరావు ఉద్యోగంనించి వాలంటరీ రిటైర్మెంట్ తీస్కోవడానికి అప్లికేషన్ పె ట్టాడు. అది గ్రాంట్ కావడానికి కొంత కాలం పడుతుంది.

ఓ రోజు ఉదయం మాధవరావు ఆఫీసు కొచ్చి తన రూమ్‌దగ్గరికి వెళ్తుంటే అటెం డర్ సిద్ధప్ప వరండాలో వెళ్లడం కనిపించి అతన్ని పిలిచాడు.

"గుడ్‌మార్నింగ్ సార్" అన్నాడు సిద్ధప్ప ఆనందంగా.

"మీ అమ్మాయి పెళ్లికి నువ్వింకా శుభలే ఖలు వేయించలేదటగా. నేను సేకరించిన ఓ ఎనభై బెస్ట్ కార్డులు ఈ కవర్‌లో

ఉన్నాయి. ఇందులో నీకు బెస్ట్‌గా ఉందని పించిన కార్డు సెలక్ట్ చేసి ప్రింట్ చే యించు. మనబోటివాళ్ళం ఎలాగూ ఆడపి ల్లకి ఘనంగా చీరె, సారెపెట్టి పంపలేం. కనీసం వాళ్ళ పెళ్లికార్డు ఘనంగా అయినా వేయిస్తే జీవితాంతం దాచుకుంటారు" అన్చెప్పి, న్యూస్‌పేపరుతో చుట్టిన శుభలే ఖల్ని అందించాడు.

సిద్ధప్ప థాంక్స్ చెప్పి ఆ ప్యాకెట్ పట్టు కుని వెళ్లిపోయాడు.

మాధవరావు తను కష్టపడి సేకరించిన శుభలేఖలు తనకు ఉపయోగపడకపో యినా అటెండరు కూతురు పెళ్లికయినా ఉపయోగపడుతున్నందుకు సంతోషిస్తూ తన సీటు దగ్గరకి వచ్చి డ్రాయరు తాళాల కోసం జేబులు తడుముకున్నాడు. కానీ, తాళాలు కనబడలేదు, తన ఇంట్లో మర్చి పోయిన విషయం గుర్తొచ్చి తన మీద తనే చిరాకుపడుతూ ఇంటికి బయలుదే రాడు. అపార్ట్‌మెంట్స్ కాంపౌండ్‌లో తన బైక్ దిగి మెట్లెక్కి తన ఫ్లాట్ వైపు వెళ్తుంటే అక్కడే తచ్చాడుతున్న జోగినాథం అతన్ని చూసి "ఏంటండీ.. ఆఫీసునించి రిటన్ అయిపోయారు? " అని పలకరించాడు

జోగినాథం ఆ ఫ్లాట్స్‌లో ఉండే మను షుల్లో అదోరకం విచిత్ర మానవుడు. అత ని వయసు నలభై నుంచి నలభై ఐదు మ ధ్యన ఉంటుంది. భార్య ఏదో ప్రైవేట్ హాస్పటల్లో నర్స్‌గా పనిచేస్తోంది. ఆవిడకి వంటచేసి, క్యారేజీ కట్టేసి, హాస్పటల్‌కి పంపేసిన తర్వాత జోగినాథం చెయ్యడా నికేం పనివుండదు. అంచేత మిగతా ఫ్లాట్స్ తలుపుల దగ్గర నిలబడి లోపల జరిగే మాటలన్నీ వినడం అతనికో హాబీ! మాధవరావు ఫ్లాట్ దగ్గరే ఎక్కువగా తచ్చాడుతూ, తలుపు బైట నిలబడి అన్ని మాటలూ వింటాడు. విని వూరుకోకుండా మాధవరావు బైటకి రాగానే "మీరూ, మీవాళ్లు ఏదో గొడవ పడుతున్నట్టుందే? " అంటూ ఏమీ తెలీనట్టుగా అడుగుతాడు.

మాధవరావు ఆ అపార్ట్‌మెంట్స్‌కి ప్రెసి డెంటు కావడం వలన మాత్రమే ఆ ఇంటి తలుపుని తన అడ్డాగా మార్చుకున్నాడు జోగినాథం. ఆ రోజు మాధవరావు తన ఫ్లాట్‌లోకి వెళ్లేసరికి కనబడిన దృశ్యం అతన్ని నిశ్చేష్టుణ్ణి చేసింది.

హాలులో మనోరమ, రేఖ, ఫ్లాట్‌లో ఉండే మరికొంత మంది ఆడవాళ్లు ఓ టే బుల్ చుట్టూ కుర్చీలు వేసుకుని పేకాట ఆడుతున్నారు. టేబుల్‌మీద కరెన్సీ నోట్లు, కాఫీ కప్పులు కనిపించాయి. ఆ దృశ్యం చూస్తూనే మాధవరావు ఆవేశంతో కంపిం చాడు. ఆయనకి ఇతర వ్యసనాలకంటే పేకాటంటేనే పరమ అసహ్యం. సంసార పక్షమయిన ఆడవాళ్లు ఉదయాన్నే స్నానా దికాలు పూర్తిచేసుకుని పూజపునస్కారాలు జరిపితే శుభకరంగా ఉంటుంది. గృహలక్ష్మి అయిన ఇల్లాలు ఇంటిపని, వంటపని చేసుకుంటే శోభస్కరంగా ఉంటుంది. ఆడదాని చేతిలో వీణో, పుస్త కమో ఉంటే సరస్వతిలా కనిపిస్తుందిగానీ, నట్టింట పేకాటలాడితే ఇంటికి పట్టిన పిశా చంలా ఉంటుంది. ఇవన్నీ అతని అభిప్రా యాలు.

"ఇలాంటి దిక్కుమాలిన పనులు నా ఇంట జరగడానికి వీల్లేదు" అన్నాడు, తనని తాను తమాయించుకోవడానికి ప్రయత్నిస్తూ.

ఆడ్డానికి కూర్చున్న ఆడవాళ్లు బిక్కచచ్చి పోయి బైటకి వెళ్లడానికి సిద్ధపడ్డారు. కానీ మనోరమ వాళ్లతో మరింత హుందాత నాన్ని ప్రదర్శిస్తూ మాట్లాడింది.

"మిమ్మల్ని పిలిచింది నేను. ఈ ఇల్లు మా అల్లుడిది, అంటే మా అమ్మాయిది. వాళ్లిద్దరూ నాకు రెండుకళ్లు కాబట్టి ఒక వి ధంగా చెప్పాలంటే ఈ ఇల్లు నాది!

అంచేత మిమ్మల్ని పిలవడమైనా, పంపడమైనా చెయ్యాల్సింది నేను. పరాయివాళ్ల కిందులో ప్రవేశం లేదు. కూర్చోండి"

ఆడవాళ్లంతా కూర్చున్నారు.

"నా ఇంట్లో తిష్టవేసి, నా ఇంటిని పేకాట క్లబ్‌గా మార్చింది చాలక, నా ఇంట్లో నన్నే పరాయివాడిగా మార్చేస్తారా? నేనీ అపార్ట్‌మెంట్స్‌కి ప్రెసిడెంటుని. ఫ్లాట్స్‌లోని ఆడవాళ్ల ముందు నా ఇంట్లో నాకింత అవమానం చేసినందుకు సాయంత్రం మా అబ్బాయి రాగానే ఈ ఇంట్లో ఎవరి హక్కు ఎంతో తేల్చేస్తాను. అంతకంటే ముందు నట్టింట ఈ పేకాట లేంట్రా? అని వాణ్ణి అడిగి, వాడిచేతే మీకు వార్నింగ్ ఇప్పిస్తాను"

ఓ గది తలుపులు తెరుచుకుని భానుమూర్తి బైటికి వచ్చాడు. అంతవరకు కొడుకు ఆఫీసుకి వెళ్ళాడనే అనుకుంటున్న మాధవరావు, అతను ఇంట్లోనే ఉండడం చూసి ముందు కొంచెం ఆశ్చర్యపోయాడు. వెంటనే తన ఆవేశాన్ని కొనసాగిస్తూ కుటుంబం విషయంలో తను ఆశిస్తున్న పద్ధతుల్ని, మనోరమ అనుసరిస్తున్న పద్ధతుల్ని వివరించాడు.

"నువ్వు గట్టిగా చెప్పి ఇక మీదట ఇలాంటివి జరక్కుండా చూడు" అన్నాడు.

భానుమూర్తి ఆ మాటలన్నీ సీరియస్‌గా విని, ఆ తర్వాత టేబుల్ దగ్గరికొచ్చి కూర్చుని, "నాకూ ముక్కలు వెయ్యండి ఆంటీ" అన్నాడు.

అంతే! మాధవరావు పెత్తనం రబ్బరు బుడగలా పేలిపోయింది.

గబగబా తన గదిలోకి వెళ్లి ఆఫీసు తాళాలు తీసుకుని ఫ్లాట్‌నించి బైటకొచ్చి ముందుకి వెళ్ళబోయాడు.

అంతవరకు తలుపు దగ్గర నిలబడి వింటున్న జోగినాథం తనకు మాత్రమే సొంతమయిన వెకిలి నవ్వు నవ్వుతూ అడిగాడు "ఇహ్హిహ్హీ! ఏంటీ.. మీరూ మీ వియ్యపురాలూ గొడవపడుతున్నట్టుందే? " అన్నాడు.

అతన్ని లాగి కొడదామన్నంత కోపం వచ్చినా తమాయించుకుని ఇంట్లో దెబ్బతిన్న వ్యక్తిత్వానికి ఇక్కడ కొత్త అందాలు పొదుగుతూ, తనూ ఓ నవ్వుని అరువు తెచ్చుకుని జవాబిచ్చాడు. "నీకు సరిగా వినిపించినట్టులేదు. మేమేం గొడవ పడ్డం లేదు. 'సరదాగా మాతోపాటు మీరూ ఓ నాలుగు ఆటలాడండి అన్నయ్యగారూ!' అంది మా వియ్యపురాలు. 'నాకెక్కడ తీరికుందమ్మా.. మరోసారెప్పుడైనా ఆడతాన్లెండి' అని బయటకి వచ్చేసాను" అంటూ గబగబా మెట్లుదిగి వెళ్లిపోయాడు.

అతను తన పరిస్థితిని కవర్ చేసుకునే ప్రయత్నాన్ని చూసి చిన్నగా నవ్వుకున్నాడు జోగినాథం.

★ ★ ★

ఓ రోజు మాధవరావు భోజనానికి కూర్చునివుంటే "మీ అబ్బాయిగారు గవర్నమెంట్ ఆఫీసురు అయిన దగ్గర్నించీ మీరు మీ జీతాన్ని ఇంటికివ్వడం మానేసారని మీ అబ్బాయిగారు నన్ను అడుగుతున్నారు" అంది కోడలు.

మరో కుర్చీలో మనోరమ కూర్చుంది. భానుమూర్తి తన గదిగుమ్మం ముందు నిలబడ్డాడు.

మాధవరావు చాలా జాలీగా, కులాసాగా జవాబు చెప్పాడు- "పిల్ల పక్షికి రెక్కల్లో సత్తువ వచ్చేవరకే తల్లి పక్షి పోషిస్తుంది. పిల్ల పక్షికి స్వతంత్రంగా ఎగరగల శక్తివచ్చాక అది తల్లి పక్షిమీద ఆధారపడదు"

మనోరమ తాను సిద్ధం చేసుకుని ఉంచిన మాటల్ని చెప్పింది "పక్షుల వరకైతే ఆ మాట కరెక్టే! కానీ మనం పక్షులం కాదుగా, మనుషులం. ఉద్యోగం చేసేవాళ్లకీ జీతంగట్రా వస్తాయి కదా? "

"వస్తాయి.. నా కొడుకు సంపాదనే మన ఫ్యామిలీకి ఎక్కీతొక్కీ అయినప్పుడు నా జీతం సాడేతీన్. ఆ జీతం ఇంటికి ఇస్తే ఎంత? ఇవ్వకపోతే ఎంత? ఇన్నేళ్లు నా జీతాన్ని నా కొడుకు కోసమే ఖర్చు చేసాను. ఇక మీదటైనా నా జీతాన్ని నా కోసం ఖర్చు పెట్టుకుంటూ నచ్చిన దారిలో నేను సుఖపడాలనుకుంటున్నాను" ఆ మాట చెప్పి అతను భోజనం ముగించిలేచి వెళ్లిపోయాడు.

అతని ధోరణి అందరికీ విచిత్రంగా కనిపించింది. 'మీ నాన్నలో చాలా మార్పు వచ్చిందే' అని మనోరమ మనసులో అనుకోబోయినా అప్రయత్నంగా బయటకే వచ్చేశాయి ఆ మాటలు.

అతను చెప్పిన మాటల గురించి ఆ ఇంట్లోని ముగ్గురూ తర్జనభర్జనలు సాగిస్తుండగా, రెండోరోజు ఇంట్లోకొచ్చిన మాధవరావుని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. అలా ఆశ్చర్యపోయిన వారిలో భాను, రేఖ, మనోరమ, పేకాట ఆడ్డానికి వచ్చిన మరో ముగ్గురాడవాళ్లు వున్నారు. మాధవరావు నెరిసిపోయిన తన జుత్తుకి, మీసాలకి నల్లరంగు వేయించాడు. కొత్త సఫారీ సూట్ ధరించి విజిల్ వేసుకుంటూ వచ్చి అక్కడే నిలబడి ఆడవాళ్లని చూసి కనుబొమలు ఎగరేసాడు. 'వీడేంటి.. ముసలాడికి దసరా పండగ లాగా.. ఇలా తయారయ్యాడు? వీడేమైనా దసరాబుల్లోడనుకుంటున్నాడా? పూలరంగడనుకుంటున్నాడా?' అని మనోరమ మనసులో రుసరుసలాడింది.

అతను జేబులో నించి ఓ సెంట్ బాటిల్ తీసి బట్టలమీద స్ప్రే చేసుకుని, ఆ సువాసనని ఆస్వాదిస్తూ అందరికీ ఓ ప్రకటనలా చెప్పాడు- "ఇందుమూలముగా సమస్త జనులకీ తెలియజేయునది ఏమనగా.. ఇప్పుడు నన్ను చూడగానే, మా మనోరమ మేడమ్‌గారు మనసులో సణుక్కున్న మాటలన్నీ కరెక్టు. ముసలాడికి దసరా పండగలా యీ షోకులేంటి? అంది. నిజమే! నాకు ఇకమీదట దసరా పండగే! నేనెప్పుడూ పూలరంగడిలాగే జీవిస్తాను. మొన్నెప్పుడో చెప్పిన విషయమే మళ్లీ గుర్తుచేస్తున్నాను. నేనికమీదట మా అబ్బాయి జీతం మీద బతుకుతూ, వాడి నెత్తిమీద ఓవర్ లగేజి కాదల్చుకోలేదు"

భానుమూర్తికి తన తండ్రి మీద ఎంత కోపం వచ్చినా, తమాయించుకుంటూ "నువ్వు నాకు ఓవర్ లగేజి అని నేనెప్పుడ

## అక్కడే ఖాళీ!

ఒకసారి కృష్ణాపత్రిక కార్యాలయానికి ఒకతను ఉద్యోగాన్వేషణలో భాగంగా వచ్చాడు. ముట్నూరివారికి నమస్కరించి, 'ఇక్కడ ఏదయినా ఖాళీ ఉందేమోనని వచ్చాను' అన్నాడు.

ముట్నూరివారు ఏమీ మాట్లాడకుండా తన తలపాగా తీసి పక్కన పెట్టి, నున్నగా ఉన్న తన బట్టతలను చూపించారు, ఇక్కడ తప్ప



ఇంకెక్కడా ఖాళీ లేదన్నట్లుగా.

అది చూసి ఆ వ్యక్తి నిర్ఘాంతపడి వెళ్లిపోయాడు.

అక్కడే ఉన్న రావూరు వెంకట సత్యనారాయణగారు 'ఏమిటలా చూపించారు?' అని అడిగారు.

దానికి ముట్నూరివారు 'లేకపోతే మీ నెత్తి కెక్కేవాడు' అన్నారు.

న్నాను? " అన్నాడు.

"నువ్వనలేదు. కానీ ఇక్కడున్న పాయిం టేటంటే.. ఏ తండ్రీ ఏ కొడుక్కీ ఓవర్ లగేజి అవడు. కానీ నెత్తిమీదకి కన్నతండ్రీ ఎక్కి, బెజవాడనించొచ్చిన అత్తగారూ ఎక్కితే, నీలాంటివాడికి డెఫినెట్‌గా కన్న తండ్రి ఓవర్ లగేజి అవుతాడు. ఎలాగూ, ఆ అత్తగారు కిందకి దిగరు. నువ్వు దింప లేవు. అంచేత కాస్తో, కూస్తో కామన్‌సె న్సున్న తండ్రిగా నేనయినా దిగిపోతే మంచిదికదా అనుకున్నాను. దట్సాల్!" అంటూ మళ్లీ విజిల్ వేస్తూ బైటికి వెళ్లిపో యాడు.

అతను ఒలకపోసిన సింగారాలు, చెప్పిన మాటలు, అవీ తనని వెటకారం చెయ్యడానికి, అవమానించినడానికేనని మనోరమ గ్రహించింది. మాధవరావులో ఏదో మార్పు వచ్చింది. రాయిలాగా నిశ్చ లంగా వుండేవాడు, రాలుగాయిలా ఇలా పెట్రేగిపోవడానికి గల కారణం ఏంటి?

ఈ ప్రశ్న కేవలం మనోరమది మాత్రమే కాదు. రేఖా, భానుమూర్తిల మనసుల్లో కూడా కదలాడి, కలవరపెట్టిన ప్రశ్న కూడా ఇదే! ఈ ప్రశ్నకి సమాధానం ఓవారం తర్వాత గానీ లభించదని ఆ దంపతులు ఊహించలేదు.

ఆ రోజు సాయంకాలం రేఖ, భాను మూర్తి తమబిడ్డ శంకూని మనోరమకి అప్పగించి 'బిగ్ బజార్'కి షాపింగ్‌కి వెళ్లారు. భాను, రేఖ అక్కడ తమకి కావ లసిన వస్తువుల్ని ఓ ట్రాలీలో వేసుకుంటూ ముందుకు నడుస్తూ ఉండగా రేఖ కింది అంతస్తులోకి చూసి, కరెంట్ షాక్ తగిలి నట్లు అదిరిపడి, భానూని మోచేత్తో పొడుస్తూ తనకి కనిపించిన దృశ్యాన్ని చూపించింది.

మాధవరావు పక్కనే మిస్ ఇండియాలా కనిపిస్తున్న ఓ వితంతువు కనిపించింది. ఇద్దరూ ఎంత సేపట్నించి షాపింగ్ చేస్తు న్నారో తెలీదుగానీ, వాళ్లు తోసుకొస్తున్న ట్రాలీలో చాలా సామాన్లున్నాయి. ఇద్దరూ మంచి అవగాహనవున్న స్నేహితుల్లా నవ్వుకుంటూ క్యాష్ కౌంటర్ దగ్గరికి వచ్చారు. అక్కడున్న సేల్స్‌మేన్ ఆ సా మాన్లని రెండు ప్లాస్టిక్ బ్యాగుల్లో వేసి, బయట వున్న ఆవిడ కారులో పెట్టించా డు. మాధవరావే బిల్లు చెల్లించి ఆమెతో పాటు బైటికి నడిచాడు.

మొదటి ఫ్లోర్‌నించి ఇదంతా చూస్తున్న భానూ, రేఖలు గబగబా మెట్లుదిగి కిందికి వచ్చి బైటికి వెళ్లారు.

బయటనున్న కారులో ఆవిడ డ్రైవింగ్ సీట్లో కూర్చుంది. మాధవరావు ఆవిడ పక్కసీట్లో కూర్చున్నాడు. కారు ముందుకు వెళ్లింది. తన కారులో మాధవరావుని తీసుకుపోతున్న ఆ నడివయసు నారీమణి పేరు.. రాధాబాయ్!

వెళ్తున్న కారు వైపు భానూ, రేఖ రెప్ప వెయ్యకుండా చూస్తూవుండిపోయారు!

★ ★ ★

బిగ్‌బజార్ నించి ఇంటికొచ్చాక రేఖ తనగదిలో కూర్చుని మాధవరావు గురించి సణుగుతూనే వుంది. ఆ సణుగుడు హాల్లో వున్న మనోరమకి వినబడకూడదని తలుపు గడియపెట్టేసాడు భానుమూర్తి.

"ఒంటిమీదకి వయసొచ్చెయ్యగానే సరి పోదు.. బుర్రలోకి బుద్ధి కూడా రావాలి. మనవణ్ణి ఎత్తుకుంటున్న వయసులో.. ఎవరో బజారుమనిషిని పట్టుకుని, పట్టప గలు బట్టబయలు షికార్లు తిరుగతాడా? మేం కాలక్షేపం కోసం ఇంట్లో పేకాట ఆడు తుంటేనే.. పెద్ద గొడవ చేసి లెక్చర్లిచ్చాడు. అలాంటి పెద్దమనిషి ఇలా జులాయి తిరు గుళ్లు తిరుగుతాడా? నాకు నచ్చిన దారిలో తిరుగుతానని ఇంట్లో దండోరా వేసి చెప్పి నప్పుడే యిలాంటి పోకిరీ తిరుగుళ్లు తిరు

# రైళ్ల సమాచారం!




★ ప్రపంచంలో అతిపెద్ద రైల్వే స్టేషన్ న్యూయార్క్‌లోని గ్రాండ్ సెంట్రల్ స్టేషన్.

★ లండన్, మాంచెస్టర్, ముంబయిలలోని రైల్వే స్టేషన్ల పూర్తి పేర్లన్నిటిలోనూ ఉమ్మడిగా ఉండే పేరు విక్టోరియా.



★ ప్రపంచంలోనే పొడవైన రైల్వే వంతెన అమెరికాలోని న్యూ ఓర్లియన్స్ రాష్ట్రంలోని హుయి పి. లాంగ్ బ్రిడ్జ్.

★ 1901లో మాస్కో-వ్లాడివోస్టాక్ మధ్య ట్రాన్స్ సైబీరియన్ రైల్వే ఆరంభమైంది.

★ ప్రపంచంలో ఓ ఖండంలోని ఒక చివర నుంచి మరో చివర దాకా ఏర్పాటైన తొలి రైల్వేలైన్ అమెరికాలోని అట్లాంటిక్ సముద్ర తీరం నుంచి పసిఫిక్ సముద్రతీరందాకా 1776 మైళ్ల దూరం ఉంది. ఇది తొలి ట్రాన్స్‌కాంటినెంటల్ రైల్వేలైన్. సెంట్రల్ పసిఫిక్, యూనియన్ పసిఫిక్ అనే రెండు రైల్వే కంపెనీలు దీనిని నిర్మించాయి. ఈ రైల్వేలైన్ ఉపయోగంలోకి వచ్చింది 1869, మే 10 నుంచి కావడం వల్ల ప్రతి ఏటా ఆ తేదీని నేషనల్ ట్రైన్ డే'గా అమెరికా పరిగణిస్తుంది.

★ ప్రపంచంలోనే అత్యధిక సంఖ్యలో ఉద్యోగులు పనిచేస్తున్నది భారతీయ రైల్వేలోనే!

★ అత్యధిక రైళ్ళలో డబ్ల్యు ఎండ్రి డిజైన్ చేసిన థామస్, ది టాంక్ ఇంజన్‌నే ఉపయోగిస్తున్నారు.

★ ప్రపంచంలోనే అత్యధిక వేగంతో ప్రయాణించే రైలు జపాన్‌లో ఉంది. గంటకి 186 మైళ్ల వేగంతో ప్రయాణించే ఆ రైలు పేరు షింకన్‌సెన్ బుల్లెట్ ట్రైన్.

గుతున్నాడని అనుమానించాను. చివరికదే నిజమయింది" రేఖ సణుగుతూనే వుంది.

భానుమూర్తి భయపడుతున్నది రేఖ గురించి కాదు, మనోరమ గురించే! పెళ్లికి ముందే ఆవిడ తన చెంప పగలగొట్టిన విషయం అతను మర్చిపోలేదు. అందుకే భార్యని బతిమిలాడుతూ "దయచేసి ఈ విషయాన్ని మీ అమ్మకి చెప్పకు" అన్నాడు.

"ఆయనగారు వుంచుకున్న దాన్తో వూరేగగా లేనిది, నేను మా అమ్మకి చెప్తే తప్పొచ్చిందా? "

"అలా అని కాదు, మీ స్టేటస్‌కి మేం తగినవాళ్లంకాదని మీ అమ్మగారు ఇప్పటికీ బాధ పడుతున్నారు. మా నాన్నకి ఓ 'బ్యాక్‌గ్రౌండ్'తో పాటు, కేరెక్టర్ కూడా లేదని తెలిస్తే నన్ను మరీ చులకనగా చూస్తుంది కదాని చెప్పొద్దంటున్నాను"

"సర్లెండి. నంది అవార్డొస్తే నలుగురికీ చెప్పుకుంటాం. పద్మశ్రీ వస్తే పబ్లిసిటీ ఇచ్చుకుంటాం. కానీ మాది పరువు తక్కువ కుటుంబమని చెప్పుకుంటే పోయేది మన పరువేగా!" అంటూ మౌనం వహించింది రేఖ. అయితే ఆమె మౌనం వహించినా ఆమె మనసులో మావగారి మీద ఏర్పడిన 'ఏహ్య'భావం మౌనం వహించలేకపోయింది. మూడో రోజు మధ్యాహ్నం ఆమె నోటంట వెలువడి, మనోరమ మస్తిష్కానికి పని చెప్పింది. తనని ఈ ఇంటినుంచి విజయవాడ పంపించెయ్యడానికి మాధవరావు చాలా సార్లు కాలు దువ్వాడు. అతన్ని ఈ



ఇంట్లోనే, జీతం ఇవ్వని నౌకరుగా మార్చి తన పెంపుడు కుక్కలా తిప్పడానికి కూతురు చెప్పిన సంఘటన బాగా ఉప యోగపడుతుందనుకుంది. తమ చేతికి మట్టి అంటకుండా, తమ నోటికి పని చెప్ప కుండా, అపార్ట్‌మెంట్స్‌లో వున్న వాళ్లందరి ముందు మాధవరావు పరువుని ఎండగట్ట డానికి ఆవిడ ఉపయోగించుకున్న వ్యక్తి.. జోగినాథం!

ఆ మర్నాడు ఉదయం భానుమూర్తి, మాధవరావు ఆఫీసుకెళ్లిపోయాక, జోగినా థాన్ని పిల్చి, కాఫీ ఇచ్చి మనోరమ తమా షాగా అడిగింది "ఏంటి జోగినాథం.. నువ్వు మాధవరావుగారికి నమ్మినబంటు వని నలుగురూ అంటుంటే.. నేను పెద్దగా పట్టించుకోలేకపోయాను. కానీ, నువ్వు హనుమంతుణ్ణి మించిపోయావ్! మాధవ రావుగార్ని దిల్‌కుష్‌రాజాలాగ బతకమని నువ్వే చెప్పావట. చెప్పడంతో సరిపెట్ట కుండా ఎవరో రాధాబాయ్ అనే ఆవిణ్ణి నువ్వే సెటప్ చేసావట" అంది.

జోగినాథం మాధవరావు గురించి ఇలాంటి వార్త వినాల్సొంటుందని ఏనాడూ వూహించలేదు. తలుపుల దగ్గర నిలబడి, లోపల జరిగే మాటల్ని విని, విచిత్రమైన ఆనందాన్ని పొందుతాడే తప్ప, ఇలాంటి వార్తల్ని పోగేసే నైజం లేదు. కానీ, ఇప్పుడు సాక్షాత్తు మాధవరావుగారి వియ్య పురాలే చెప్తున్న వార్త ఇది.

"మేడమ్! మీరు చెప్తున్న ఆ రాధాబాయ్



ఎవరో, మాధవరావుగారికి నేను సెటప్ చెయ్యడవేంటో, నాకేం అర్థమై చావడం లేదు" అన్నాడు జోగినాథం.

"చాల్లే వూరుకోవయ్యా! వాళ్లిద్దరూ మొగుడూ పెళ్లాలకంటే దర్జాగా బిగ్‌బజార్‌కి షాపింగ్‌కెళ్లారట. మా ఫ్యామిలీ ఫ్రెండ్ ఒకావిడ చూసి ఫోన్ చేస్తేనే మాకు తెల్సింది. ఆవిడ బిగ్‌బజార్‌కి రెగ్యులర్‌గా వచ్చే కష్టమరేనట. ఆ క్యాష్ కౌంటర్లో కనుక్కుంటే. ఆవిడ పేరు రాధాబాయ్ అని చెప్పారుట"

"రామరామ! నాకీ విషయం తెలీదండి!"

"సరేలే! నీకేమీ తెలీదని నువ్వే అంటున్నావుగా. ఆయనగారు ఇంత గ్రంథసాంగుడనిగానీ, తాతగా మారింతర్వాత కూడా, ఓ విడో లేడీతో చెట్టాపట్టాలేసుకు తిరుగుతాడని గానీ మాకు తెలీదు. వాస్తవంగా చూడకుండా మా ఫ్యామిలీ ఫ్రెండ్స్ ఎందుకు మాకు ఫోన్ చేసి చెప్తారు? సర్లే.. ఎవరి పాపానికి వాళ్లే పోతారు. నువ్వు మాత్రం ఎవరితోనూ చెప్పకు" అంది మనోరమ.

అలాగేనని తలాడించి వెళ్లిపోయాడు జోగినాథం.

రేఖకి తన తల్లి ధోరణి అర్థంకాక "చెప్పక చెప్పక ఆ జోగినాథంగాడికి చెప్పే

వేంటి? " అని అడిగింది.

"కావాలనే చెప్పాను. వాడికి ఇలాంటి వార్త ఏదైనా తెలిస్తే, పదిమందికి ముట్టించకుండా వూరుకోలేడు. నువ్వే చూస్తావుగా" అంది వక్రంగా నవ్వుతూ.

మనోరమ వదిలిన జోగినాథం అనే తారాజువ్వ ఆవిడ చెప్పిన వార్తని ఆ ఫ్లాట్స్‌లో చాలామందికి అంటించింది. మర్నాడు మాధవరావు ఆఫీసుకెళ్లడానికి మెట్లు దిగుతుంటే, దుర్గాప్రసాద్ అనే ఓ వ్యాపారి పలకరించి చిత్రంగా నవ్వుతూ "మీ గురించి ఏమో అనుకున్నాను గానీ.. మీరు నిజంగా అగ్గిబరాటాయేనండి. వుండాలండీ.. మాలాంటి వాళ్లం కొన్ని విషయాల్లో ఓ ఉదాహరణగా చెప్పడానికైనా మీలాంటి వాళ్లుండాలి" అంటూ వెళ్లిపోయాడు.

మర్నాడు సాయంత్రం అపార్ట్‌మెంట్ గేట్ దగ్గర నిలబడి వాచ్‌మ్యాన్‌తో మాధవరావు మాట్లాడుతుండగా శంకరశాస్త్రిగారు తన ఫ్లాట్‌లోంచి వచ్చాడు. "మీతో ఓ విషయంలో మాట్లాడాలి. నిన్న దుర్గాప్రసాద్ మీ గురించి ఏదో చెప్పాడట. చెప్పిందాంట్లో వ్యంగ్యమూ, వెటకారమే కనిపించింది. నిజానికి అందులో వెటకారం చెయ్యాల్సినంత విషయం నాకు కనబడ్లేదు. ఇద్దరు పెళ్లాలున్నవాళ్లే మూడో పెళ్లాం కోసం మొగ్గలెయ్యడం నాకు తెలుసు. అలాంటప్పుడు మీబోటి వారినెందుకు తప్పుపట్టాలి? కానీ ఒక్క సలహా మాత్రం చెప్పగలను. ఈ వయసులో.. ఆ ఎక్కౌంట్లో పిల్లలు పుట్టకుండా చూస్కోండి" అన్చెప్పి గబగబా వెళ్లిపోయాడు. తన గురించి ఏదో విషయం ప్రచారానికి వచ్చిందని మాధవరావుకి అర్థమైంది.

"శాస్త్రిగారు చెప్తున్నదేంటండి!" అని వాచ్‌మెన్ అడిగాడు.

"అతన్నే అడగలేకపోయావా? " అనేసి మాధవరావు చిరాగ్గా వెళ్లిపోయాడు.




**మా**ధవరావు మిత్రుడు రాఘవేంద్రరావు ఉద్యోగంనించి రిటైరయ్యాడు. ఆఫీసులో ఇచ్చే సెండాఫ్ పార్టీకి, తమ ఆఫీసు కాకపోయినా మాధవరావును, భానుమూర్తిని కూడా ఆహ్వానించారు. మాధవరావు వెళ్లినా, భానుమూర్తి వెళ్లలేదు. "రాఘవ అంకుల్, నేనూ చిన్నప్పటి స్నేహితులం. అతను ఇవాళ రిటైరవుతున్నాడు. సాయంకాలం ఓసారి ఆ ఫంక్షన్‌కి వెళ్తే బాగుంటుంది. వాళ్ల సెక్షన్ ఆఫీసర్, నాకూ నీకూ కూడా ఫోన్ చేసి చెప్పాడు కూడా" అన్నాడు మాధవరావు.

అతనేదో తప్పు మాట్లాడినట్టుగా చర్రున చూసి "రేప్పొద్దుట ఆంకుల్ ఇంటికెళ్తాన్లే" అని ముక్తసరిగా చెప్పాడు భానుమూర్తి.

మర్నాడు ఉదయం మాధవరావు రాఘవ ఇంటికెళ్లాడు. రాఘవ కొడుకు వెంకట్, కోడలు సుశీల నిన్నసభలో కప్పిన శాలువాని, వేసిన దండని, ఇచ్చిన మెమెంటోని చూస్తూ ఆనందిస్తున్నారు.

"ఏరా, నిన్న ఫంక్షన్‌కి మన భానూగాడు కూడా వస్తాడనుకున్నాన్రా" అన్నాడు రాఘవ.

మాధవరావు తన కొడుకు విషయంలో చిన్న అబద్ధమాడాడు. "మావాడు రావా

లనే తెగ ప్రయత్నించాడురా. కానీ ఎవరో మినిస్టరు వూళ్లోకి రావడంతో వీడు బిజీ అయిపోయాడు. ప్రస్తుతం వాడు గవర్నమెంట్ ఆఫీసరుగదా.. బహుశా ఇప్పుడొస్తాడు" అంటుండగానే భానుమూర్తి ఓ ఫ్లవర్ బొకే పట్టుకుని, కాస్త సీరియస్ మూడ్‌తో వచ్చి "విష్ యూ హ్యాపీ రిటైర్డ్ లైఫ్" అంటూ బొకే అందించాడు.

రాఘవ నవ్వి, అతని భుజం తట్టి "థాంక్స్‌రా! పాపం నిన్నటి ఫంక్షన్‌కి రావాలనుకున్నా నీకు కుదరలేదట" అంటుంటే, ఆ వాక్యం పూర్తి కాకుండానే భాను చిరాగ్గా అడిగాడు "నాకు కుదరలేదని నీకెవరు చెప్పేరు? అయామ్ ఏ క్లాస్ ఒన్ గవర్నమెంట్ ఆఫీసర్! నేను రావాలనుకుంటే, నన్ను అడ్డేదెవడు? కావాలనే రాలేదు. ఎందుకంటే నువ్వు క్లాస్ త్రీ ఎంప్లాయివి, నేను చూస్తే గవర్నమెంట్ ఆఫీసర్ని. నీ ఫంక్షన్‌కి నేనొస్తే నీకు గొప్పగా వుండొచ్చు. కానీ నాకు బాగోదుగా"

అతని మాటల ధోరణికి రాఘవ, అతని కొడుకు కూడా బాధపడ్డారని మాధవరావు గ్రహించాడు. కొడుకు మీద చర్రుమంటూ లేచాడు. "నువ్వు క్లాస్ ఒన్నా, క్లాస్ టెన్నా? అని ఎవరూ అడగలేదు. రాఘవ ఎలాంటివాడైనా నాకు చిన్నప్పట్నించీ స్నేహితుడు. ఆ మర్యాదయినా నువ్వు ఇవ్వాలిగదా! ఆ సంస్కారం లేనప్పుడు మనం క్లాస్ ఒన్ అయినా, ప్రెసిడెంటాఫ్ ఇండియా అయినా ఒక్కటే"

రాఘవ జోక్యం చేస్కుని "పోన్లేరా, మనందరిదీ ఒక్కటే ఫ్యామిలీ అనుకున్నప్పుడు మన మధ్య ఇగో ప్రాబ్లమ్స్ ఎందుకు? మనకంటే మనపిల్లలు పెద్దస్థాయికెళ్లాలని కృషి చేశాం. వాళ్లు శ్రద్ధగా చదివి ఆ స్థాయికి ఎదిగారు" అంటుండగా, అతని కోడలు సుశీల నాలుగు టీకప్పులున్న ట్రే తీసుకొచ్చింది.

"టీ తీస్కోండి" అంటూ అందరికీ అందిస్తోంది.



# భలేభలే!

**జేమ్స్** జాయిస్ రాసేపుడు తెల్లని కోటు ధరించేవాడట! బ్లూ **పెన్సిల్‌తో** మాత్రమే రాసేవాడట!

★ ఎర్నెస్ట్ హెమింగ్‌వే తాను రాయదలచుకున్న వాటిని ముందుగానే ఆరు కాలివేళ్లుగల పిల్లులతో చెప్పి అపుడుగానీ రాయడం మొదలు పెట్టేవాడు కాదట!

"నాకు అక్కర్లేదు" చిరాగ్గా అన్నాడు భానుమూర్తి.

"వద్దనడానికి ఇది మామూలు టీ కాదన్నయ్యగారు! మసాలా టీ!" అంది సుశీల.

"టీలో కూడా మసాలా వేస్తారా?" మాధవరావు కాస్త ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం.. మీ కోడలుగారు వెయ్యరా?" అంది సుశీల.

"సర్లే.. కూరల్లోనే వెయ్యదు"

భానుమూర్తి ఆ మాటకి చర్రుమని చూసాడు. 'ఆ మాటేగనక మరొకరు అనుంటే, ఏం చేసేవాణ్ణో' అనే భావం ఆ చూపులో కనిపించింది.

"మసాలా టీ అదిరిపోయిందమ్మా" మాధవరావు అన్నాడు టీ తాగుతూ.

"థాంక్స్ బాబాయ్‌గారు! మరి అన్నయ్యగారికెలా వుందో?"

"నాట్ బ్యాడ్" అన్నాడు భాను కటువుగా. ఆ మాటన్నందుకు కొడుకుని చూసి కొడదామనుకుని కూడా తమాయించుకుని, అంత ఫోర్స్‌నీ మాటల్లో చూపించాడు. "మాట్లాడ్డం అనేది ఒక కళ. ఒక మాట మనల్ని వందమందితో కలుపుతుంది. మరోమాట మనల్ని వెయ్యిమంది నించి దూరం చేస్తుంది"

"ఇప్పుడు నేనేం తప్పు అన్నానని అంత

పెద్ద లెక్చరిస్తున్నావు? "

"నువ్వు చెప్పిన మాట తప్పు కాదు... ఆ మాట చెప్పిన విధానం తప్పు"

"ఏంటా తప్పు? "

"మీ నాన్నగారు ఉన్నారా? అని అడిగిం దానికీ, నీ అమ్మ మొగుడు వున్నాడా? అన్నదానికీ తేడా లేదా? అర్థం ఒక్కటే కావచ్చు. కానీ వాడిన మాటల్లోనే తేడా వుంది. టీ... ఎలా వుందండీ అని అడిగి నప్పుడు బాగుందమ్మా అని ఒక్క మాట అనేస్తే ఆవిడా సంతోషపడేది, నీ సంస్కా రమూ బయటపడేది"

తండ్రి మాటలు పూర్తి కాకుండానే భానుమూర్తి విసురుగా బైటికి వెళ్లిపో యాడు. తండ్రీకొడుకుల మధ్య వున్న అభి ప్రాయ భేదాలు, వైషమ్యాలు పరాయి ఇంట్లో ఓ చిన్న విషయంలో బైటపడ డంతో, వారింట్లోవారు ఎలా గడుపుతు న్నారో అక్కడున్న వారందరికీ అర్థమైంది.

"ఏంటి అంకుల్ ఇది? మీరు భానూని ఎంతో ప్రేమగా పెంచారు. మీది సింపుల్ లివింగ్! పైగా మీరెప్పుడూ నవ్వుతూ నవ్వి స్తుంటారు. మరి మీ మధ్య టెర్మ్స్ ఏంటీ ఇలా వున్నాయి? " రాఘవ కొడుకు వెంకట్ అడిగాడు.

రాఘవ కూడా అడగాలనుకుంటున్న ప్రశ్నా ఇదే! మాధవరావు వస్తున్న దుఃఖాన్ని తమాయించుకుంటూ అన్నాడు.

"పులి కడుపున పులే పుడుతుంది. పక్షి కడుపున పక్షే పుడుతుంది. మనిషి కడు పున మనిషే పుడతాడు. కానీ మంచివాడి కడుపున మంచివాడే పుడతాడన్న నమ్మకం లేదు" అంటూ నిట్టూర్చి ఆ ఇంటి నించి మాధవరావు బయటపడ్డాడు.

అతన్ని బాల్యం నించీ ఎరిగిన రాఘవ కళ్లు చెమ్మగిల్లాయి. "సాధారణంగా ఏదైనా తప్పు చేసినవాళ్లే శాపగ్రస్థులవుతారు. కానీ మా మాధవగాడు శాపగ్రస్థుడు కావడానికి కారణం.. వాడి మంచితనమే" అన్నాడు.

ఆ సాయంత్రం మాధవరావుని బీచ్‌కి రమ్మని ఫోన్ చేసాడు. బీచ్‌లో ఎప్పుడూ కూర్చునే స్థలంలోనే ఇద్దరూ కూర్చున్నారు. ఉదయం జరిగిన సంఘటన ప్రేరణతో రాఘవ అతన్ని కొన్ని ప్రశ్నలు అడగాలను కున్నా, అక్కడ కొడుకు, కోడలు వుండడం వల్ల అడగలేకపోయాడు. ఎందుకు మాధ వరావు ఇంట్లో ఇంత అలజడి జరుగు తోంది? అనే ప్రశ్నకి మాధవ చాలాసేపు సమాధానం చెప్పినా... అందులో ఎక్కువ వ్యాఖ్యలు వియ్యపురాలు మనోరమ చుట్టూనే తిరిగాయి. "నేనీమధ్య ఆఫీసు గొడవల్లో పడిపోయి, నీ ఇంటి విషయాలు అడగడం మర్చిపోయాను! మీ వియ్యపు రాలు పెళ్లి టైములో కూతుర్ని తీసుకొచ్చి ఓ నెలరోజులు వున్నట్టుంది. ఆ తర్వాత మళ్లీ ఎప్పుడొచ్చింది? " అని అడిగాడు.

"మళ్లీ ఎప్పుడొచ్చిందని అడగడానికి, ఆవిడ అప్పట్నించి విజయవాడ ఎప్పుడెళ్లిం దనీ? "

"అలా కూతురింట్లో వుండడం మర్యా దగా వుండదు, వెళ్లిపొమ్మని చెప్పలేకపో యావా? "

"ఆవిణ్ణి వెళ్లిపొమ్మని నేను చెప్పాను. కానీ వెళ్లనని ఆవిడా చెప్పింది, వెళ్లదని మా కోడలూ చెప్పింది, కొడుకూ చెప్పాడు"

ఇలా సంభాషణ కాస్సేపు జరిగాక "ఇప్పుడు.. అంటే, ఇటీవల వచ్చిన అభిప్రా యబేధాలు ఏమైనా వున్నాయా? " రాఘవ అడిగాడు.

"బహుశా రాధాబాయ్ సంగతి తెలిసుం టుంది. డైరెక్టుగా నన్ను అడక్కపోయినా, మా ఫ్లాట్‌లోని వాచ్‌మెన్‌తో సహా అంద రికీ ఆ విషయం తెలియజేసారు. ఇప్పుడం దరూ అదే టాపిక్కు గురించి మాట్లాడుతు న్నారు" కాస్సేపు ఆగాక రాఘవ, "ఆ విషయం అప్పుడే చెప్పెయ్యరా అన్నాను,

## ముందే కుదిరిన ఒప్పందం!

డైనమేట్‌ని కనిపెట్టిన ఆల్‌ఫ్రెడ్ నోబెల్ 1867లో దానిమీద వచ్చిన సంపాదనతో నోబెల్ ప్రైజ్‌ని ఇచ్చేందుకు ఓ సంస్థని ఏర్పాటు చేశారు. 3.1 కోట్ల స్వీడిష్ క్రొనార్స్‌ని దీని కోసం కేటాయించారు. శాంతి, సాహిత్యం,



రసాయన శాస్త్రం, భౌతిక శాస్త్రం, వైద్య శాస్త్రం లేదా శరీరధర్మ శాస్త్రాలలో కృషి చేసిన వారికి ఏటా నోబెల్ ప్రైజ్‌ను బహూకరిస్తారు. ఒక్కో ప్రైజ్ పొందినవారికి కోటి స్వీడిష్ క్రొనార్స్‌ని ఇస్తారు. మహాత్మాగాంధీకి శాంతి బహుమతి రాలేదు. అందుకని ఆయన్ని మిస్సింగ్ లారెట్ అని పిలుస్తారు. నోబెల్ కమిటీ తమ తప్పిదానికి సంతాపాన్ని ప్రకటించింది. భారతీయుల్లో టాగూర్, సర్ సి.వి. రామన్, హరగోవింద ఖురానా, మదర్ థెరిసా, ఎస్ చంద్రశేఖర్, అమర్త్యసేన్, వెంకట్రామన్ రామకృష్ణన్‌కు నోబెల్ బహుమతులు లభించాయి.

యూనివర్సిటీ ఆఫ్ షికాగోలో ప్రొఫెసర్‌గా పనిచేసిన రాబర్ట్ లూకాస్ 1995 అక్టోబర్ 31లోగా తనకి నోబెల్ ప్రైజ్ వస్తే అందులో సగం భార్యకి ఇస్తానని ఆమెకు విడాకులు ఇవ్వడానికి ముందే ఒప్పందం చేసుకున్నాడు. అక్టోబర్ 10న అతనికి నోబెల్ ప్రైజ్ అందడంతో అందులో సగం మాటతప్పకుండా తన భార్యకి ఇచ్చేసాడు.

నువ్వు చెప్పలేదు” అంటూ కొద్దిసేపు రాధాబాయ్ విషయమే మాట్లాడారు.

సముద్రపు హోరులో ఆ మాటలన్నీ కలిసిపోయాయి.

★ ★ ★

మాధవరావుకి వాలంటరీ రిటైర్మెంట్ గ్రాంటయిపోయింది. అతనికి ఆ కంపెనీ నించి ప్రావిడెంట్ ఫండు, గ్రాచ్యుటీ అన్నీ కలిపి ఆరు లక్షల వరకు వస్తాయన్నది అతనికి తెలుసు. భానుమూర్తి, అతని కుటుంబ బృందం ఎంక్వయిరీ చెయ్యడం వలన వాళ్లకీ తెలిసింది. ఆ రోజు మాధవరావుకి ఆఫీసునించి డబ్బు అందేరోజు. ఆఫీసులో పనిచేస్తున్న భానుకి ఫోన్ చేసి రేఖ, ఆవిడ తల్లి ఓ సలహా ఇచ్చారు.

“మీకు ఉద్యోగం వచ్చిన దగ్గర్నించి మీ నాన్న మనకి జీతం ఇవ్వడం మానేసాడు. ఎందుకివ్వడం లేదనే సస్పెన్స్ కూడా మనం ఛేదించాం. ఇవాళే ఆయనకి ఆరు లక్షలు అందుతాయని మేం ఎంక్వయిరీ చేసి తెలుసుకున్నాం. అంచేత, అతని మీద నిఘా వేస్తే తప్ప ఆ డబ్బు మనకి అందదు”

“ఆ సంగతి నాకు వదిలెయ్యండి” అన్నాడు భానుమూర్తి.

తన కారు డ్రైవ్ చేసుకుంటూ మాధవరావు పనిచేసే ఆఫీసుకి వెళ్లాడు. మెయిన్ గేట్‌కి కాస్త దూరంగా కారు ఆపి కారులోనే కూర్చుని తండ్రికోసం నిరీక్షిస్తున్నాడు. మాధవరావుకి రావలసిన డబ్బుని చెక్కు రూపంగానే ఇస్తారు. అతనికి ఎక్కౌంట్ కూడా పక్కనే వున్న ఆంధ్రా బ్యాంక్‌లోనే వుంది. ఆ రోజు బ్యాంక్ ఖాళీగానే వుంది. మాధవరావు తన హ్యాండ్‌బ్యాగ్ పట్టుకుని, ఆఫీసుగేట్‌లో నించి వచ్చి బ్యాంక్‌లోకి వెళ్లాడు. పది నిమిషాల్లోనే బ్యాగ్‌ని జాగ్రత్తగా పట్టుకుని బైటికి వచ్చి తన బైక్ స్టార్ట్ చేస్తుండగా,

భానూకి రెండు ఆలోచనలు వచ్చాయి. గబగబా వెళ్లి ఆ డబ్బు లాక్కోవడమా? లేక తండ్రిని తన కారులోనే డబ్బుతో సహా కూర్చోబెట్టి ఇంటికి తీసుకెళ్లడమా? నిర్ణయం తీసుకునేలోగా భానూని రత్నాకరావు అనే పెద్దమనిషి చూసాడు. అతనో కాంట్రాక్టరు. భానూ చేసే ఉద్యోగపరంగా అతన్తో రత్నాకర్‌కి చాలా అవసరాలున్నాయి. సడన్‌గా భానూ ఒంటరిగా కనిపించేసరికి, అతన్తో మాటలకి దిగాడు. మాధవరావు బైక్ స్టార్ట్ చేసుకుని మెయిన్‌రోడ్ వైపు వెళ్లిపోయాడు. రత్నాకర్‌ని వదిలించుకుని, కారు స్టార్ట్ చేసుకుని మెయిన్‌రోడ్ మీదకి వెళ్లేసరికి తండ్రి చాలా దూరంలో వెళ్లిపోతూ కనిపించాడు. రోడ్డు మీద ట్రాఫిక్ ఎక్కువగా వుండడం వల్ల, మరీ స్పీడ్‌గా వెళ్లి తండ్రి నడిపే బైక్‌ని ఓవర్‌టేక్ చేసే అవకాశం లేదు. అయినా తండ్రిని తన దృష్టి నుంచి తప్పిపోకుండా జాగ్రత్తగా గమనిస్తూ వెళ్తున్నాడు.

ఎన్.వి.పి కాలనీ దరిదాపుల్లో వున్న ఓ వీధిలోకి మాధవరావు తన బైక్‌ని పోనిచ్చాడు. వెనకే భానూ కూడా తన కారుని పోనిచ్చాడు. ఓ సందులాంటి చిన్నవీధిలో వున్న ఓ కొత్త మేడ ముందు తండ్రి మోటార్‌బైక్ ఆగడం గమనించి భాను దూరంగా కారు ఆపి, గబగబ ఆ యింటి దగ్గరకి వెళ్లాడు. అప్పటికే మాధవరావు ఇంట్లోకి వెళ్లిపోయాడు. వీధి వైపున్న కిటికీకి ఒక రెక్క మాత్రమే తెరిచి వుంది. అందులోనించి చూసాడు. మాధవరావు నవ్వుతూ ఓ వ్యక్తితో మాట్లాడుతున్నాడు.

ఆ వ్యక్తి.. రాధాబాయ్!!

ఆమె చేతికి తన బ్యాగ్‌లో నించి బ్యాంక్‌లో డ్రా చేసిన డబ్బుని అందించాడు. ఆమె ఆ డబ్బు పుచ్చుకుని కళ్లకి అద్దుకుంది. లోపలికి వెళ్లాలా? వెళ్లి లాక్కోవాలా? అనే సంశయంలో వుండగానే, ఆ ఇంటికి సంబంధించిన ఎవరో వ్యక్తి గొంతు "ఎవడ్రా అది? కిటికీలోనించి తొంగి చూస్తున్నాడు?" అని వినిపించడంతో కంగారుపడి, తన కారు దగ్గరకెళ్లిపోయి, స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు.

ఉద్యోగి పదవీ విరమణ చేసినప్పుడే ఎక్కువ స్థాయిలో డబ్బు అందుతుంది. మాధవరావుకీ అందింది. కానీ అది రాధాబాయ్ ఇంటికి వెళ్లింది. చాన్నాళ్లుగా అతని జీతం కూడా ఆ ఇంటికే తప్ప, ఈ ఇంటికి రానందుకు ఇంటిల్లిపాదీ భగ్గుమన్నారు. భానుమూర్తి వచ్చి ఈ విషయం చెప్పిన చాలా సేపటికి మాధవరావు జీవితంలో అనుకున్నది సాధించినవాడిలా చాలా హుషారుగా ఇంట్లోకి వచ్చాడు. అతన్ని నిలదీసి అడగడానికి ముగ్గురూ హాల్లోనే వున్నారు. వాళ్లు నిర్మొహమాటంగా అడిగినందుకు, అతను ఆవేశాలకు పోకుండా, కులాసాగా, చమత్కారంగా జవాబులు చెప్పాడు.

"ఇవాళ మీ రిటైర్మెంట్ డబ్బు అందిందా?" రేఖ అడిగింది.

"ఎప్పుడు అందుతుందని ఆరా తీస్తే ఇవాళే అందుతుందని మాకు తెలిసింది" అంది మనోరమ.

"ఆరాలు తీసేటంత నెట్‌వర్క్ వున్నప్పుడు మళ్లీ నన్ను అడగడమెందుకు?"

"మీరు చాలాకాలంగా మీ జీతం కూడా ఇంటికివ్వడం లేదు. ఇప్పుడీ ఆరు లక్షలు కూడా ఇవ్వలేదు. ఈ డబ్బంతా ఏం చేసినట్టు?" ఓ నేరగాణ్ణి ఓ పోలీసు ఆఫీసరు ఇంటరాగేట్ చేస్తున్నట్లు అడిగింది మనోరమ.

మాధవరావు నవ్వుతూ అందర్నీ ఓసారి చూసాడు. "మీరంతా టీవీలో వచ్చే 'కౌన్ బనేగా కరోడ్‌పతి' ప్రోగ్రామ్ చూసారు కదా? నేనూ అదే టైపులో ఒక ప్రశ్న,

నాలుగు ఆప్షన్స్ ఇస్తాను. అందులో ఎవరు కరెక్ట్ ఆన్సర్ చెప్తే, వాళ్లకి ఫైవ్ స్టార్ చాక్లెట్ ఇస్తాను. ప్రశ్న వినండి.. మాధవరావుకి అందిన డబ్బుని ఏం చేసాడు? ఇప్పుడు నాలుగు ఆప్షన్స్ ఇస్తున్నాను. ఎ) రిజర్వ్ బ్యాంక్‌లో దాచాడు. బి) దొంగలు ఎత్తుకు పోయారు సి) బంగాళాఖాతంలో పారేసాడు డి) వరల్డ్ బ్యాంక్‌కి అప్పిచ్చాడు"

మాధవరావు ఇంతవరకు తెగించి, ఇవాళ మరీ బరి తెగించేసాడని ముగ్గురికీ అర్థమయింది. మనోరమ ఆవేశపడుతూ, మర్యాద తగ్గించి మరీ బాధ్యతల గురించి మాట్లాడింది. "మాతో సంబంధం కలుపుకునే తాహతు లేకపోయినా, కనీసం మా వియ్యంకుడికి ఓ మాదిరి వ్యక్తిత్వమయినా తగలడుతుందని ఆశించాను. కానీ, అదీ కనబడలేదు. సంపాదించిన డబ్బు ఇంటికి ఇవ్వాలన్న బాధ్యత కూడా లేనప్పుడు, ఆ వ్యక్తిని ఓ మనిషిగా జమకట్టడం కూడా వేస్టే!! అలాంటి వారికి ఎలాంటి హక్కులూ వుండవు!!"

మాధవరావు చప్పట్లు కొట్టి మరీ వియ్యపురాలికి సమాధానం చెప్పాడు.

"శెభాష్! మీ రాయల్ ఫ్యామిలీ మనుషులు ఎప్పుడెప్పుడు బాధ్యతల గురించి, హక్కుల గురించీ మాట్లాడతారా? అని నేనూ ఎదురు చూస్తున్నాను. నా డబ్బుని నేను మా ఇంటికి ఇచ్చేముందు, నా కొడుక్కి రావలసిన డబ్బు నా ఇంటికి ఎందుకురాలేదు? మీకున్న వందకోట్లకి అధిపతి అయిపోదామని, ఈ వెధవ అత్యాశలకిపోయి, నీ కూతుర్ని చేసుకున్నాడు. నేను ఓ సామాన్యుణ్ణి. కట్నం ఆశించడంలో తప్పులేదు. కానీ నువ్వు వీడికి పెళ్లి కట్నం కాదుకదా, పండగకట్నం కూడా ఏనాడూ ఇవ్వలేదు. ఇవ్వకపోగా, కోర్టులో ఉన్న కేసుకి వీడిచేత లాయరుకి ఫీజులిప్పిస్తున్నావు. ఆకాశంలోని చందమామని




అమెరికన్ రచయిత ఫిలిప్ రోత్‌కు అర మైలు దూరం నడిస్తేనే ఒక పేజీ రాయడానికి సరిపడ కథాంశం మనసులో మెరిసేదట!

★ 'డిజిటల్ ఫోర్ట్రెస్', 'డా విన్సి కోడ్' వంటి గొప్పగొప్ప రచనలు చేసిన డాన్ బ్రౌన్ రాస్తూ రాస్తూ మధ్యమధ్యలో వ్యాయామం చేసేవాడట!

చంటి పిల్లలకి చూపించి అన్నం తినిపిస్తారు. కానీ నువ్వు కోర్టులో ఉన్న డబ్బుని చూపిస్తూ, వీడిచేత కోర్టు ఖర్చులు కట్టిస్తున్నావు. తీరాచూస్తే కోర్టులో ఉన్నది వంద కోట్లు కాదు, పది కోట్లేనని ఏనాడో తేలిపోయింది. పెళ్లైన దగ్గర్నించి నువ్వు ఇక్కడ తిష్టవేసి, ముప్పూటలా తింటూ పేకాటలాడుతున్నావు. ఏ రాయల్ ఫ్యామిలీ వాళ్లూ ఇలా ప్రవర్తించరు. ఎందుకంటే నిజమయిన రాయల్‌ఫ్యామిలీ వాళ్లకి ఇవ్వడం తప్ప, పుచ్చుకోవడం తెలీదు. కానీ నీకు మా ద్వారా అన్నీ పుచ్చుకోవడం తప్ప, ఇవ్వడం తెలీదు. ఇంక నాకు అందిన డబ్బు సంగతంటావా.. నేను ముప్పై అయిదేళ్లపాటు చేసిన శ్రమకి ఫలితంగా కంపెనీవారు ఇచ్చిన డబ్బు! సదరు సొమ్మును అనుభవించుటకు గానీ, దానమిచ్చుటకు గానీ, చివరికి మురికి కాలువలో పారవేయుటకుగానీ నాకే హక్కు, అధికారం ఉన్నవి. కావున దాని గురించి అడుగుటకు గానీ, ఆక్షేపించుటకు గానీ వేరెవరికీ ఎటువంటి హక్కులూ లేవని తెలియజేయడమైనది" అంటూ తన మనసులోని మాటని చిత్రమైన పద్ధతిలో చెప్పి, నవ్వుకుంటూ బైటకి వెళ్లిపోయాడు.

మాధవరావు తను చేసిన తప్పుల్ని కప్పిపుచ్చుకోవడమే కాకుండా, తమనే విమ

ర్శించి, వెటకారం చేసే పరిస్థితికి వచ్చేసా డని పూర్తిగా గ్రహించేసాక తల్లీకూతుళ్లకి ఒళ్ళంతా కంపరం పుట్టింది. అతనికి వెంటనే బ్రేక్ వెయ్యకపోతే, తను ఈ ఇంట్లో ఉండడానికే ప్రమాదం వచ్చేటట్టుం దని మనోరమ గబగబ ఓ పథకం ఆలో చించింది.

★ ★ ★

మాధవరావు మర్నాడు ఉదయం టిఫిన్ చేసాక అపార్ట్‌మెంట్ వాటర్ ట్యాంక్ దగ్గ రికి వెళ్లబోతుంటే రేఖ అతన్ని ఆపి మార్కెట్ నుంచి కూరగాయలు తెచ్చే సంచి, సామాన్ల చీటి అందించింది.

"ఏమిటి? ఏనాడు లేనిది సంచి నాకిస్తు న్నావ్? " చిరాగ్గా అడిగాడు మాధవరావు.

"మా పెళ్లికి ముందు మార్కెట్‌కెళ్లి కూరగాయలూ అవీ మీరే తెచ్చేవారు. వంటకూడా మీరే చేసేవారని మీ అబ్బాయి చెప్పారు"

"కరెక్టే! కానీ, పెళ్లయ్యాక ఇంట్లో పనికి సూరిబాబుని పెట్టాం. వంటకోసం వీర మ్మని పెట్టాంగా? "

"మీరు పెట్టారు. ఒంటిచేతి ఆదాయం మీద ఇల్లంతా నడుస్తోంది. మీ కొడుకు నెత్తిమీద భారం ఎక్కువైపోయిందని మీరేగా అన్నారు. అందుకే, ఆ ఖర్చుల భారం తగ్గించడానికి, సూరిబాబుని పనిలో నించి తీసేసాం"

"మీరు నిజంగా ఖర్చులే తగ్గించాలను కుంటే, మీరు తియ్యాల్సింది నౌకర్ని కాదు, మీ అమ్మని. ఆమెను ఊరు పంపించేస్తే, ఆవిడకి పెట్టే తిండి ఖర్చు, బట్టల ఖర్చు, పేకాటలాడ్డానికయ్యే డబ్బుల ఖర్చు, ఆడ్డా నికొచ్చే ఆడాళ్లకయ్యే కాఫీ, టీల ఖర్చు. అగడం బగడం అంతా కలిపి బోలెడంత డబ్బు మిగులుతుంది"

మనోరమ తను కూర్చున్న చోటునించే జవాబు చెప్పింది "మీరిలా మాటకి మాట జవాబు చెప్పడం తప్ప ఏ పనీ చెయ్యరా? మీరు చాన్నాళ్లనించి మీ జీతం ఇవ్వకుం డానే తిండి తిన్నారు. మీకున్న ఉద్యోగం నించి కూడా రిటైరయి ఊడగొట్టిన మంచంకోడులా తయారయ్యారు. నేనేదో ఊరికే తిని కూర్చుంటున్నానన్నారు. ఇవాళ్టినించి మీకూ నాకూ తేడా లేనట్టేగా? "

మాధవరావు వియ్యపురాలి మాటలకి మనసు మార్చుకోలేదు. తను ఇవాళ్టి నించి ఆఫీసుకి వెళ్లక్కర్లేదు. ఏదో ఓ వ్యాపకం ఉంటే తప్ప తనకీ తోచదు. ఒంటికీ వ్యాయామం ఉండదు. అంచేత కోడలిచ్చిన డబ్బులు తీసుకుని బయటికి నడిచాడు. తలుపు తీసేటప్పటికి యథాప్రకారం జోగి నాథం కనిపించాడు. మునుపైతే, ఇంట్లో వాళ్లు బైటకి వస్తే, దొరికిపోయిన దొంగలా తత్తరపడేవాడు. కానీ ఈ మధ్య అలవాటు పడ్డ దొంగలాగ కాస్త ధైర్యంగానే నిలబడు తున్నాడు.

"ఏంటండీ ఇంట్లోని ఆడంగుల్తో ఏదో గొడవ పడుతున్నట్టున్నారు! సూరిబాబుని ఉద్యోగంలో నించి తీసేశారటగా? ఎహ్హె హ్హెహ్హె" అన్నాడు.

"అంతవరకు వినబడిందిగా! సూరిబా బుని తీసెయ్యలేదు. నేను మాన్పించేశాను"

"మీరు మానిపించేశారా? "

"వాణ్ణి నేను పెట్టాను, నేను తీసేసాను. ఇప్పుణ్ణేను రిటైరయిపోయానని ఏ పనీ చెయ్యకుండా గంపకింద కోడిపెట్టలా ఉంటే, ఒంటికి వ్యాయామం ఏం ఉంటాది? అందుకే, మార్కెట్‌కు వెళ్లే పనీ అదీ నేను చూసుకుంటానన్నాను, కానీ ఇంటి పట్టున ఉండి రెస్టు తీస్కోమని కోడలు గొడవ పెడుతోంది. అదీ విషయం. ఇంక నువ్వెళ్లి పని చూస్కో" అని చెప్పి గబగబా ముందుకు వెళ్లాక.. జోగినాథం తనని జాలిగా, వెటకారంగా చూస్తున్నాడనే సందేహం వచ్చి వెనక్కి

చూసాడు. తన అనుమానం నిజమే అయింది. అతను తన వైపే జాలిగా చూస్తున్నాడు. తన పరిస్థితి మీద తనకి సరైన అవగాహన ఏర్పడుతోందని తనకి తనే చెప్పుకుని ముందుకెళ్లాడు.

ఓ గంటన్నర తర్వాత సంచితో పాటు సామాన్లు పట్టుకుని వచ్చాడు. దారిలో టైర్ పంక్చరయింది. స్టెప్నీ వీల్ లేకపోవడం వలన ఓ స్కూటర్ షెడ్ వరకు నడిపించుకుంటూ వెళ్లి అక్కడ బైక్ ఇచ్చాడు. షాపువాడు సాయంత్రం రమ్మన్నాడు. అక్కణ్ణించి సంచి పట్టుకుని నడుచుకుంటూ వచ్చాడు. ఇంటికొచ్చి కోడలికి సంచి అప్పగించి తన రూమ్‌కెళ్లి మంచం మీద వాలాడు. అంత దూరం స్కూటర్ తోసుకుంటూ నడవడం అలవాటు తప్పింది. అందునా, కాస్త బరువైన సంచి పట్టుకుని నడవడం వల్ల ఆయాసం వచ్చి... క్షణాల్లో నిద్ర పట్టేసింది. "బాబుగారూ! బాబుగారూ!" ఎవరో పిలుస్తున్నట్టనిపించి కళ్లు విప్పి చూసాడు.

ఎదురుగా వంటమనిషి వీరమ్మ!. సాధారణంగా ఆవిడ వంటగదికే పరిమితం అవుతుంది తప్ప తన గదిలోకి రాదు.

"ఏం వీరమ్మా?" అన్నాడు లేచి కూర్చుని.

"రేఖమ్మగారు పిలుస్తున్నారండి" అని చెప్పి వెళ్లిపోయింది.

హాల్లోకి వస్తే అక్కడ కొంతమంది ఆడవాళ్లతో రేఖ, మనోరమ పేకాడుతున్నారు.

"ఇందాక చెప్పడం మర్చిపోయాను. రెండు పేక ప్యాకెట్లు, ఓ నెయిల్ పాలిష్ బాటిల్ తీసుకురావాలని మా మమ్మీ చెప్పమంది" అంది అతని వైపు చూడకుండా చేతిలో ఉన్న ముక్కల్ని చూస్తూ.

"అవి ఇంటికి పనికొచ్చే వస్తువులు కావు"

"ఇంట్లోని మనుషులకు అవసరమయిన వస్తువులని చెప్పు. మునుపు సూరిగాడు

## రిహార్సల్స్ మొదలుపెట్టావా?

మృత్యువు గురించి సరదాగా మాట్లాడటం ముట్నూరివారికి అలవాటు. పత్రిక కార్యాలయం నుంచి ఇంటికెళ్లేటప్పుడు 'ఏం లాభం? ఇవాళ కూడా కీర్తిశేషుల జాబితాలో నా పేరు పడలేదు. అంటే ఏమిటని అర్థం. ఇంటికే వెళ్లాలన్నమాట! తప్పదు' అనేవారు.



ముట్నూరివారు అంత్యదశలో మరణశయ్యపై ఉన్నప్పుడు పక్కనే కూర్చున్న ఆయన భార్య మాటిమాటికీ కళ్లు తుడుచుకుంటోంది. అది చూసిన ఆయన 'ఏమిటీ? అప్పుడే రిహార్సల్స్ మొదలు పెట్టావా?' అని వేళాకోళం చేశారు.

ఎదురు సమాధానాలు చెప్పకుండా తీసుకొచ్చేవాడని చెప్పు" అంది మనోరమ కూతురి వైపు చూస్తూ.

"నా బైక్ పంక్చరయింది. సాయంత్రం ఆరు తర్వాత ఇస్తానన్నాడు మెకానిక్! రేపెప్పుడైనా వీలు చూసుకుని తేవడానికి ప్రయత్నిస్తాను" అని చెప్తూనే బైటకి నడిచాడు.

"వీలు చూసుకోవటం కాదు.. ఎలాగైనా వీలు చేసుకోవాలి" శాసిస్తున్నట్టుగా అంది మనోరమ.

వెళ్తున్న మాధవరావుకి ఆ మాటలు వినబడినా వెనుదిరిగి చూళ్లేదు.

వంటమనిషి వీరమ్మకి ఆ ఇంట్లో పనికి కుదిరినప్పట్నించీ ఆ ఇంటి వ్యవహారాలు నచ్చడం లేదు. ఇప్పుడు ఇంటి యజమానిని లోకువ కట్టి, కూరగాయలు తెచ్చే పనుల దగ్గర్నించి, పేకదస్తాలు, నెయిల్ పాలీషులు తెప్పించడం దాకా వచ్చినందుకు ఆమెకు బాధకలిగింది. ఆవేశం వచ్చింది కానీ, తనస్థాయి ఏంటో గుర్తుపెట్టుకుని మౌనం వహించింది.

★ ★ ★

మాధవరావు విలువ రోజురోజుకి దిగజారుతోంది. ఎన్నిసార్లు తన ఆత్మగౌరవాన్ని నిలుపుకోడానికి ఎదిరించి మాట్లాడినా, తనది ఒక్కగొంతు కాగా తనని శాసించే గొంతులు మూడయ్యాయి. తన

> **కొత్తగాలి...**
>
> **పంట**
> **నాశనం..**
> **రైతు**
> **వినాశనం!**
>
> – యు. చిట్టిబాబు,
> కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

కంటూ వున్న ఏకైక రక్త బంధం తనకొడుకే! కానీ అతను కూడా శాసించే వాళ్లపక్షంలో చేరిపోయి చాన్నాళ్లైంది. మనసులోని బాధ ఎవర్నికైనా చెప్పుకుంటే కాస్త బరువు తగ్గుతుందంటారు. ఆ ఫ్లాట్స్‌లో వున్నవాళ్లు తన బాధని పెంచేవాళ్లే తప్ప పంచుకొనేవాళ్లెవరూ కనబడలేదు.

★ ★ ★

ఒకరోజు సాయంత్రం వంటగదిలో వున్న వీరమ్మతో రేఖ మాట్లాడుతూ "నువ్వీపనులు చేసి యింటికెళ్లిపో. సాయంత్రం వంట నువ్వు చేయక్కర్లేదు. మేం సినిమాకెళ్తున్నాం. అట్నుంచి అటే హోటల్‌కెళ్లి భోంచేసి వచ్చేస్తాం" అనడం మాధవరావుకి వినిపించింది.

మనసు కాస్త ఉత్సాహంగా గెంతులేసింది. ఈ మధ్య టీవీల్లో ప్రసారం అవుతున్న సినిమాల్ని అప్పుడప్పుడు చూడ్డం తప్ప, థియేటర్‌కెళ్లి సినిమా చూడ్డం చాలా కాలంగా జరగలేదు. ఇవాళ ఆ సరదా తీర్చుకోవచ్చని మాధవరావు సంతోషపడుతూ, తన గదిలోకి వెళ్లి బట్టలు మార్చుకుని తయారయ్యాడు. అప్పటికే భాను, రేఖ, మనోరమ బయటకు వెళ్లడానికి సిద్ధమవుతున్నారు. మాధవరావు కూడా వచ్చి "పదండి" అన్నాడు. ముగ్గురూ ఒకర్నొకరు చూసుకుని, తర్వాత అతని వైపుచూసి అడిగారు.

"ఎక్కడికి? "

"సినిమాకెళ్దాం అన్నారుగా"

"మీతో ఎవరన్నారు? మేం సినిమా కెళ్తున్నాం కాబట్టి, నువ్వు యింటికెళ్లిపోవచ్చు అని వంటమనిషితో అన్నాం. మేం వెళ్తున్నామంటే అర్థం మాతోపాటు మీరూ వస్తున్నారని కాదు" రేఖ వీలున్నంత కటువుగా అంది.

మాధవరావు మనసు బాధతో మెలికలు తిరిగినా, తమాయించుకుని అన్నాడు. "సరే, మీరు సినిమాకెళ్లండి, నేను బీచ్‌కెళ్లి చాన్నాళ్లయింది. కాస్సేపు అక్కడ కూర్చునొస్తాను" అన్నాడు.

వెంటనే భాను సీరియస్‌గా ముఖంపెట్టి, "నువ్వు బీచ్‌లంట షికార్లు తిరిగితే, యిక్కడ మా 'శంకూ'గాణ్ణి చూసుకునేదెవరు? వాణ్ణి కూడా సినిమాకి తీసుకెళ్తే వాడు క్యార్‌క్యార్‌మని ఏడుస్తూ హాల్లో అందరికీ డిస్టర్బెన్స్ కలిగిస్తాడు. వీణ్ణి ఆడిస్తూ యింట్లో వుండు. మరీ ఏడిస్తే కాస్సేపు కాంపౌండ్‌లో తిప్పు" అంటూ తండ్రి చెయ్యాల్సిన పనుల గురించి సూచ

నలు ఇచ్చాడు.

రేఖ ఓ పాలసీసా, ఓ బిస్కెట్ల డబ్బా, రెండు ఆట వస్తువులు టీపాయ్ మీద పెట్టి, బాబుని మాధవరావుకిచ్చింది. అందరూ బైటకి వెళ్లేటప్పుడు మనోరమ "ఇల్లు జాగ్రత్త! బాబు జాగ్రత్త!!" అంటూ హెచ్చరికలు చేసి మరీ వెళ్లింది.

మాధవరావు బాబుని కాస్సేపు ఒడిలో కూర్చోబెట్టుకుని రిమోట్‌తో టీవీ ఆన్‌చేసాడు. ఒక్కో ఛానల్ మారుస్తూ ఏ ఛానల్లో ఏం వస్తోందో గమనిస్తున్నాడు. బాబు అతని ఒడిలోనించి కిందకిదిగిపోతే.. బాబు ముందు ఆటబొమ్మలు పెట్టాడు. అందులో ఒకటి 'కీ' యిస్తే డాన్స్ చేస్తూ తిరిగే బొమ్మ. దానికి 'కీ' ఇచ్చి నేలమీద పెట్టాడు. బాబు దాంతో ఆడుకుంటున్నాడు. మాధవరావు మళ్లీ టీవీ ఛానల్స్‌ని మారుస్తూ ఓ ఛానల్ దగ్గర ఆగాడు. అందులో ఏదో సినిమా అప్పుడే ప్రారంభమయింది.

టైటిల్స్ ముందే కొంత కథ జరుగుతోంది. ఎవరో స్త్రీ నిండు గర్భిణి. ఆసుపత్రిలో పురిటి నెప్పులు పడుతోంది. వరండాలో వున్న భర్తతో డాక్టర్ చెప్తోంది. 'ఆవిడకి గర్భంవస్తే డెలివరీ కష్టమవుతుందని, ఈసారి ప్రాణాలకే ప్రమాదమని కూడా చెప్పినా మీరు జాగ్రత్తలు తీస్కోలేదు. ఇప్పుడా బిడ్డ కడుపులో అడ్డం తిరిగింది. ఆపరేషన్ చెయ్యాలి' అనేసి ఆపరేషన్ థియేటర్లోకి వెళ్లింది. లోపల ఆపరేషను, బయట నిలబడ్డ భర్తలో టెన్షను చూపించారు. కాస్సేపు పోయాక డాక్టర్ వచ్చి కాస్త బాధగా చెప్పింది. 'సారీ! మేం చెయ్యవలసిన ప్రయత్నమంతా చేసాం. కానీ, బిడ్డని రక్షించగలిగాం.. తల్లిమాత్రం'

మాధవరావుకి అప్రయత్నంగా ఏడుపొచ్చి ఆ ఛానల్ మార్చేసాడు! అతనికి చనిపోయిన తన భార్య గుర్తొచ్చింది. ఒకనాడు తన జీవితంలో జరిగిన విషాద సంఘటననే యథాతథంగా యిప్పుడు సినిమాగా చూస్తున్నాననే భావనకి లోనయ్యాడు. అతని భార్య సుజాతని ఓసారి లేడీ డాక్టర్ చేత పరీక్ష చేయిస్తే "ఆమె గర్భసంచి చాలా బలహీనంగా వుంది. బిడ్డని ప్రసవించేటంత స్థాయిలో లేదు. కాదూ కూడదని ప్రసవిస్తే ఆమె ప్రాణాలకే ప్రమాదం" అని కచ్చితంగా చెప్పేసింది. అయినా మాధవరావుకి ఒక్క బిడ్డనైనా కని, నాన్నా అని పిలిపించుకోవాలనే ప్రబలమయిన కోరికవుందని గ్రహించి, ఆమె ప్రాణాన్ని రిస్క్‌చేస్తూ గర్భవతయింది. అబార్షన్ చేయిస్తానన్నా ఆమె వినలేదు. ఆమె ప్రసవసమయంలో కడుపులోని బిడ్డ అడ్డం తిరిగింది. తత్ఫలితంగా బిడ్డని కని మరణించింది...

మాధవరావు యింకా గతకాలపు విషాద స్మృతుల్నే గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. టీవీసౌండ్‌ని బాగా తగ్గించడంవల్ల అతని ఆలోచనలు ఆనాటి ఆసుపత్రి వరండాలోనూ, శ్మశాన భూమిలోనూ తిరుగాడటానికి ఎలాంటి ఆటంకాలూ కలగలేదు.

అతని మనవడు శంకు బుడిబుడి నడకలు నడుస్తూ.. కాస్సేపు ప్రాకుతూ యింట్లోనించి కారిడార్‌లోకి వచ్చాడు.

అక్కడ ఎవరూ తిరుగాడ్డంలేదు. మెల్లగా కుడివైపు వెళ్లాడు. అక్కడ అపార్ట్‌మెంట్ మెట్లున్నాయి. పక్కనే లిఫ్ట్ వుంది. లిఫ్ట్‌లో వచ్చిన వాళ్లెవరో లిఫ్ట్ తలుపులు మూయకుండానే వెళ్లిపోయారు. దాంతో బాబు లిఫ్ట్‌లోకి వెళ్లాడు.

ఫ్లాట్‌లో మాధవరావు జీవితంలోని గతకాలపు విషాదం అతని కంట తడిపెట్టించింది. మనసుని చెమ్మగిల్లజేసింది. క్రమంగా అతన్ని నిద్రలోకి జార్చింది. కూర్చున్న సోఫా చైర్‌లోనే నిద్రపోయాడు. టీవీలోనించి బొమ్మ కనబడుతోంది



గానీ... శబ్దం మాత్రం రాకపోవడం వలన అతని నిద్రకి ఎలాంటి అవాంతరమూ ఏర్పడలేదు.

★ ★ ★

లీలామహల్ జంక్షన్ ఆ రాత్రి చాలా బిజీగా కనిపిస్తోంది. ఆ థియేటర్‌లోనూ, పక్కనే ఆనుకుని వున్న జ్యోతి థియేటర్‌లోనూ విడుదలయిన రెండు కొత్త సినిమాలకి హిట్ టాక్ రావడంతో... అక్కడ ఫస్ట్ షో విడిచి పెట్టడం వలన బయటికి వస్తున్న జనం, సెకెండ్ షోకి వెళ్లడానికి వచ్చిన జనంతో అక్కడంతా కోలాహలంగా వుంది. కాంపౌండ్‌లో వున్న జనం మధ్య నించి అక్కడ పార్క్ చేసిన కారుని భానుమూర్తి డ్రైవ్ చేసుకుంటూ బైటకి రావడానికి దాదాపు పావుగంట సమయం పట్టింది. అక్కణ్ణించి భోజనం చెయ్యడానికి గ్రీన్‌పార్క్ హోటల్‌కి వెళ్లారు. అక్కడ భాను, రేఖా, మనోరమ భోజనం ముగించి మళ్లీ కారు ఎక్కడానికి మరోగంట పట్టింది. వాళ్లు తమ అపార్ట్‌మెంట్స్‌కి చేరుకునేసరికి రాత్రి పదిన్నరయింది. తమ ఫ్లాట్‌లోకి అడుగు పెట్టేసరికి మాధవరావు సోఫా చైర్‌లో నిద్రపోతూ కనిపించాడు.

తలుపు బార్లా తెరిచివుంది. బాబు మాత్రం కనబడ్డం లేదు!

'బాబు ఏడీ?' అనే విషయం గురించే ఆ ముగ్గురూ ఆలోచించారు.

భానుమూర్తి తండ్రి భుజంమీద చెయ్యేసి గట్టిగా కుదిపితే అతను తుళ్లిపడి లేచి నిలబడ్డాడు.

"బాబేడి?" దబాయించి అడిగాడు భానుమూర్తి.

"ఇక్కడ లేడా?" అంటూ హాల్లో కలియజూసాడు.

"ఇక్కడుంటే మిమ్మల్నెందుకు అడుగుతాం? మీరు వాణ్ణి వదిలేసి మీ మటుకు మీరు గుర్రుపెట్టి నిద్రపోవడమేంటి?" అంటూ రేఖ టీపాయ్ మీదున్న పాలసీసా తీసి చూసింది. ఇందాక ఎలావుందో, యిప్పుడూ అలాగే వుంది సీసా.

"ఎలా యిచ్చిన సీసా అలాగే వుందేంటి? ఆలస్యం అయింది కాబట్టి, పాలు చాలక ఎంత ఏడుస్తున్నాడోనని టెన్షన్ పడుతూ వచ్చాం. తీరా చూస్తే బాబే కనబడ్డంలేదు. చెప్పండి.. బాబునేం చేసారు?" గదమాయించింది మనోరమ.

మాధవరావుకి ఏం చెప్పాలో అర్థంకాక గబగబా వరండాలోకి వెళ్లాడు. మిగతా వారూ అతన్ని అనుసరించారు.

"శంకూ! శంకూ!" అని అరుస్తూ కొంతమంది కుడివైపు, కొంతమంది ఎడమవైపు వెళ్లారు. రెండు మూడు ఫ్లాట్స్ వాళ్ల కాలింగ్ బెల్ కొట్టి పిలిచి మరీ అడిగారు.

"మాకు తెలీదండి.. మేం చూళ్లేదు" అన్నారు వాళ్లు.

మళ్లీ అందరూ కలసి మాధవరావునే నిలదీసారు. "ఏంచేసారో చెప్పండి నా బిడ్డని. వాడుంటే, వాడికోసమే పనిచెయ్యాలని వాణ్ణి చంపేసారా? మీ జులాయి తిరుగుళ్లకి అడ్డొస్తాడని వాణ్ణి తీసుకెళ్లి ఏ నూతిలోనో గోతిలోనో పడేసారా? చెప్పండి" రేఖ, భానుమూర్తి పదేపదే అడుగుతుంటే మాధవరావు నేరగాడిలా చూడ్డం తప్ప, ఏమీ మాట్లాడలేకపోతున్నాడు.

బిగ్గరగా కారిడార్‌నించి వినిపిస్తున్న కేకలకి కొంతమంది తలుపులు తీసుకుని బైటకి వచ్చి విషయం అడిగి తెలుసుకున్నారు. "చంటిపాపని కంటిపాపలా చూస్కోవాలి కదండీ?" పాపారావు అనే ఒకాయన సలహాయిస్తుంటే, అతని భార్యే అతన్ని దబాయించింది. "కావాలని ఎవరైనా వదిలేస్తారా? ఏదో పొరపాటు జరిగిపోయింది. నాలుగు ఫ్లాట్లూ వెదికితే,

ఎక్కడో ఓ చోట కనబడతాడు"

"వెదికామండి.. వెదికాం. కానీ ఎక్కడా ఏ ఫ్లాట్‌లోనూ కనిపించలేదు" అంది రేఖ.

"పోలీస్ రిపోర్ట్ యిద్దామా?" అంది మనోరమ.

పోలీసులనే మాట వినగానే మాధవ రావు మనసు కాస్త వణికింది.

"పోలీసులెందుకులెండి" ఒకాయన అన్నాడు.

"పోలీసుల్ని రంగంలోకి దింపకపోతే, మా శంకుగాణ్ణి ఎవరు వెదుకుతారు? ఎవరు వాణ్ణి ఎత్తుకుపోయారో, ఎవరికీ యన అప్పజెప్పేసి చేతులు దులుపుకు న్నాడో తెలుసుకోవలసింది పోలీసులే కదా?" అంటూ మనోరమ తన సెల్ ఫోన్ తీసి పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేయబో తుండగా రెండో అంతస్తునించి హరినారా యణ అనే రిటైర్డ్ బ్యాంక్ మేనేజరు రేఖ కొడుకుని ఎత్తుకుని దిగాడు.

బాబు అతని భుజంమీద నిద్రపోతు న్నాడు. అతనివెంట జోగినాథం కూడా వచ్చాడు. బాబుని చూడగానే రేఖా, భానూల కళ్లు మెరిసాయి.

"బాబు మీ ఫ్లోర్‌కి వచ్చేసాడా?" అంటూ రేఖ అతని భుజం మీద నిద్రపో తున్న బాబుని తన భుజంమీదకి మార్చు కుంది.

హరినారాయణ అందర్నీ ఓసారి చూసి చెప్పాడు "మా ఫ్లోర్‌లోకి రాలేదండి. సాయంత్రం ఏడు గంటలప్పుడు నేను కిందకి వచ్చాను. లిఫ్ట్‌లో వద్దామంటే, ఎవరో లిఫ్ట్‌కి డోర్స్ వెయ్యకుండా అజాగ్ర త్తగా వదిలేసారు. నేను దిగొచ్చి లిఫ్ట్ తలు పులు మూద్దామని ట్రై చేస్తే లిఫ్ట్‌లో బాబు కనిపించాడు. బహుశా పాక్కుంటూ వచ్చేసి అందులో కూర్చున్నట్టున్నాడు. నేను వెంటనే బాబుని ఎత్తుకుని లిఫ్ట్ డోర్స్‌వేసి కారిడార్ అంతా వెదికాను. ఎందుకంటే యీ బాబెవరో నాకు తెలీదు. కారిడార్‌లో ఎవరూ తిరగడం లేదు"

ఆ మాట దగ్గర్నించి జోగినాథం చెప్ప నారంభించాడు "అదే టైములో నారదుడి లా నేను కనిపించాను. ఈ అపార్ట్‌మెంట్స్ లోని ఆడాళ్లంతా ఎవరి భార్యలో, ఎవరి పిల్లలు ఎవరో.. తెలిసిన వాణ్ణి నేనొక్కణ్ణే కాబట్టి, యీ బాబుని చూసీ చూడగానే మీ బాబేనని గుర్తు పట్టేసాను. నేనూ, నారా యణ గారూ కలసి మీ ఫ్లాట్‌లోకొచ్చాం. లోపల టీవీ రన్ అవుతోంది. లైట్లు వెలు గుతున్నాయి. కానీ మాధవరావుగారు మాత్రం కూర్చున్న సోఫాలోనే గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. మిమ్మల్నీ, భానుమూర్తి గార్ని రెండుసార్లు పిలిచాం. కానీ ఎవరూ పలకలేదు. మీరు షాపింగ్‌కో, సినిమాకో వెళ్లారనుకున్నాను. మాధవరావుగార్ని లేపి, డిస్టర్బ్ చెయ్యడం యిష్టంలేక బాబుని మీరు వచ్చేదాకా నారాయణ గారింట్లో వుంచుతానంటే సరేనన్నాను. ఓసారి ఏడిస్తే వాళ్లావిడ పాలు కలిపి పట్టిందట. ఆ తర్వాత కాస్సేపు పడుకున్నాడు. పాపం ఈయనకీ కునుకుపట్టేసింది. మీరు కారులో రావడం గమనించాక, నేనే నిద్ర లేపి, తీసుకొచ్చేసాను. ఎహ్హెహ్హెహ్హె"

జోగినాథం విషయాన్ని ఇంతగా సాగ దీసి చెప్పడం అందరికీ చిరాకు తెప్పిం చినా, అతని మీద చిరాకు పడ్డానికది సరైన సమయంకాదని తమాయించుకుంది మనోరమ. హరినారాయణ మళ్లీ మెట్లెక్కి తన అంతస్తుకి వెళ్లిపోయాడు. రేఖ తది తరులు తమ ఫ్లాట్‌లోకి వెళ్లబోతుంటే, జోగినాథం వారిని వెళ్లనివ్వకుండా తన మాటల్తో ఆపి, అదే విషయాన్ని యింకా కొనసాగించి, మాధవరావు చేసిన చిన్న పొరపాటుని తీసుకెళ్లి భూతద్దంకింద పెట్టాడు. "సాధారణంగా గొప్పింటి వారి

పిల్లల్ని దొంగలు కిడ్నాప్ చేసి లక్షలకి లక్షలు గుంజుకునేవారు. కానీ యీ మధ్య సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు, స్టేట్ గవర్నమెంట్లో పెద్దపెద్ద పోస్టుల్లో ఉంటూ బాగా సం పాయిస్తున్న వారి పిల్లల్ని కిడ్నాప్ చేసి, లక్షల్లో డబ్బులు డిమాండ్ చేస్తున్నారు. అలాంటప్పుడు మన భానుమూర్తిగారు కూడా క్లాస్‌వన్ గవర్నమెంట్ ఆఫీసరు కదా! అంచేత అతని కొడుకుని కూడా దొంగలు కిడ్నాప్ చేస్తారన్న జ్ఞానం మన కుండాలి కదా! ఉన్నప్పుడు మన మట్టుకు మనం పడుకుండిపోతే ఎలాగండి? "

"ఇప్పుడు కిడ్నాప్‌లు, మర్డర్లూ అవీ జరిగి పోలేదు కదా! ఇప్పుడా గోల ఎందుకు? " ఒకావిడ చిరాగ్గా మాట్లాడి, గట్టిగా ఆవులిం చింది.

జోగినాథం వూరుకోకుండా "జరిగిపో లేదు కదాని ధీమాగా ఉంటే ఎలాగండి? మొన్న యీ వూళ్లోనే ఓ గవర్నమెంట్ ఆఫీసరు లక్షలకి లక్షలు లంచాలు పట్టేసి అనేక రకాల ఆస్తులు సంపాదించేసాడు. అతనికి చూస్తే ఒంటి అగ్గిపుల్లలాగ ఒక్కడే కొడుకు. వాళ్లుండే అపార్ట్‌మెంట్స్ లోకి పట్టపగలే యిద్దరు దొంగలు అమా యక చక్రవర్తుల్లా వచ్చి, వాళ్లబ్బాయిని చడీచప్పుడు కాకుండా ఎత్తుకుపోయారు. ఆ ఆఫీసరుకి ఫోన్‌కొట్టి అరవై లక్షలిస్తే తప్ప కుర్రాణ్ణి ప్రాణాలతో వదిలిపెట్టమని చెప్పారు. అతని సంపాదనలోనించి ఓ అరవై లక్షలు తీసేస్తే... నదిలోనించి ఓ గ్లాసుడు నీళ్లు తీసినట్టే అవుతుంది. అయినా, ఆయనగారు డబ్బు యివ్వడానికి ఒప్పుకోకుండా పోలీస్ కంప్లయింట్ ఇచ్చాడు. పోలీసులెప్పుడైతే, రంగంలోకి దిగారో ఆ క్షణంలోనే ఆ కిడ్నాపర్లు ఆ కుర్రాణ్ణి చంపేసి ఓ కాలవలో పారేసారు. ఇప్పుడు మతిపోయిన మనిషిలాగ లబోదిబోమంటూ గుండెలు బాదుకుంటున్నాడు. ఏతావాతా చెప్పడమేటంటే.." ఇంకా




క్రైం కథా రచయిత్రి అగాథా క్రిస్టీ వేడినీళ్ల స్నానపు తొట్టిలో పడుకుని ఆపిల్స్ తింటూ రాసేదట! అందుకు వీలుగా ప్రత్యేకంగా పెద్ద స్నానాల గదిని కట్టించుకుందటామె!

★ ట్రుమన్ కాపోట్ రచన ముందుకు సాగా లంటే ఆయన చేతిలో వైన్ తప్పకుండా ఉండా ల్సిందేనట!

చెప్పుకుంటూ పోతున్నాడు.

అప్పటికే చాలా రాత్రయింది. 'కనబడలే దనుకున్న కుర్రాడు కనిపించాడు. ఇంకా యీ జోగినాథంగాడి వుపన్యాసాలేంటి? ' అని మనసులో అనుకుంటూనే ఎవరిదా రిన వారు వెళ్లిపోయారు. మాధవరావు, కుటుంబసభ్యులు తమ ఫ్లాట్‌లోకి వెళ్లారు. రేఖ తన భర్తతోపాటు తన గదిలోకి వెళ్తూ మామగారితో "మేం హోటల్లో భోంచేసే వచ్చాం.. మీకేం తీసుకురాలేదు. మధ్యాహ్నం వండిన అన్నం, కూరలూ అవీ వున్నాయి. వాటితో కానివ్వండి" అన్చెప్పి వెళ్లిపోయింది.

మాధవరావు తన మనవడి విషయంలో కొంత పొరపాటు చెయ్యడంవలన ఎదిరించి మాట్లాడే హక్కుని కోల్పోయాడు. అంచేత ఏమీ మాట్లాడకుండా గిన్నెలో వున్న అన్నం, కూర వడ్డించుకుని, చారు కలుపుకుని ఓ ముద్ద నోట్లో పెట్టుకున్నాడు. కానీ... ఏమీ రుచించకపోవడం వలన లేచి, చేతులు కడిగేసుకున్నాడు. ఫ్రిజ్‌లో ఏవైనా పళ్లున్నాయేమోనని దాన్ని తెరచిచూసాడు. కానీ, మంచి నీటి సీసాలు తప్ప మరేమీ కనబడలేదు. నిట్టూర్చి, ఓ సీసాలోని నీళ్లు గడగడమని తాగి, తన రూమ్‌లోకి వెళ్లి మంచంమీద వాలాడు.

ఈ జీవన నాటకంలో.. సంసారం అనే

సీన్‌లో తన పాత్ర నడక రేపట్నించీ ఎలా వుంటుందో తన యథాశక్తి వూహించు కుంటూ.. ఓ గంట దాటాక మెల్లగా నిద్ర లోకి జారాడు.




ఆ వారంలోనే ఓ రోజు.. మాధవరావు పనిచేసే ఆఫీసులోనే అటెండర్‌గా పనిచేసే సిద్ధప్ప తన స్కూటర్ మీద వచ్చి, స్టాండ్ వేసి డిక్కీలోనించి ఓ ప్యాకెట్ తీసాడు. అది ఒకప్పుడు మాధవరావు కష్టపడి సేక రించిన వెరైటీ వెడ్డింగ్ కార్డుల ప్యాకెట్. దాన్ని మాధవరావుకి యిచ్చెయ్యడానికి వచ్చాడు. మాధవరావుండే ఫ్లాట్‌లోకొచ్చి అతనికి నమస్కరించాడు.

"ఏం సిద్ధప్పా బాగున్నావా? కూర్చో.. ఎలా వుంది మన ఆఫీసు? " అంటూ ఆనందంగా ప్రశ్నిస్తూ కూర్చోడానికి తటప టాయిస్తున్న సిద్ధప్పని బలవంతంగా సోఫాలో కూర్చోబెట్టాడు.

ఆ సమయంలో డైనింగ్ టేబుల్ దగ్గర భానుమూర్తి, రేఖ, మనోరమ టిఫిన్ తింటున్నారు. సిద్ధప్ప ముఖంలో సంతోషం వెదికితే తప్ప కనబడ్డంలేదు.

"ఆఫీసంతా బాగానే ఉందండి"

"అడగడం మర్చిపోయాను.. మీ అమ్మాయి పెళ్లికి నేను రాలేకపోయాను. పెళ్లి సవ్యంగా జరిగిందా? అమ్మాయి అత్త వారింటికి వెళ్లిపోయిందా? " మాధవరావు ప్రశ్నమీద ప్రశ్న అడుగుతున్నా, సిద్ధప్ప నేలచూపులు చూస్తున్నాడే తప్ప సమా ధానం చెప్పడం లేదు. మాధవరావు వంట గది దగ్గరికెళ్లి వీరమ్మతో 'కాఫీ పెట్టు' అని చెప్పాడు. సిద్ధప్ప వద్దు వద్దని చెప్తున్నా, ఓ కప్పు కాఫీ అందించాడు. టిఫిన్ తింటున్న భానుమూర్తి చెయ్యి కడుక్కుని అక్కడకి వచ్చి ఏ ఆవేశం లేకుండానే అడి గాడు "ఎవరండీ? " అని.

సిద్ధప్ప తన చేతిలోని కాఫీ కప్పుని టీపాయ్ మీద పెట్టి, భానుమూర్తికి రెండు చేతుల్తో నమస్కరించి చెప్పాడు "నన్ను సిద్ధప్పంటారు బాబూ! నాన్నగారి ఆఫీసులోనే అటెండర్‌గా పనిచేస్తున్నాను"

"అటెండరా? ఏం పనిమీదొచ్చావు? "

"మరేం లేదండి.. నాన్నగారు మీ పెళ్లి సందర్భంగా వేయించడానికి చాలారకాల శుభలేఖల్ని సేకరించారట. అవి ఆయనకి ఉపయోగపడలేదట, అంచేత మా అమ్మాయి పెళ్లికి అయినా ఏదో ఓ కార్డ్ వేయించుకోమని నాకిచ్చారు"

"నా పెళ్లికి ఎందుకు ఉపయోగపడలేద న్నారు? " తన్నుకొస్తున్న ఆవేశాన్ని తమా యించుకుంటూ అడిగాడు భాను.

"వివరాలు చెప్పలేదండి, ఉపయోగపడ లేదని మాత్రమే చెప్పారు! నా కూతురికి పెళ్లి చేద్దామనుకుంటున్నప్పుడు, ఇందులో బెస్ట్ కార్డ్ ఒకటి వేయించమని చెప్పి, ఈ కార్డులిచ్చారు. కానీ, నాకూ ఉపయోగపడ లేదు"

"ఏం? ఎందుకు ఉపయోగపడలేదు? "

సిద్ధప్ప తలదించుకున్నాడు. భాను మళ్లీ రెట్టించి అడిగితే, నేలచూపులు చూస్తూ గొణిగాడు "ఆ పెళ్లి జరగలేదండి, పెళ్లి పదిరోజులుందనగా, మా అమ్మాయి ప్రేమించిన అబ్బాయితో వెళ్లిపోయింది. ఈ కార్డులు నాకెలాగూ ఉపయోగపడ లేదు. కనీసం మరెవరికైనా ఇస్తారు

కదాని అప్పుడే ఇచ్చేద్దామనుకున్నాను. కానీ నాకు వీలుపడలేదు"

మాధవరావు జాలిపడుతూ "ఆ పెళ్లి ఆగిపోయినందుకు నువ్వేం బాధపడకు. అందరి తల్లిదండ్రులకి పిల్లల పెళ్లిళ్లు చేసే అదృష్టాన్ని రాయడా భగవంతుడు" అన్నాడు.

భానుమూర్తి ఇప్పుడు తన మాటని ఆవేశంతో కలగలిపి వినిపించాడు "నువ్వు వెడ్డింగ్‌కార్డ్స్‌ని నా పెళ్లికోసం సేకరించడ వేంటి? నీకు శుభలేఖ వేసే అవకాశం ఇవ్వలేదని ప్రతీ క్లాస్‌ఫోర్ మనిషితోనూ చెప్పడవేంటి? "

"నేనితనికేం చెప్పలేదురా" మాధవరావు ఆత్రంగా అన్నాడు.

"నువ్వు చెప్పలేదంటే మాత్రం నేను నమ్మేస్తానా? పిల్లల పెళ్లిళ్లు చేసే బాధ్యతిప్పుడు అదృష్టాల జాబితాలోకి చేరిపోయిందని మా పెళ్లి గురించి మా ముందు, మా అత్తగారి ముందే చెప్పినవాడివి, మేం లేనప్పుడు ఈ క్లాస్‌ఫోర్ అటెండర్‌తో ఎందుకు చెప్పివుండవు? వినేవాడుంటే చాలు, నువ్వు వినిపించేదంతా మా గురించి చెడు విషయాల్నే! నువ్వో గురివిందగింజలా తయారయ్యావు. నీ కిందనున్న నలుపుని చూసుకోకుండా చుట్టూఉన్న ఎరుపుని చూసి మురిసిపోతున్నావు. నా గురించి చెప్పినట్టుగా, నీ బలాదూర్ తిరుగుళ్ల గురించి చెప్పేవా? చెప్పవు! అయినా, నువ్వు అడ్డమైన క్లాస్‌ఫోర్ మనుషుల్ని ఇంటికి పిలిచి, సోఫాలమీద కూర్చోబెట్టి కాఫీలివ్వడానికి ఇది ఎవరిల్లు అనుకున్నావు? ఓ క్లాస్‌వన్ గవర్నమెంట్ ఆఫీసరు ఇల్లు. ఎవరి హద్దుల్లో వారుండడం మంచిది"

కొడుకు మాటలకి సమాధానం చెప్పడానికి వంద మాటలు వెయ్యి పడగలతో బుసకొడుతున్నా మాధవరావు తమాయించుకున్నాడు. వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ సిద్ధప్ప నమస్కారం చేసి బైటికి వెళ్లిపోయాడు. మాధవరావు శుభలేఖల్ని పట్టుకుని గబగబా వంటగదిలోకి వెళ్లి స్టవ్ మీదున్న పాత్రని దించేసి, ఆ స్టవ్ మంటల్లో శుభలేఖల్ని కాల్చివేసాడు. వంట మనిషి వీరమ్మకి కళ్లలో నీళ్లు తిరిగాయి.

★ ★ ★

భానుమూర్తి చేస్తున్న ఉద్యోగం ఓ కామధేనువు లాంటిది. ప్రజలకి ఎంతో చేరువగా ఉంటూ, ఎన్నో అవసరాల కోసం వచ్చే డిపార్ట్‌మెంట్ కాబట్టి, సంపాదించుకున్న వాడికి సంపాదించుకున్నంత డబ్బు వస్తోంది. ఆ ఆఫీసులో పని జరగాలంటే లంచాలివ్వక తప్పదనే విషయం టీవీల ద్వారా ప్రచారంలోకి వచ్చేసింది కూడా. అక్కడ పనిచేసేవారు లంచాల కోసమే పనిచేస్తారు తప్ప, జీతాల కోసం ఎవరూ పనిచేయరు. అక్కడ ఫలానావాడు లంచం తీసుకుంటున్నాడని ఫిర్యాదు చేద్దామన్నా ఆ పని జరగదు. ఎందుకంటే, అటెండర్ దగ్గర్నించి, చీఫ్ ఆఫీసరు వరకూ లంచాలు తీసుకుంటారు. ఎటొచ్చీ తీసుకునే డబ్బులోనే తేడా ఉంటుంది. భానుమూర్తి లాంటివాణ్ణి అనుకోకుండా ఆ కల్పవృక్షం మీద కూర్చోబెట్టేసరికి అతనికి రెండు చేతులా సంపాదించే పని తగిలింది.

## కొత్తగాలి...

**జిత్తులమారి**
**నక్కే..**
**నరుణ్ని చూసి**
**అవాక్కయింది!**

– ఎ. వెంకటేశ్వర్లు,
ముల్కలపల్లి, వరంగల్ జిల్లా

కొంతమంది కాంట్రాక్టర్లు, రియల్ ఎ స్టేట్ వ్యాపారస్థులు ఇంటికి వచ్చి కూడా భానూతో మాట్లాడుతున్నారు. కొన్నిసార్లు కొంతమంది, అతను లేని సమయంలో వచ్చి రేఖతోనూ, మనోరమతోనూ మాట్లాడి డబ్బు సమర్పిస్తున్నారు. అలాం టప్పుడు మాధవరావుని ఫ్లాట్ నించి కాస్సేపు బైటకి పంపించేసి, తలుపు గడియపెట్టి వ్యవహారాల్ని చక్కబెడుతు న్నారు.

జోగినాథానికి తలుపుల దగ్గర నిలబడి లోపల జరిగే మాటలు వినడం అలవాటు కాబట్టి అతన్ని అలాంటి సమయాల్లో తలు పుల దగ్గర తచ్చాడకుండా చూసే బాధ్యత కూడా మాధవరావుకే అప్పగించారు.

## కొత్తగాలి...

**తనువు చుట్టూ ఉన్న కొలతలు**
**ఎవ్వడైనా కొలవగలడోయ్**
**మనసు కొలతలు కొలవగలిగే**
**మొనగాడు ఎవ్వడోయ్?**

– అయినాల కనకరత్నాచారి,
కారిశపాడు, ప్రకాశం జిల్లా

ప్రభుత్వంలో పనిచేస్తూ లంచాలు తీసు కుంటున్న చాలామంది ఉద్యోగుల్ని అవి నీతి నిరోధకశాఖవారు రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకుంటున్నారని టీవీ, స్క్రోలింగ్ న్యూస్‌లో చూపిస్తున్నారు. అది చూసి మాధవరావు భయపడ్డాడు. తనని ఫ్లాట్ బయట నిలబెట్టి లోపల లంచాలు తీసు కుంటున్నాడు భానుమూర్తి. ఒకవేళ, అతనూ ఏసీబీవాళ్లకి దొరికిపోయి, ఉద్యోగం పోగొట్టుకున్నా.. జైలుకి వెళ్లినా.. తను సంవత్సరాల తరబడి పడిన కష్ట మంతా వృథా అయిపోతుంది. అందుకే ఓరోజు ఏవో ఫైల్స్ పట్టుకొచ్చిన ఓ క్లాస్ త్రీ ఉద్యోగిని బయట కాంపౌండ్‌లో ఆపి మాట్లాడాడు. "మా అబ్బాయికేం ఫర్వా లేదు కదా?" అని అడిగాడు. ఆ వ్యక్తి పేరు వెంకట్రాజు. అతనే భానుమూర్తికి పర్సనల్ అసిస్టెంటు.

అతను మాధవరావుని గత శతాబ్దానికి చెందిన మనిషిలా అమాయకంగా చూసి "చూడండి సార్! మీ సందేహం నాకు అర్థ మయింది. లంచం తీసుకుంటున్న ఫలానా వ్యక్తిని ఏసీబీవాళ్లు రెడ్ హ్యాండెడ్‌గా పట్టు కున్నారన్న స్క్రోలింగ్ న్యూస్ చూసి మీరు మీ అబ్బాయి గురించి భయపడుతున్నట్టు న్నారు. కానీ, అలా దొరికిపోయిన వాళ్లు ఆ కేసు నుంచి బయటపడి మళ్లీ ఉద్యో గంలో జాయిన్ అయిపోయారన్న విష యాన్ని మళ్లీ టీవీవాళ్లు న్యూస్‌లో చూపిం చరు. ఎందుకంటే, అలాంటి నేరగాళ్లు రోజు రోజుకీ పెరిగిపోతున్నారు. టీవీల్లో దొరికిపోయిన నేరగాళ్ల గురించి న్యూస్ చూపిస్తున్నారు. వాళ్లని చూసి మిగతా వాళ్లకి భయం కలుగుతుందంటారా? లేదు. ఒకవేళ తాము దొరికిపోయినా మళ్లీ బైటకి వచ్చేయొచ్చన్న నమ్మకం కలు గుతోంది. గతంలో ఎవడైనా లంచం తీసు కుంటూ దొరికిపోతే, ఇంక వాడి చాప్టర్ క్లోజ్ అయిపోయినట్టే అనుకునేవారు. వాడు మళ్లీ ఉద్యోగంలోకి రావడం అసాధ్యం అనుకునేవారుకదా?"

"అవును, అలాంటి వాడికి రావల్సిన గ్రా చ్యుటీ, పెన్షన్లు కూడా వచ్చేవి కావు" అన్నాడు మాధవరావు.

"పూర్వం అసాధ్యాలని సాధ్యం చేసెయ్య డానికి ఆకాశంనుంచి దేవుళ్లూ దేవతలు దిగొచ్చేవారట. కానీ ఇప్పుడు వాళ్ళెవరూ దిగిరానక్కర్లేదండి. డబ్బు అనే పదార్థం రంగంలోకి దిగితే చాలు. ముల్లుని ముల్లు తోనే తియ్యాలన్నట్టుగా, లంచం తీసు

కుంటూ దొరికిపోయినవాడు.. మళ్లీ లంచం కట్టి ఉద్యోగంలోకి వచ్చేస్తున్నాడు! ఇది అందరికీ తెలిసిపోయిన ఓపెన్ సీక్రెట్టేనండి" అన్నాడు వెంకట్రాజు.

ఆ మాటలు మాధవరావుకు ధైర్యం కలిగించలేదు. "కాలం ఎప్పుడూ ఒక్కలాగే ఉండిపోదు కదండీ" అన్నాడు.

వెంకట్రాజు చిన్నగా నవ్వి "మునుపు చిన్నవాడు లంచం అడిగితే, పైనున్న పెద్దవాడికి ఫిర్యాదు చేసేవారు. కానీ ఇప్పుడు చిన్నాడూ తింటున్నాడు, పెద్దాడూ తింటున్నాడు. ఇకమీదట ఇదే కొనసాగుతుంది. ఏమైనా మీ పాతతరం వారికి ఆశ తక్కువే... ధైర్యమూ తక్కువే! మా తాతగారి కాలంలో బస్తా బియ్యం ఎనిమిది రూపాయలట... ఇప్పుడు ఎనిమిది రూపాయలకి ఓ ప్లేట్ ఇడ్లీ కూడా రావడంలేదు. అంచేత పాతకాలానికి మీరు కరెక్ట్! కొత్త కాలానికి మేం కరెక్ట్" అనేసి వెంకట్రాజు స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు.

అతను కాలజ్ఞానం గురించి ఎంత చెప్పినా, ఆ మాటలవల్ల మాధవరావు భయం పెరిగిందే గానీ, తగ్గలేదు. తన కొడుక్కి చెప్తే అతను మనసు మార్చుకుంటాడేమో అనుకున్నాడు. కానీ, ప్రస్తుతం సంసారంలో రగులుతున్న సంక్షోభం అతన్ని వెనక్కిలాగింది.

★ ★ ★

విశ్వవిజేత కావాలనుకున్న మాంత్రికుడు శక్తిని ఆరాధించడంతో ఆగిపోకుండా, చుట్టూ ఉన్న పిశాచాలని కూడా సంతృప్తి పరచాలి. ఈ మాట ఎక్కడో గుహల్లో ఉంటూ భూతప్రేతాత్మల్ని ఉపాసన చేసే మాంత్రికులకే కాదు... ప్రభుత్వంలో గొప్ప గొప్ప పదవులు నిర్వహిస్తూ గొప్ప గొప్ప లంచాలు తీసుకుంటున్న ఆఫీసర్లకీ వర్తిస్తుంది.

భానుమూర్తి పనిచేసే ఆఫీసులో పార్టీల నుంచి లంచాలు తీసుకుంటున్న వ్యక్తి అతనొక్కడే కాదు. ఒకరిద్దరు తప్ప అందరూ లంచావతారాలేనన్న విషయం అందరికీ తెలుసు.

దుర్మార్గంలో కూడా క్రమశిక్షణ ఉంటే కలకాలం దుర్మార్గాన్ని కొనసాగించవచ్చని కొంతమంది దుర్మార్గ పండితులు చెపుతుంటారు. అలాంటివారు అవినీతి మార్గంలో వచ్చిన డబ్బుని వాళ్లు తీసుకుంటూ, ఆఫీసులోని సహచరులక్కూడా కొంత విదిలిస్తారు. అలా చెయ్యడంవల్ల వాళ్లకి అంతఃపుర శత్రువులు ఉండరు. పరమేశ్వరుడి ప్రోగ్రాం నందీశ్వరుడికి తెలిసినంతగా మిగతా ప్రమథ గణాలకి తెలీదంటారు. అలాగే భానుమూర్తి లంచాల విషయం అతని పి.ఎ. వెంకట్రాజుకే బాగా తెలుసు. డబ్బు ఎంతివ్వాలి? ఎక్కడివ్వాలి? లాంటి విషయాల్ని అతనే నిర్వహిస్తాడు.

భానుమూర్తి ఉంటున్నది అపార్ట్‌మెంట్స్‌లో కాబట్టి, అక్కడికి డబ్బు పట్టుకుని రావడం 'రిస్క్'తో కూడుకున్న వ్యవహారమని ఓ రోజు వెంకట్రాజు భానుతో చర్చిస్తూ "మీ నాన్నగారు కూడా మీకేదో ప్రమాదం కలుగుతుందని భయపడుతున్నారు. అపార్ట్‌మెంట్స్‌లో చాలామంది ఉంటారు. వాళ్లకోసం ఎంతోమంది వచ్చిపోతుంటారు. మనం మరోచోట ఓ గెస్ట్ హౌసులాంటిది తీసుకుంటే బెటరు" అన్నాడు. కొన్నాళ్లుగా భానుమూర్తీ ఇలాగే అనుకుంటున్నాడు. కొన్నిసార్లు వచ్చిన వ్యక్తులతో కాక్‌టైల్ పార్టీలు తీసుకోవాలి కాబట్టి, అవన్నీ ఇంట్లో చెయ్యటానికి ఇబ్బంది పడుతున్నాడు. అందుకే వెంటనే కాలింగ్ బెల్ కొట్టి తన అటెండర్ వీరేంద్రని పిలిచాడు. అతని అసలు పేరు వీరయ్య. కానీ షోగ్గా వుండటానికి 'వీరేంద్ర'గా మార్చుకున్నాడు.

రాష్ట్ర ప్రభుత్వంలో ఎవరో కొంతమంది

బతకడం తెలీనివాళ్లు తప్ప మిగతావాళ్లంతా ముడుపులు తీసుకునే వాళ్లే! వాళ్లలో ఏ ఒక్క ఆఫీసరు దగ్గర అటెండరుగా కుదిరినా, నీకు రెండు చేతులా ఆదాయం వచ్చి పడుతుందని ఎవరో చెప్పగా విని, తన శక్తికి మించిన లంచం ఇచ్చి మరీ ఆ ఉద్యోగంలోకి వచ్చి భానుమూర్తి దగ్గర అటెండరుగా కుదిరాడు. కానీ, ఉద్యోగంలో జాయినై ఇన్నేళ్లయినా, అతనికి రాలిన డబ్బులంటూ ఏవీ లేవు. భానూ ఎంతో కొంత ఇచ్చేది వెంకట్రాజుకే! వీరేంద్రకు మాత్రం ఏనాడూ తన చేత్తో ఓ వంద రూపాయలు ఇవ్వలేదు.

ఆ వెలితి వీరేంద్ర మనసులో ముల్లులా దిగబడింది!

అప్పటినుంచి భానూ బెల్ కొడితే వెళ్తున్నాడు. అతను చెప్పిన పని చేస్తున్నాడు. వెళ్లిపోతున్నాడు. అంతే!

"రేయ్ వీరయ్యా, నువ్వుండేది మర్రిపాలెం ఏరియాలో కదా. వెంటనే ఆ ఏరియాలో నాకో గెస్ట్‌హౌస్ చూడు. అద్దె ఎంతయినా ఫరవాలేదు. కానీ, ఆ గెస్ట్‌హౌస్ జనసంచారం ఎక్కువగా లేనిచోట ఉంటే బావుంటుంది. నా దగ్గరకొచ్చే పార్టీలతో నేను డ్రింక్ పార్టీలు చేసుకోవడం, డీల్ కుదుర్చుకోవడం అంతా ఇక మీదట అక్కడే జరుగుతుంది. నువ్వు అర్జెంటుగా కుదర్చాలి.. చెప్పు.. ఎప్పుడు కుదురుస్తావు? " అని భానూ అడిగాడు.

"రోజూ ఆఫీసు నుంచి ఇంటికెళ్లేసరికే ఎనిమిది గంటలు దాటుతోంది. ఇంకెప్పుడు వెదుకుతాను? కొంచెం టైము పడుతుంది సార్" వీరయ్య తన ముఖంలో గానీ, గొంతులోగానీ ఎలాంటి భావమూ ధ్వనింపజేయకుండా చెప్పాడు.

రెండురోజులపాటు అనధికారంగా వీరయ్యకి శెలవు ఇచ్చి గెస్ట్‌హౌస్ చూడమన్నాడు. మూడో రోజుకల్లా వీరయ్య గెస్ట్‌హౌస్ కుదుర్చుకొచ్చాడు. అప్పట్నుంచి, భానుమూర్తి వ్యవహారాలన్నీ ఆ గెస్ట్‌హౌసులోనే జరుగుతున్నాయి. ఓరోజు వీరయ్య భాను దగ్గర చెప్పలేని మాటని వెంకట్రాజుతో చెప్పాడు. "నేను కూడా ఈ చెట్టులోని కొమ్మనే, నేను ఈ పులుసులోని ముక్కనే కాబట్టి.. నాకూ ఏదైనా కాస్త చిల్లర పారేస్తే బాగుంటుందేమో కొంచెం ఆలోచించండి సార్" అన్నాడు.

వెంకట్రాజు అతన్నో చిన్న పురుగుని చూసినట్టు చూసి "ఈ సంగతి ఆఫీసర్ గారికే చెప్పొచ్చుగా" అన్నాడు.

"చెప్పే అవకాశం లేకే మీకు చెప్పుకుంటున్నాను. మీ మాటే అయ్యగారు వింటారు కాబట్టి.." ఆగాడు వీరయ్య. ఇది జరిగిన వారం తర్వాత గెస్ట్‌హౌస్‌లోకి రియల్ ఎస్టేట్ వాళ్లతో ఓ కాంట్రాక్టరు వచ్చి భానూతో ఓ డీల్ కుదుర్చుకుని డబ్బు ఇచ్చాడు. కాంట్రాక్టరు పార్టీ కూడా ఇచ్చాడు. మందు బాటిల్స్ తేవడం, బిర్యానీలు, చికెన్లు తేవడం అంతా వీరయ్యే చేసాడు. వెళ్లే ముందు ఆ కాంట్రాక్టరు వీరయ్య చేతిలో ఓ వంద రూపాయల నోటు పెట్టాడు. కానీ భానూ దాన్ని లాక్కుని కాంట్రాక్టర్‌కే ఇచ్చేసాడు.

"వద్దండి. మా వాళ్లెవరూ పార్టీలనించి టిప్పులు తీసుకోరు" అన్నాడు. వీరయ్య మనసు చివుక్కుమంది. భానుమూర్తి తనకో పైసా ఇవ్వడు. మరొకర్ని ఇవ్వనివ్వడు. లక్షల్లో లంచాలు తీసుకునే ఆఫీసరు తన అటెండర్‌కో వంద రూపాయల లాభం కలిగినా సహించలేకపోవడం చిత్రంగా కనిపించింది.

ఆ మర్నాడు భానూ తన పి.ఎ. వెంకట్రాజుకి పదిహేను వేలివ్వడం చూసాడు వీరయ్య. ఇది అతని మనసు మీదో సమ్మెటపోటు వేసింది.

ఓ రోజు భానుమూర్తి ఒక్కడే కాస్త

విశ్రాంతి తీసుకోవడానికి గెస్ట్‌హౌస్‌కి వచ్చాడు. అతని వెంట వచ్చిన వీరయ్య విస్కీ బాటిల్ వగైరాలు ఏర్పాటుచేసాక భానుమూర్తికి కాళ్లు నొక్కుతూ, వీరయ్య తన మనసులోని మాట నివేదించాడు.

"మీలాంటి పెద్దోళ్ళకి ఎప్పుడూ వెయ్యి రూపాయల నోట్లే కాదండి, అప్పుడప్పుడు అర్థరూపాయి బిళ్లలు కూడా అవసరమవుతుంటాయి కదండి! నన్నూ ఓ అర్థరూపాయి బిళ్లగా భావించి మీ జేబులో వేసుకుంటే బాగుంటాది కదా సార్"

భాను గ్లాసులోని విస్కీ సిప్ చేస్తూ "నువ్వో అర్థరూపాయి బిళ్లగాడివని భావించబట్టే కదా, నేను తాగడానికి వచ్చినప్పుడు కూడా నిన్నే తీసుకొచ్చాను" అన్నాడు.

"అది కాద్సార్.. నేను పిల్లలు గలోణ్ణి... అందులోనూ ముగ్గురూ ఆడపిల్లలే! వెంకట్రాజుగారిని మీ మనిషి అనుకున్నట్టే... నన్ను కూడా అనుకుని కాస్త చిల్లర రాలిస్తే.." గొణుగుతున్నట్టు చెపుతున్న వీరయ్యని ఆపింది మోగుతున్న భానుమూర్తి ఫోను! ఆ ఫోన్ మోగకపోతే, ఆ ఫోన్లో ఇరవై నిమిషాలు మాట్లాడకపోతే అతను వీరయ్య అడిగిన ప్రశ్నకు ఏం జవాబు చెప్పేవాడో! కానీ, అనుకోని అవాంతరం వల్ల వీరయ్యకి కావలసిన సమాధానం రాలేదు.

మరోసారి ఓ రియల్ ఎస్టేట్ వ్యాపారితో భానూ గెస్ట్‌హౌస్‌లో పార్టీ చేసుకుంటున్న సందర్భంగా, ఆ వ్యక్తి వెయ్యి నోటిచ్చి ఓ విస్కీ బాటిల్ తీసుకురమ్మని చెప్పాడు. వీరయ్య వెళ్లి బాటిల్ పట్టుకొచ్చి "నిన్నటినించీ రేట్లు పెరిగాయటండి! ఆ బాటిల్ మీద కూడా వంద పెరిగిందట" అన్చెప్పి మిగతా చిల్లరిచ్చాడు.

"రతన్‌రాజ్ షాపులోనే తెచ్చావా?" అని అడిగాడు భానూ.

"ఔన్సార్"

రతన్‌రాజ్ భానూకి బాగా తెలిసిన

# భలే భలే!

'బ్లూ ఏంజిల్'ను రచించిన ఫ్రాన్సిస్ ప్రోస్‌కు తన భర్త పంట్లాం, చొక్కా ధరిస్తేకానీ రచన సాగేది కాదట!

★ విలియమ్ ఫాక్‌నర్ ప్రతిరోజూ తన రచనా వ్యాసంగం కొనసాగడానికి విస్కీ పట్టించాల్సిందేనట! ఫాక్‌నర్ చేతులకు సాక్సులు తొడుక్కుని రచనలు కంపోజ్ చేసేవాడట!

వాడే! భానూ తన ఫోన్ తీసి షాపుకి ఫోన్‌చేసి "ఫలానా బ్రాండ్ విస్కీకి నిన్నటి నుంచి వంద రూపాయలు పెరిగిందా?" అని అడిగాడు. లేదని సమాధానం వచ్చింది. అంతే! వీరయ్యని ఫట్‌మని కొట్టి "ఇలాంటి దగాకోరుల్ని నమ్మకూడదండి" అన్చెప్పి అతని జేబులో నించి వందనోటు తీసి వ్యాపారికిచ్చాడు. ఆరోజు భానూ కొట్టిన దెబ్బ వీరయ్య చెంపమీద తగల్లేదు.. అతని 'అహం' మీద తగిలింది!

ఓ రెండురోజుల తర్వాత వీరయ్య బీచ్‌లో తన ఫ్రెండ్ కృష్ణతో మాట్లాడుతూ "మా ఆఫీసర్‌గాడి ఎవ్వారం మీద నాకు చిరాకొచ్చేసిందిరా! అమ్మ పెట్టాపెట్టదు, అడుక్కు తిననివ్వదన్న సామెత మా వెధవకి బాగా సూట్ అయిపోతుంది. ఎల్లుండో పార్టీ గెస్ట్‌హౌస్‌కొస్తున్నాది. అప్పుడు నా తడాఖా చూపిస్తాను" అంటూ కసిగా పళ్లు కొరికేడు.

"అంత పెద్దోణ్ణి నువ్వేం చెయ్యగలవు?"

"పది తలకాయలున్న రావణాసురుడు చచ్చింది రాముడొదిలిన బాణాల వల్ల కాదురా! విభీషణుడు లీకౌట్ చేసిన చావు రహస్యం వల్ల".

ఈ మాట చెప్పిన రెండ్రోజులకి గెస్ట్‌హౌస్‌లో భానూ ఓ రియల్ ఎస్టేట్ వ్యాపారి నుంచి పాతిక లక్షలు తీసుకుం

టుండగా గబగబా అవినీతి నిరోధక శాఖాధికారులు వచ్చి భానుమూర్తిని పట్టుకున్నారు. ఎవరో తమని పిలిచినట్టుగా అన్ని టీవీ ఛానల్స్ వారు వచ్చేసారు.

తనకి డబ్బిచ్చినవాడు పది లక్షల కంటే ఎక్కువ ఇవ్వలేనని వారం రోజుల నించి చెప్తూనే ఉన్నాడు. పాతిక లక్షలకి తగ్గేది లేదని భానూ భీష్మించాడు. అందువల్లే విసిగిపోయి ఏసీబీ వాళ్లకి సమాచారం ఇవ్వడం వలన తనను 'ట్రాప్' చేసి పట్టుకున్నారని భానుమూర్తి భావించాడే తప్ప.. వీరయ్య పెదవుల మీద నిశ్శబ్దంగా మెరిసిన విజయవిలాసపు మందహాసాన్ని అతను గమనించలేదు.

★ ★ ★

## కొత్తగాలి...

**జీవితం**
**క్షణభంగురం!**
**ముల్లుపై తిరిగే**
**బొంగరం!**

– కృష్ణ మాదవరపు,
కాకినాడ

భానుమూర్తి అనే ప్రభుత్వ అధికారి పాతిక లక్షలు లంచం తీసుకుంటుండగా, ఏసీబీ అధికారులకి రెడ్‌హ్యాండెడ్‌గా దొరికిపోయాడ్న వార్త అన్ని టీవీల్లోనూ స్క్రోలింగ్ న్యూస్‌గా వచ్చింది. దాన్ని అతని ఇంట్లోవాళ్లు, అపార్ట్‌మెంట్‌లో వాళ్లూ చూసారు. ఇటు మాధవరావు స్నేహితుడు రాఘవ కుటుంబీకులు చూసారు. ఏసీబీ వాళ్లకి చిక్కిన భానూ కొన్నిగంటలపాటు వాళ్ల కస్టడీలో ఉన్నాడు. తర్వాత అతను చకచకమంటూ చేసిన ఫోన్ల వల్ల, అతని పి.ఎ. టకటకమంటూ తిరిగిన తిరుగుళ్ల వల్ల భానూకి జామీను దొరికింది.

టీవీల్లో 'అమానుషత్వానికి ఆఖరి మెట్టు', 'ఘోరకలి' అంటూ దేశంలో జరుగుతున్న ఎన్నో ఉపద్రవాల గురించి విన్న ప్రజలు మర్నాటికే ఆ విషయాల్ని మర్చిపోతున్నారు. అందుకే భానూ బెయిల్ మీద బయటికి వచ్చాక తిన్నగా ఇంటికి వెళ్లకుండా మర్రిపాలెంలోని గెస్ట్‌హౌస్‌కి వెళ్లాడు. మూడు నాలుగు రోజుల పాటు తన పరిచయస్థులకి కనబడకుండా, గెస్ట్‌హౌస్‌లో ఉంటూ సెల్‌ఫోన్‌ని 'సైలెంట్ మోడ్'లో పెట్టేస్తే, అయిదోరోజు నాటికి ఈ విషయమే ఎవరికీ గుర్తుండదు. ఇదీ అతని నమ్మకం!

తన భార్య రేఖకి మాత్రం ఫోన్‌చేసి తనెక్కడున్నాడో చెప్పాడు. ఆవిడ కూడా "కరెక్టేలెండి. పెద్దపెద్ద ఘోరాల్నే మర్నాటికి మరిచిపోతున్నారు. నాలుగు రోజుల పాటు అక్కడేఉంటే, మీ సంగతి అందరూ మర్చిపోతారు" అంటూ ధైర్యం చెప్పింది. ఫ్లాట్స్‌లో ఉండేవాళ్లు నలుగురైదుగురు వచ్చి రేఖని ఈ కేసు విషయం అడిగితే, ఆమె ఏ గొడవా జరగనంత ప్రశాంతంగా చెప్పింది. "ఏసీబీవాళ్లు అరెస్టు చేసినవారంతా నేరగాళ్లు కారు. వాళ్లకేదైనా అనుమానం వస్తే పట్టుకుని విచారిస్తారు. ఈయన ఏ నేరం జెయ్యలేదు. కాబట్టే జామీను మీద వదిలేసారు. ఆయనిప్పుడు బయటే ఉన్నారు. ఆఫీసు పనులతో బిజీగా ఉండడం వల్ల గెస్ట్ హౌస్‌లో ఉంటున్నారు" అన్చెప్పి పంపించేసింది.

భానుమూర్తి అవినీతిపరుడిగా దొరికిపోయినందుకు తల్లడిల్లిపోయింది కేవలం మాధవరావు మాత్రమే! టీవీలో భానూ విషయం రాగానే జోగినాథం వచ్చి వరండాలో ఉన్న మాధవరావుని అడిగాడు. అడగ్గానే మాధవరావు గుండె కొన్ని క్షణా

లపాటు ఆగినట్టయింది. కొడుకు విష యంలో తను ఏం అనుమానిస్తున్నాడో, ఏం భయపడుతున్నాడో అదే ఇప్పుడు జరిగింది. తను ఇక్కడుంటే, తనని అడిగే వాళ్లూ, సానుభూతి చూపించేవాళ్లు ఎక్కువైపోతారని భయపడి, తన స్నేహితుడు రాఘవ ఇంటికి వెళ్లిపోయాడు. ఆ ఇంట్లో వాళ్లకి భానుమూర్తి నైజం తెలుసు కాబట్టి, అతను జైలుకి వెళ్తే మాధవరావు గుండె ఆగి చనిపోతాడని ఆందోళనపడ్డారు తప్ప, భానూ దొరికిపోయినందుకు ఆశ్చర్యపడ లేదు.

"ఈ కేసునుంచి బయటపడ్డాక ఇక మీదటయినా నిజాయితీగా బతకమని చెప్పండి. గతంలో అయితే నాకేం జరగదనే అహంకారంతో ఉండేవాడు. కాబట్టి ఎవరు ఏ మంచి చెప్పినా బుర్రకెక్కించుకునేవాడు కాదు. కానీ, ఇప్పుడు అవినీతికి వెళ్తే అసలుకే మోసం వస్తుందని తెలుసుకున్నాడు కాబట్టి, ఇలాంటి సమయంలో మీ తండ్రీ కొడుకులు నాలుగు మంచి మాటలు చెప్తే వాడిలో మార్పు రావచ్చు.." అంటూ మాధవరావు రాఘవని, అతని కొడుకు వెంకట్‌ని చాలా సేపు ప్రాధేయపడ్డాడు.

ఓ నాలుగు మంచిమాటలు చెప్పడానికి, మంచివాళ్లైన ఆ తండ్రీకొడుకుల్ని అంతలా ప్రాధేయపడనక్కర్లేదు. చెప్పడానికి వాళ్లు సిద్ధంగానే ఉన్నారు. కానీ వినడానికి భానుమూర్తి సిద్ధంగా లేడని వాళ్ళకి తెలుసు. అతను డబ్బు మనిషి, ఆ డబ్బు సంపాదించడానికి ఎవర్ని నెత్తి మీదకి ఎక్కించుకోవాలో, ఎవర్ని కాళ్లకిందేసి తొక్కాలో అతనికి బాగా తెలుసు. అలాంటి వాడికి ఎన్ని మంచిమాటలు చెప్పినా, అవన్నీ దున్నపోతుమీద కురిసిన వానే అవుతుందని తెలిసినా కూడా, మాధవరావు మాటని కాదనలేకపోయారు.

గెస్ట్‌హౌసులో కూర్చుని మందుకొడుతూ, సిగరెట్ కాలుస్తూ, టీవీలోని ప్రోగ్రామ్ చూస్తున్న భానుమూర్తి అక్కడికివచ్చిన తన తండ్రిని, రాఘవని, వెంకట్‌ని చూసి చర్రుమని లేచాడు.

"ఎందుకొచ్చారిక్కడికి? లంచాలు పుచ్చుకోవడం తప్పుబాబూ అంటూ మెస్సేజీలు ఇవ్వడానికా?" అన్నాడు.

ఆరంభంలోనే అతను అలా రెచ్చిపోయి మాట్లాడేసరికి రాఘవకి ఏం చెప్పాలో అర్థంకాక "అదికాదు భానూ, అత్యాశ ఎప్పుడూ అపాయాలకే దారితీస్తుంది.." అంటుండగానే భానూ అలాంటి మాటలు తనకి వినడంకూడా ఇష్టంలేనట్టుగా మండిపడుతూ మాట్లాడాడు.

"అపాయాలు కలగడానికి అత్యాశలు, ఆటంబాంబులే అక్కర్లేదండి. అజాగ్రత్తగా రోడ్డు క్రాస్ చేసినా అపాయాలు కలుగుతున్నాయి కదా! వచ్చిన జీతంతో సర్దుకుంటే అంతకంటే ఆనందం మరొకటివుండదని మీరు చెప్పడం మీకు సహజం! ఎందుకంటే మీ తరంవారు జీవితం విషయంలో రాజీపడుతూనే బతికేసారు! కానీ- నేను రాజాలాగ బతకాలనుకుంటున్నానే తప్ప, రాజీపడి బతకాలనుకోవడంలేదు! అంచేత, నేను కోరుకునే జీవితాన్ని ఎలా ఏర్పాటు చేస్కోవాలో నాకు తెలుసు. నేనో నెలరోజుల్లోగా, మళ్ళీ నా ఉద్యోగంలోకి వెళ్ళిపోతాను. కాకపోతే కొన్ని లక్షలు ఖర్చవుతాయి. అవ్వనివ్వండి, కోట్లు రావాలనుకున్నపుడు కొన్ని లక్షలు ఖర్చుచేస్తే తప్పేం వుంది? ఈ నెలలోగా ఎవరైనా నాకు సందేశాలిచ్చినా, సానుభూతి చూపించినా నేను భరించలేను, దయచేసి వెళ్ళిపొండి" అని రెండు చేతులెత్తి నమస్కరించాడు.

అందరూ వెనక్కి తిరిగి వెళ్లిపోక తప్ప లేదు.

భానుమూర్తి మాటలే నిజమయిపో



యాయి. ముప్పైఏడు రోజుల తర్వాత 'అతను నిజాయితీపరుడే' అనే సర్టిఫికేట్, ఓ పెద్ద ఆఫీసరుగారి సంతకంతో వచ్చింది. కాకపోతే ఆ సంతకం ఖరీదు పాతిక లక్షలపైమాటే! అతను మళ్లీ ఉద్యోగంలో జాయినైపోయాడు.

★ ★ ★

మాధవరావు మిత్రుడు రాఘవ కోడలు డాక్టరు చదివింది. ఆమె చదివిన చదువు వృథా కాకూడదన్న భావనతో మాధవరావు ఓ సలహా ఇచ్చాడు. రాఘవ ఇంట్లో ఉన్న పెద్ద సైజు గదిలో ఓ ప్రైవేట్ క్లినిక్ పెట్టి, పేద ప్రజలకి తక్కువ ఫీజు తీసుకుంటూ ఎందుకు సేవ చేయకూడదని అడిగాడు. గతంలో ఎప్పుడో ఇచ్చిన సలహా ఇప్పుడు ఆచరణలోకి వచ్చింది.

సుశీలకి ఒక్కడే బిడ్డ. కొడుకుని ఉదయం తయారుచేసి స్కూల్‌కి పంపించేసాక వంటపని ఆరంభించినా, అదంతా ఓ గంటలో ముగిసిపోతుంది. ఆ తర్వాతంతా ఖాళీయే! రాఘవ ఉద్యోగం నించి రిటైరయిపోయాడు. కాబట్టి ఉదయం టిఫిన్ చేసాక, దగ్గర్లో ఉన్న గ్రంథాలయానికి వెళ్ళి మధ్యాహం ఒంటిగంట వరకు ఉండి ఇంటికొచ్చి భోంచేస్తాడు... ఇంతకు మించి సుశీలకి వేరే పని లేదు. సొంతంగా క్లినిక్ నిర్వహించడానికి ఆమెకున్న అవకాశం.. అదీ!

ఆ ఇంటికి దగ్గర్లోనే ఓ లేబర్‌గూడెం ఉంది. అక్కడుండే అలగా జనానికి జబ్బులూ జ్వరాలు వచ్చినప్పుడు స్థానికంగా ఉన్న కింగ్‌జార్జ్ హాస్పటల్ ఒక్కటే గతి! ఆ ఆసుపత్రికి గతంలో 'ధర్మాసుపత్రి' అనే పేరుండేది. ప్రస్తుతం అన్ని రంగాల్లోనూ కాలుష్యం చోటు చేసుకున్నట్లే, ఈ ఆసుపత్రిలో ఉండే ధర్మానికి కూడా కాలం చెల్లడంవల్ల, ఇప్పుడక్కడ పనిచేసే సిబ్బందే కాకుండా గోడలు, కుర్చీలు, బెంచీలు కూడా డబ్బులు డిమాండ్ చేస్తున్నాయి. ప్రైవేట్ డాక్టర్ల చేత వైద్యం చేయించుకోవడానికి చాలా మందికి చెయ్యి సాగడం లేదు. ఆ పరిస్థితిని చూసాకే మాధవరావుకు సుశీల చేత పేదప్రజలకి ప్రైవేట్ ఆసుపత్రి పెట్టించాలనే ఆలోచన వచ్చింది. 'ఉచిత వైద్యం' అనే మాటక్కూడా ఆయనో అర్థం చెప్పాడు సుశీలకి.

"నీ ఆసుపత్రి పేదప్రజల కోసం పదికాలాలపాటు సాగాలంటే ఓ చిన్న పనిచెయ్యాలి. వాళ్లు ఇవ్వాల్సిన ఫీజుని కేవలం ఓ పది రూపాయలే పెట్టు. ఆ మాత్రం ఇవ్వడం వాళ్లకేం కష్టంకాదు. ఆసుపత్రిని శుభ్రంచేసి, నీకు ఆ పనీ ఈపనీ చేసిపెట్టడానికి ఓ అమ్మాయి ఉండాలిగదా! ఆ అమ్మాయికివ్వాల్సిన జీతం కోసమయినా ఈ ఫీజులు ఉపయోగపడతాయి" అన్నాడు.

పేదలకోసం ఓ ప్రైవేట్ క్లినిక్ స్థాపించబడిందనే విషయాన్ని లేబర్‌గూడెం జనానికి తెలియజేయడానికి నాలుగు ప్లకార్డులు రాయించి, నలుగురు చిన్న పిల్లల్ని పోగేసి, వాళ్లచేతికి ఆ కార్డ్‌లిచ్చి, ఆ గూడెం వీధుల్లో తిప్పిస్తూ, తనూ నోటితో ప్రచారం చేసాడు. క్లినిక్ ప్రారంభించిన రోజున సుశీల తన మామగారికి పాదాభివందనం చేయడంతోపాటు మాధవరావుకీ నమస్కరించింది. అతను పులకించిపోయాడు. గతంలో.. భానుమూర్తి రేఖని పెళ్లిచేసుకుని నూతన వధూవరులుగా తన ఇంటికి వచ్చినప్పుడు, అక్కడే ఉన్న రాఘవ "నూతన వధూవరులు పెద్దవారి ఆశీర్వాదం తీసుకుంటే వారి భవిష్యత్ జీవితానికి మంచిది. మీకు మామగారయినా, అత్తగారయినా ఈయనే కాబట్టి ఇతనికి పాదాభివందనం చేయండి" అన్నాడు.

ఆ మాటకి మనోరమ తన దర్పాన్ని ప్రదర్శిస్తూ జవాబు చెప్పింది "మా

అమ్మాయి మహామహావాళ్లకే పాదాభివందనం చేయదు. అలాంటప్పుడు మామూలు క్లాస్ త్రీ ఎంప్లాయీ అయిన మావగారికెందుకు చేస్తుంది? పైగా ఆడది మగాడికి పాదాభివందనం చేసిన క్షణం నించే మగవాడి అహంకారం, ఆధిపత్యాలు పడగ విప్పుతాయి. ఆడదానికి బానిసత్వం ప్రారంభమయ్యేది కూడా ఇక్కణ్ణించే! అంచేత మాలాంటి రాయల్ ఫ్యామిలీ లేడీస్ అడ్డమైన వాళ్లకి పాదాభివందనాలు చెయ్యరు"

గతకాలపు ఘాటైన జ్ఞాపకాల్లో ఉన్న మాధవరావు భుజం తట్టి, అతన్ని వాస్తవానికి తీసుకొచ్చి, ప్రారంభోత్సవానికి వచ్చిన పాతికమున్పైపై మందికీ ఓ మాట చెప్పాడు రాఘవ. "ఈ క్లినిక్ ప్రారంభించింది మా కోడలయిన డాక్టర్ సుశీలే అయినా.. దీన్ని పెట్టడానికి ప్రేరణనిచ్చి ప్రోత్సహించింది మా చిరకాల మిత్రుడయిన మాధవరావే! గత మూడురోజులుగా గూడెంలో కాలినడకన తిరుగుతూ మీకు ఈ క్లినిక్ గురించి ప్రచారం చేసిందీ అతనే! అందుకే అతన్ని మా కొడుకు కోడలు సన్మానిస్తారు" అన్నాడు.

వెంకట్, డాక్టర్ సుశీల మాధవరావు మెడలో పూలదండ వేసి, ఓ జత బట్టలు పెట్టారు. మాధవరావు వద్దన్నా వాళ్ళు వినలేదు. అతని కళ్లంట నీటిచుక్కలు అప్రయత్నంగానే రాలిపోయాయి. తన ఇంట్లో తనని ఓ 'వేస్ట్ కేరక్టర్'గా చూస్తూ అవమానిస్తుంటే, ఇక్కడ ఈ కుటుంబ సభ్యులు తనని సన్మానిస్తూ, తనకి నమస్కరిస్తున్నారనే భావనతో అతని మనసు ఆనందంతో గెంతులేసింది, మొగ్గలేసింది! ఈ జన్మకీ పిడికెడు తృప్తి, ఆనందం చాలనుకున్నాడు.

★ ★ ★

కొన్ని రోజులు భారంగా ముందుకు జరిగాయి.

# భలే భలే!

రష్యన్ రచయిత వ్లాదిమిర్ నకొబొవ్ చిన్న పెట్టెల్లో భద్రపరచడానికి వీలుండే 3/5 అంగుళాల కార్డుల మీదే రచనలు చేసేవాడట! అది కూడా పూర్తిగా నిల్చునే!

★ ప్రతిరోజూ ఇంగ్లీషు చానెల్‌లో ఈతకొడితే గానీ రచయిత జార్జ్ ఆర్వెల్ మెదడు చురుకుగా పనిచేసేది కాదట!

ఓ రోజు రాత్రి భోజనం చేసి భానుమూర్తి తనగదిలోకి వెళ్లబోతుంటే మాధవరావు కొడుకుని ఆపి ఓ విషయం మాట్లాడాడు.

"నేనో విషయం మాట్లాడాలనుకుంటున్నాను. రేపు..."

"గుర్తుంది, రేపు నా పుట్టిన రోజు"

"నీ పుట్టిన రోజు మాత్రమేకాదు.. మీ అమ్మ చనిపోయిన రోజూ రేపే"

"గుర్తుందిలే! అయితేంటంటావు?"

"రేపు ఉదయం మీ అమ్మ పేర్న దేవుడికి అభిషేకం చేయించి... అనాథాశ్రమంలోని పిల్లలకి అన్నదానం చేయడం మంచిది"

"ఎవరికి మంచిది? మనం వేసే దక్షిణ వల్ల పూజారికి మంచి జరుగుతుంది! మనం స్పెషల్ వంటకాలతో పెట్టే విందు భోజనం వల్ల అనాథ పిల్లలకి మంచి కలుగుతుంది. కానీ వాళ్లకి జరిగే మంచివల్ల మనకి బోలెడంత డబ్బు ఖర్చవుతుంది. పైగా... పుట్టినరోజునాడు సంతోషంగా గడపడం మానేసి, చచ్చిపోయినవాళ్లని గుర్తు చేస్కోవడం బుద్ధితక్కువ పని. ఇంతవరకూ నీ మాట కాదనలేక అలాంటి పనులు చేసినా, ఇక మీదట అలాంటి పనులు చెయ్యకూడదనుకుంటున్నాను"

మరొకప్పుడైతే మానవత్వానికి దూరంగా

జరిగిపోయిన కొడుకుతో తీవ్రంగా వాదిం చేవాడే! కానీ అతని పక్కన రేఖ, మనోరమ కూడా ఉన్నారు కాబట్టి అపుడు వాదించాలనే ఉద్దేశ్యాన్ని మానుకున్నాడు. "సర్లే, నేనైనా వెళ్లి అభిషేకం, అన్నదానాలు జరిపించేసి వస్తాను" అన్నాడు.

రేఖ మాత్రం భర్తతో చెప్తున్నట్టుగా అంది "ఆయన రేపు ఆ కార్యక్రమాలకి వెళ్లిపోతే ఎలాగండి? రేపొద్దుట ఆరుగంటలకల్లా ఢిల్లీనుంచి మీ ఫ్రెండు అశోక్ ఫ్యామిలీ పిల్లల్తో సహావచ్చి ఎల్లుండి మధ్యాహ్నం వరకు ఇక్కడే ఉంటాడు. ఇంతమందికి మన వీరమ్మ ఒక్కతే వండి వార్చాలంటే కష్టమే! ఒక్క మనిషినైనా ఆవిడకి సాయంగా ఇవ్వాలికదా?"

"అందులోనూ వచ్చేవాళ్లు గొప్పింటి గెస్టులు కాబట్టి, కొన్నయినా స్పెషల్ వంటకాలు వండాలిగదా! అంచేత వీరమ్మకి సాయంగా మీ నాన్నగార్ని ఉంచితే కొంత వరకు బెటరుగా ఉంటాది"

మనోరమ కూడా తన కూతుర్ని సమర్ధించింది.

భానుమూర్తి తండ్రికి తుది ఆదేశం ఇచ్చేసాడు "అశోక్‌లాంటి ఫ్రెండ్ నా బర్త్ డేనాడు నా ఇంటికి రావడం నా అదృష్టం. అతను హోటల్ ఫుడ్‌కంటే, ఇంట్లో వండిందే ఇష్టపడతాడు. రేపు నువ్వూ వీరమ్మా ఆ వంట వ్యవహారం చూస్కోండి"

మాధవరావు కాస్సేపు ఏమీ అనలేక "అయితే మీ అమ్మ ఆత్మశాంతికి చేసే అభిషేకం అదీ..." అంటూ వాక్యం పూర్తి చేయకముందే భానుమూర్తి కఠినంగా చెప్పాడు.

"బతికున్నవాళ్లని సంతోషపెట్టడంకంటే, చచ్చిపోయిన వాళ్ల ఆత్మశాంతి ముఖ్యం కాదు. చచ్చిన వాళ్ల ఆత్మలన్నీ దేవునిలో ఐక్యం అయిపోతాయంటారు. అలాంటప్పుడు ఇంకా వాళ్లకోసం అభిషేకాలు, అన్నదానాలూ చేయడమంత మూర్ఖత్వం మరొకటి ఉండదు. అంచేత, ఇలాంటి వేస్ట్ కార్యక్రమాలు చేబట్టి, నీకున్న వేస్ట్ కేరక్టర్ అనే పేరుని సార్ధకం చేస్కోకు"

వాళ్లముందు ఏడవడం ఇష్టంలేక, వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక తన గదిలోకి వెళ్లిపోయాడు మాధవరావు. అతను వెళ్లాక మనోరమ సెటైర్ కొడుతున్నట్టుగా .."భార్య పోయినవాళ్లు మరో పెళ్ళి చేస్కోకుండా, మరో ఆడదాన్ని వుంచుకోకుండా, అభిషేకాలు అన్నదానాలు చేస్తే ఆవిడ ఆత్మ శాంతిస్తుందిగానీ, ఓ పక్కనించి రాధాబాయ్‌తో రంగులరాట్నం తిరుగుతూ, మరో పక్కనించి మీ అమ్మ ఆత్మశాంతికి పూజలు చేస్తే ఆవిడ ఆత్మ శాంతిస్తుందంటావా? ఘోషిస్తుందంటావా? భలేతండ్రి దొరికాడయ్యా నీకు!" అంది.

భానుమూర్తి మరేం జవాబు చెప్పలేదు.

★ ★ ★

మర్నాడు ఉదయం అయిదుగంటలకే భానూ, రేఖా తమ కారులో స్టేషన్‌కి వెళ్ళి ఢిల్లీనుంచి వచ్చిన అశోక్‌ని, అతని వెంట వచ్చిన వారిని రిసీవ్ చేసుకుని, వాళ్లని ఓ టాక్సీలో ఇంటికి తీసుకొచ్చారు. వచ్చాక హాల్లో ఉన్న మనోరమకి తన స్నేహితుడి కుటుంబాన్ని పరిచయం చేసాడు భానుమూర్తి. అశోక్, అతని భార్య లీల, వాళ్ల ఏకైక కుమారుడు పింకీ, ఆమెకు కేర్‌టేకర్‌గా ఉంటున్న ఆయా 'మేరీ'ని పరిచయం చేసాడు. అక్కడ మాధవరావు, వంట మనిషి వీరమ్మ కూడా ఉన్నారు. భాను తన ఫ్రెండుకి మనోరమని తన అత్తగారిగా, రాయల్ ఫ్యామిలీ మనిషిగా పరిచయం చేసాక, తన తండ్రి, వీరమ్మ ఉన్న వైపు తిరిగాడు. అది గమనించిన మనోరమ పరిచయాల కార్యక్రమాల్నించి జంప్ చేయించేసింది.

"పని మనుషుల్ని కూడా పరిచయం చేస్తూ కూర్చుంటే వీళ్లకి స్నానాలు, టిఫిన్లూ ఎప్పుడు పూర్తవుతాయి? మీరెళ్ళి స్నానాలు చేస్తే అందరం కలసి టిఫిన్లు చేద్దాం" అంది.

పరిచయాల కార్యక్రమంలో వాళ్ళు వది లేసింది మాధవరావునే!

అందరూ కలిసి టిఫిన్లు చేసేటప్పుడు కూడా మాధవరావుని పిలవలేదు.

ఆ రోజు ఏమి వండాలో వీరమ్మకి నిన్న సాయంత్రమే చెప్పెయ్యడంవల్ల ఆవిడ బిజీగా తన పనులు చేసుకుపోతోంది. ఆ పనులు చేస్తూనే, తనకి సాయం చెయ్యడా నికి వచ్చిన మాధవరావుతో "అదేటిబాబూ, మీ అబ్బాయిగారు మీ వియ్యపురాలుగార్ని పరిచయంచేసి మిమ్మల్ని ఒగ్గేసారు?" అంది. అతను చిన్నగా నవ్వుతూ "గవర్న మెంట్ ఆపీసర్లు ప్రముఖుల్నే పరిచయం చెయ్యాలి తప్ప, పనిమనుషుల్ని పరి చయం చెయ్యడానికి ప్రోటోకాల్ ఒప్పు కోదు వీరమ్మా" అన్నాడు.

"అలాగైతే, మీరీపనులు చెయ్యడానికి నేనూ ఒప్పుకోను. మీరు లెగండి చెప్తాను. లెగండి"

"ఫర్వాలేదు వీరమ్మా! అధిష్ఠాన వర్గం నన్ను పౌరసరఫరాల శాఖ నుంచి హోమ్ డిపార్ట్‌మెంట్‌కి.. అంటే ఈ హోమ్‌లో వుండే వంటల సెక్షన్‌కి ట్రాన్స్‌ఫర్ చేసిం దనుకుంటాను. చాలా ఐటమ్స్ వండాలి. కానియ్ కానియ్" అంటూ నవ్వుతూ పనిలో లీనమైపోయాడు.

టిఫిన్స్ పూర్తిచేసాక భాను, అశోక్, మి గిలినవారంతా పేకాట ఆరంభించారు. అశోక్ సిగరెట్ తర్వాత సిగరెట్ కాలు స్తూనే ఉన్నాడు. ఉదయం పదకొండున్నర దాటాక అతని దగ్గరున్న సిగరెట్లన్నీ అయి పోయాయి. అతను బద్ధకంగా ఒళ్లువిరుచు కుని "భానూగారూ, నా దగ్గర సిగరెట్లన్నీ అయిపోయాయి. బైట ఎండకూడా అదిరి

## భళేభళే!

ఫ్రాంజ్ కాఫ్కా తనకిష్టమైన పైనాపిల్ కేక్‌ను ఎదురుగా పెట్టుకుని కథ రాయడం పూర్తవగానే ఇంకెవరికీ ఆ కేక్‌ను పెట్టకుండా ఒక్కడే తృప్తిగా తినేవాడట!

★ ఎజ్రా పౌండ్ సాధారణంగా ముక్కు తోనే గాలి పీల్చుకున్నా రాసేపుడు మాత్రం నోటితోనే శ్వాస తీసుకునేవాడట!

పోతోంది. ఇప్పుడు మనం బీరు వేస్తే ఎలా వుంటాదంటారు? అన్నట్టు మీ పని వాడి పేరు ఏంటన్నారు?" అని అడిగాడు.

భానూ ఏదో అనేలోగా మనోరమ "అతని పేరు మాధవరావు" అంది. అశోక్ అక్కణ్ణించే వంటగదిలో ఉన్న మాధవరా వుని పేరు పెట్టిపిలిచాడు. "అయ్యగారూ, ఆళ్లు మిమ్మల్ని ఈ ఇంటి నౌఖరనుకుంట న్నారండి" అంది వీరమ్మ కాస్త కంగా రుగా. మాధవరావు తన నిట్టూర్పునే, చిరునవ్వుగా మార్చి "ఖర్మని గాడిదలు కాసినప్పుడు పాండవులంతటివాళ్లు పరా యివాళ్ల పంచనపడి పనివాళ్లుగా పనిచే సారు. కాకపోతే, నేను అదృష్టవంతుణ్ణి కాబట్టి, సొంతింట్లోనే నాకు ఆ ఛాన్స్ దొరి కింది" అంటూ అక్కడ్నుంచి లేచి హాల్లోకి వెళ్లాడు. అశోక్ అతనికి వెయ్యిరూపాయల నోటిచ్చి ఓ అరడజను బీరు సీసాలు, సిగ రెట్ ప్యాకెట్, కారబ్బూంది వగైరాలు తెమ్మని చెప్పారు. పేకాడుతున్న ఆ ఇంటి సభ్యులంతా కావాలనే వాళ్లిద్దరివైపు చూడ కుండా చేతిలో ఉన్న పేకముక్కల్ని చూస్తూ వుండిపోయారు. భాను మాత్రం తన జేబులోనించి పర్సు తీసి "ఈ ఇంటికి గెస్ట్‌గా వచ్చి మీరు డబ్బులు ఖర్చుపెట్టడ మేంటి?" అంటూ డబ్బు తీయబోయినా, అశోక్ ఒప్పుకోలేదు.

అనుకుని, మీ మనోభావాన్ని వెల్ల డించండి"

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డమనే సామెత ఒకటుంది. మాధవరావు ఆత్మగౌరవం దెబ్బ తిని బాధపడుతున్న తరుణంలో, జోగినాథం యిలా వరండాలో



మాధవరావు అశోక్ చెప్పిందంతా జాగ్రత్తగా విని, లోపలికెళ్లి ఓ సంచి పట్టుకుని బైటకి వెళ్లాడు. మాధవరావు కాస్త దూరంగా వున్న వైన్‌షాపుకి, పాన్‌షాపుకి వెళ్లి అశోక్ చెప్పినవన్నీ కొనుక్కుని ఓ అరగంట తర్వాత సామాన్లున్న సంచిని మోసుకుంటూ అపార్ట్‌మెంట్స్ కారిడార్ లోనించి నడుచుకొస్తుంటే, అతని కోసమే ఎదురు చూస్తున్న జోగినాథం గబగబా వచ్చి వెకిలిగా నవ్వుతూ "ఏంటండీ, మీ యింటికి మీరే పెద్ద దిక్కైవుండి, యీ అపార్ట్‌మెంట్స్‌కి ప్రెసిడెంటై వుండికూడా, యీ బీరుకాయలూ గట్రా మీరు మోసుకెళ్తున్నారేంటండి? " అన్నాడు.

"నాకంటే పెద్దదిక్కు ఎవరూలేక"

"మీకీ బీర్లు తాగే అలవాటు లేదనుకుంటాను. అలాంటప్పుడు మీరే యీ సీసాలు పట్టుకువెళ్తున్నందుకు మీ మనోభావాలు దెబ్బతినలేదంటారా? "

"ఇంటింటికీ టీవీలు వచ్చి న్యూస్ ఛానల్స్ ఎక్కువైపోయాక.. చాలామంది మా మనోభావాలు దెబ్బతినేసాయంటూ టీవీల్లో కనిపించడం ఎక్కువైపోయింది"

"నా పేరు జోగినాథం న్యూస్ ఛానల్ నిలబెట్టి ప్రశ్నించడం మరీ దుర్భరమయింది. అయినా, జోగినాథానికి తగినట్టే సమాధానం చెప్పాడు.

"నాకీ బీర్లు తాగే అలవాటు లేకపోయినా, నేనీ సీసాలు మోసుకెళ్లడం బాధగా లేదాని అడుగుతున్నావు. నాకో సంగతి చెప్పు. మనం నీళ్లు తాగితే ఎందులో వేసుకుని తాగుతాం? "

"గ్లాసులో"

"మజ్జిగ తాగాలంటే ఎందులో వేసుకుంటాం? "

"మజ్జిగయినా, మంచినీళ్ళయినా, మం

దయినా, తాగే ద్రవపదార్థం ఏదైనా గ్లాసులో పోసుకునే తాగుతాం"

"కదా! మనచేత రకరకాల డ్రింకులు తాగించే ఆ గ్లాసు ఎప్పుడైనా, ఏ డ్రింక యినా తాగుతుందా? "

"తాగదే"

"నేనూ ఆ గ్లాసులాంటివాణ్ణే! తాగి స్తాను తప్ప, తాగను. ఇంక మూస్కో.. నీ పని చూస్కో" అన్చెప్పి గబగబా తన ఫ్లాట్ లోకి వెళ్లబోతుంటే జోగినా థం సంతృప్తి చెందక, యీసారి సూటిగా మన సులోని మాటని అడి గేశాడు "అది కా ద్సార్! మీవాళ్లు మిమ్మల్ని అవమానక రంగా చూస్తున్నారని అర్థ మైంది. ఇవాళ యీ బీరుసీ సాలు కూడా మోయిస్తున్నారు. మీకు యిబ్బందిగా లేదా? "



"చన్నీళ్లతో స్నానం చేసేటప్పుడు మొదటి చెంబు నీళ్ళకే ఒళ్లు జలదరి స్తుంది. ఆ తర్వాత మన బాడీ ఆ చల్లద నానికి అలవాటైపోతుంది గదా! ఈ అవ మానాలు కూడా అంతేనయా" అంటూ మాధవరావు నవ్వుకుంటూ వెళ్లిపోయాడు. మొదటిసారిగా జోగినాథం మాధవరా వులో వున్న మరోకోణాన్ని చూసాననుకు న్నాడు.

మాధవరావు అశోక్‌కి తను తీసుకొచ్చిన సామాన్లు అప్పగించి, మిగిలిన డబ్బుల్ని కూడా యిచ్చేసి, రెండు బీరుసీసాల్ని టే బుల్ మీద పెట్టి, మిగిలిన సీసాల్ని ఫ్రిజ్‌లో పెట్టాడు. సిగరెట్ ప్యాకెట్‌తో పాటు, అగ్గిపెట్టెకూడా అందించాడు.

"అగ్గిపెట్టె తెమ్మని నేను చెప్పలేదే" నవ్వుతూ అడిగాడు అశోక్.

"ఎంత ఖరీదైన సిగరెట్టయినా వెలగా లంటే అగ్గిపెట్టె వుండాలికదా! అందుకే తీసుకొచ్చాను."

"వెరీగుడ్" అంటూ అశోక్ యాభైరూపా యలనోటుని టిప్పుగా యిచ్చాడు. కానీ మాధవరావు తీస్కోలేదు. "మొహమాటప డకయ్యా, మీ బాస్ ఏమీ అనుకోరులే" అన్నాడు అశోక్.

"ఎవరో ఏదో అంటారని కాద్సార్! నేనె ప్పుడూ చెయ్యని పనులు యిప్పటికే చాలా

చేస్తున్నాను. ఇంక, యీ అలవాటు కూడా అబ్బితే... వద్దులెండి" అనేసి అక్కడే నిల బడ్డాడు. అశోక్ తన భార్యతో కొన్ని వాక్యాలు హిందీలో మాట్లాడాక మాధవ రావు గురించి అందరితోనూ చెప్పాడు.

"మీ నౌకరు మాధవరావు మాకు బాగా నచ్చాడు. ఇతనికి తెలివితేటలు, సిన్సియార్టీ కూడా వున్నాయి. మీకో విషయం చెప్పాలి. మా నాన్నగారికి పక్షవాతం వచ్చి మంచానపడి చాన్నాళ్లయింది. ఆయనకి కేరళ వైద్యం చేయిస్తున్నాం. వాళ్లిచ్చిన ఆయిల్‌ని రెండుపూటలా మర్దన చెయ్యాలి. ఆ పని చెయ్యడానికి మాకు ఢిల్లీలో నౌకర్లు దొరుకుతున్నారుగానీ, అందరూ దొంగవెధవలే! మనం లేనప్పుడు మనింట్లో ఉండే టెలివిజన్‌లూ, కంప్యూ టరు పట్టుకుపోయి అమ్మేసేవాళ్లే! మాకు కావలసింది వుద్యోగస్థుడు కాదు... నమ్మ కస్థుడు! అలాంటి వాడు యిక్కడ కనిపిం చాడు. ఇతన్ని మాతోపాటు ఢిల్లీ తీసుకు పోదామనుకుంటున్నాం. ఇతను ఎంత జీతం కావాలన్నా యిస్తాను. నాక్కావల సింది మా నాన్నగారు మళ్లీ మా అందరి మధ్య ఆరోగ్యంగా తిరుగాడ్డం! ఎందుకంటే నేనివాళ యింత ఉన్నతాధికారిగా వున్నా నంటే అందుక్కారణం... మా నాన్నగారు చేసిన కృషే" అంటూ మాధవరావుని డైర క్ట్‌గా అడిగాడు.

"ఏం మాధవరావ్, నువ్వు మాతో వచ్చే స్తావా? అక్కడ నిన్ను పనిమనిషిగా కాదు... మా మనిషిగా చూస్కుంటాం"

అతని భార్య లీలావతి అంది "ఒకవేళ, నీ భార్యని కూడా తీసుకొచ్చేస్తానంటే గొడ వేలేదు. మా బంగ్లా వెనకున్న ఔట్‌హౌసు లోనే మీరిద్దరూ వుండొచ్చు"

"అతనికి అలాంటి జంఝాటాలేం లేవు లెండి! ఏక్‌నిరంజన్‌గాడే" అంది మనో రమ.

మాధవరావు జవాబు చెప్పకుండా మౌనం వహించాడు.

'ఈ లంపటం యిలా వదిలిపోయినా బావుణ్ణు' అని మనసులో అనుకుంది రేఖ.

ఈ మాటలన్నీ వంటమనిషి వీరమ్మకి వినిపిస్తూనే వున్నాయి. ఆవిడకి కోపం తెప్పించినవి మనోరమ చెప్తున్న మాటలు కావు. భానుమూర్తి మౌనంగా వుండటం! ఆమె సహించలేక గబగబా వంటగది నించి అక్కడికి వచ్చింది. ఆవిడ ఏదో అనే లోగా, ఆవిడ ఉద్దేశ్యాన్ని గమనించిన మాధవరావు ఆమెను ఆపుచేసి గద్దిస్తూ మాట్లాడాడు.

"ఏంటి వీరమ్మా, నువ్వు వంట మధ్యలో వచ్చేసావు? నీకేమైనా సందేహాలుంటే, నేనక్కడికి వచ్చేదాకా ఆగాలి. అంతేగానీ, నువ్విక్కడకి వచ్చేయ్యడమేంటి? "

"అదికాదు... వీళ్ళు..."

"ఏం అడుగుతున్నారో నాకు అర్థమవు తూనే వుందిగదా! జవాబు చెప్పడానికి నాకు నోట్లో నాలిక లేదనుకున్నావా? బుర్రలో బుద్ధి లేదనుకున్నావా? వెళ్ళి నీ పని చూస్కో" అతను చెప్పిన మాటల్లోని అంతరార్థం ఆమెకు అర్థమై తనని తాను తమాయించుకుంటూ వెళ్లిపోయింది.

మనోరమ మళ్లీ వ్యంగ్యంగా అంది "ఇత నికి మీరిచ్చిన బంపర్ ఆఫర్ బ్రహ్మాం డంగా వుంది. ఇతనికి భార్యలాంటి బంధా లేవీ లేకపోయినా, యితర లంపటాలు ఏం వున్నాయో మాత్రం మాకు తెలీదు"

ఆ మాటకి ప్రత్యేకంగా ఎవరూ స్పందిం చలేదు. కొన్ని నిమిషాల తర్వాత అశోక్ "మరేం ఫర్వాలేదు, మాధవరావ్. ఇలా నిల్చున్న ఫళాన అడిగితే, ఎవర్కైనా సమా ధానం చెప్పడం కష్టమే! మేం రేపు సాయంత్రం వెళ్తున్నాం. వెళ్లేలోపుగా చెప్పు. ఒకవేళ అప్పటికీ తేలకపోతే, ఓ వారం పదిరోజుల్లోగా నిర్ణయించుకుని మా

చతుర ప్రపంచం

# విచిత్ర విడాకులు!

★ రోమ్‌కు చెందిన 74 ఏళ్ల రోజా, తనకంటే రెండేళ్ల పెద్దవాడైన జ్యూవన్నీని ఏడేళ్ల పరిచయం తర్వాత పెళ్లాడింది. వాళ్లిద్దరూ హనీమూన్‌కు వెనిస్ వెళ్లారు. హనీమూన్ నుంచి మధ్యలోనే తిరిగి వచ్చేసిన రోజా తన భర్తనుంచి విడాకులు కావాలని కేసు వేసింది. కారణం అతడికి యువకుల్లోలాగా సెక్సు ఆకలి ఎక్కువ.



★ జర్మనీలోని కోలోన్ అనే ఊరిలో ఒక జంట వివాహమైన నెలకే కోర్టు మెట్లెక్కింది. కారణం చర్చి గంట ధ్వనులను విన్నప్పుడు మాత్రమే భర్త సెక్సులో పాల్గొంటాడు. చిన్నప్పుడు అతడి తల్లిదండ్రులు ఆదివారాలు చర్చి గంటలు విని, చర్చికి వెళ్లాక అతను గాళ్‌ఫ్రెండ్‌తో సెక్సులో పాల్గొనేవాడు. అతడు ఆ ధ్వనులు వినేందుకు అలవాటు పడ్డాడు. రికార్డు చేసిన చర్చి గంటలను వినిపిస్తే అతనికి అదేమాత్రం ఉపయోగపడలేదు. ఆదివారం ఉదయాలు చర్చి గంటలు మోగేటప్పుడు మాత్రమే అతనికి మూడ్ వస్తుంది.

★ వియన్నాలో నివసించే జాన్‌హీర్ అనే అతనికి గేంబుల్ అనే మిత్రుడి భార్యతో లైంగిక సంబంధం ఉంది. ఒకరోజు సెక్సులో పాల్గొన్నాక ఆమె 'గాన్ విత్ ది విండ్' సినిమాను టీవీలో చూస్తోంది. అప్పుడతడు ఆమె వీపు మీద అందమైన ప్రకృతి దృశ్యాన్ని స్కెచ్ పెన్‌తో గీసి నిద్రపోయాడు. ఆమె ఇంటికి వెళ్లిపోయింది. ఆ రాత్రి ఆమెభర్త భార్యవీపు మీద ఆ చిత్రాన్ని, దానికింద మిత్రుడి సంతకాన్ని చూసి నిజం గ్రహించాడు. దాంతో కోర్టు అతనికి విడాకులు మంజూరు చేసింది.

★ స్టాక్‌హోం వాసి ఇర్విన్ గెహ్లెన్ మీద అతడి భార్య కోర్టులో విడాకులకోసం కేసు పెట్టింది. దీనికి కారణం అతడు రాత్రిళ్లు మూడు పొడుపు ప్రశ్నలను భార్యకు వేస్తాడు. ఆమె వాటికి కచ్చితంగా సమాధానం చెబితేనే సెక్సులో పాల్గొంటాడు.

ఫ్రెండు భానూగారికి చెప్పు. ఆయనే ఢిల్లీకి టిక్కెట్ రిజర్వ్ చేసి నిన్ను బండి ఎక్కిస్తారు. నాకాయన ఫోన్ చేసి చెప్తారు కాబట్టి, ఢిల్లీలో నేనే స్టేషన్‌కొచ్చి రిసీవ్ చేస్కుంటాను. ఇంక వెళ్లి పని చూస్కో" అన్నాడు.

అంతవరకు నిప్పులవానలో కత్తుల వంతెన మీద దిగంబరంగా నడుస్తున్నట్టు దుర్భరంగా ఫీలవుతున్న మాధవరావు అక్కడ నించి వంటగదివైపు వెళ్లకుండా దగ్గరగా వున్న కామన్ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తలుపు గడియపెట్టాడు. వాష్ బేసిన్ దగ్గరున్న అద్దం ముందు నిలబడి భోరుమని ఏడుస్తూ, అద్దంలో కనిపిస్తున్న ప్రతిబింబాన్ని చేత్తో దబదబామని కొట్టాడు.

ఆ రాత్రి భోజనాల సమయం..

ఆ యింట్లో డైనింగ్ టేబుల్ దగ్గర ఏడు కుర్చీలున్నాయి. అందులో భాను, రేఖ, మనోరమ, అశోక్, అతని భార్య లీల.. మరోకుర్చీలో అశోక్ కొడుకు కూర్చున్నారు.

ఇంకా ఓ కుర్చీ ఖాళీగా వుంది.

మాధవరావు పట్ల ఓ సదభిప్రాయాన్ని ఏర్పర్చుకున్న అశోక్ నవ్వుతూ "రావయ్యా మాధవరావ్, యీ పూట నువ్వూ మాతోపాటు కూర్చుని భోంచెయ్. మాకు అలాంటి భేదాలేంలేవు" అంటూ బలవంతంగా అతన్ని ఏడోకుర్చీలో కూర్చోబెట్టాడు. అయిష్టంగానే కూర్చున్నాడు మాధవరావు. ఢిల్లీనించి వచ్చిన అతిథుల

ముందు, తమ గృహంలో జరుగుతున్న గొడవలు, ఘర్షణలు బయట పడకుండా వుండాలనే, నిన్నరాత్రి నించి యిప్పటిదాకా మౌనంగా, సహనాన్ని ప్రదర్శిస్తున్నాడు. కానీ, తనని యింటి యజమానిగా పరిచయం చేయని వాళ్లముందు, తనని కూడా ఓ కుర్చీలో కూర్చోబెట్టాడు అశోక్. మరికొన్ని క్షణాల్లో ఏదో జరుగుతుందని అతని మనసు శంకించినా, ఏం జరుగుతుందో మాత్రం వూహించలేకపోయింది.

అతిథులతో పాటువచ్చిన ఆయా 'మేరీ' నిలబడేవుంది.

లీలావతి అది గమనించి "మన మేరీ నిలబడే వుండిపోయిందండి" అంది.

కొత్తగా నౌఖరుగా పరిచయమయిన తననే కుర్చీమీద కూర్చోబెట్టిన అశోక్, తమ యింట్లో చాలాకాలం నించి పనిచేస్తున్న మేరీ గురించి అలా ఆలోచించినందుకు మనసులోనే అభినందిస్తూ "ఫర్వాలేదమ్మా, బాబుని నేను నా ఒడిలో కూర్చోబెట్టుకుంటాను. ఆ కుర్చీలో మేరీగారు కూర్చుంటారు" అన్నాడు మాధవరావు.

లీల లేవదీసిన సమస్య అక్కడితో సమసిపోతుంది! కానీ, మాధవరావు తమతో సమానంగా ఢిల్లీ అతిథుల సమక్షంలో కూర్చోవడాన్ని సహించలేని మనోరమ, రేఖ అతన్ని ఎలా అక్కణ్ణించి లేవదీయడమానే ఆలోచిస్తున్నారు.

లీల మాత్రం "అలా కుదరదు, మా బాబుకి నేను తల్లినే అయినా, వాడికి మా ఆయా మేరీయే తినిపించాలి. లేకపోతే తినడు. అదీ నా పక్క కుర్చీలో మేరీ కూర్చుని, తన ఒడిలో మా బాబుని కూర్చోబెట్టుకునే తినిపించాలి" అంది.

కొన్నిక్షణాలపాటు మౌనం తర్వాత "ఇందులో సమస్యేం వుందమ్మా, పక్క ఫ్లాట్ శంకర్రావుగార్ని అడిగి ఓ కుర్చీని తెచ్చేస్తాను" అన్నాడు మాధవరావు.

ఆ మాటవినగానే మనోరమ చర్రుమంటూ లేచింది. "అదెలాగవుతుంది అల్లుడు గారూ! పక్కింటి శంకర్రావుగారు అవసరం వచ్చినప్పుడు అయిదువేలూ పదివేలూ లాంటి చిల్లర డబ్బులు మిమ్మల్ని అప్పు అడిగి తీసుకువెళ్తుంటారు. అలాంటి క్లాస్ త్రీ వుద్యోగస్థుడిని, మీ అంతటి క్లాస్ ఒన్ గవర్నమెంట్ ఆఫీసరు ఆఫ్టరాల్ ఓ కుర్చీని ఎరువు తెచ్చుకుంటే... దాంతో అతనికెంత కొమ్ములొస్తాయి? అతని దృష్టిలో మీరూ, మీ హోదా ఎంత లోకువైపోతాయో ఆలోచించండి" అంది భానుమూర్తితో. ఆ మాట నిజం కాకపోయినా, చెప్పింది మాత్రం అత్తగారు కాబట్టి ఔననక తప్పలేదు భానుమూర్తికి.

"ఇప్పుడేం చెద్దాం? " లీలావతి మెల్లగా గొణిగింది.

ఆమాట ఎప్పుడొస్తుందాని ఎదురు చూస్తున్న మనోరమ ఆ ప్రశ్న వినియోగించుకుంది. "ఈ దిక్కుమాలిన విషయం గురించి యింతసేపు డిస్కషనేంటండి? మీ అబ్బాయి కూడా మీతోపాటు తినాలి. అది మీ అలవాటు. కానీ, యిక్కడ అలవాటులేని కొత్త విషయమేంటంటే పనివాడు కూడా మనతో కలిసి భోంచెయ్యడం! అంచేత, మీరేదో మీ హృదయ విశాలత్వం కొద్దీ, మా నౌఖర్ని మనతో సమానంగా కూర్చోబెట్టినా... అలా కూర్చోబెట్టడం అవసరమా? "

అంతవరకు వడ్డించడం కోసం అక్కడే సిద్ధంగా నిలబడిన వంటమనిషి వీరమ్మ రక్తంలోని సహనం సర్వం దహనం అయిపోయింది. ఆ యింటికి యజమాని, స్వతహాగా సౌమ్యుడు, మర్యాదస్థుడయిన మాధవరావు వ్యక్తిత్వాన్ని ఆ యిద్దరు ఆడవాళ్లు వుదయం నించి ఎలా కమ్చీదెబ్బలు కొడుతున్నారో.. అతని ఆత్మగౌరవానికి ఆ వైపునించి, యీ వైపునించి ఎలా అగ్గి

అంటించి అవమానిస్తున్నారో ప్రత్యక్షంగా చూసిన వంటమనిషి, మరి వుండబట్టలేక పెద్దగా గొంతెత్తి ఆ ముగ్గురి మీద విరుచుకుపడింది. మనసున్న మనిషిగా రగిలిపోయింది.

"ఎవలమ్మా యీ యింటి పనోడు? ఎవులు? పొద్దుట్నించీ చూస్తున్నాను. మనిషంత మనిషిని, యీ ప్లాట్లకి ప్రెసిడెంట్ ని, యీ యింటికి యజమాన్ని పట్టుకుని నౌకరుకింద జమకట్టేసి అడ్డమైన పనులు బెత్తాయిస్తారా? "

ఏనాడూ నోరెత్తని వీరమ్మ విజృంభించి అడిగేసరికి భానుమూర్తి, రేఖ, మనోరమ నివ్వెరపోయారు. ఆమె మాటలకి అశోక్, అతని భార్య లీల కూడా చలించారు. తాను వుదయం నించి నౌకరుగా భావించి పనులు పురమాయిస్తుంటే, వినయంగా నెరవేరుస్తున్న వ్యక్తి తన స్నేహితుడి తండ్రని తెలియగానే అశోక్ మానసికంగా తల్లడిల్లిపోతూ "క్షమించండి సార్! మీరు ఫలానా అని తెలీక..." అంటుంటే, వీరమ్మ అతన్ని అధిగమిస్తూ మాట్లాడింది.

"ఈ ఆడోళ్లు యింత అవమానం చేస్తున్న ఆ పెద్దాయన యీయన తండ్రిగారేనండి. ఆ విషయం తెలీకపోవడంలో మీ తప్పేంవుంది? ఈయనగారి ఆడోళ్ల చేతిలో ఆటబొమ్మగా మారిపోబట్టే కదండీ యీ యింటికింత ముసలం దాపురించింది"

ఈ యింటికివచ్చిన అతిథుల కంటికి శిథిలావస్థకి చేరుకుంటున్న యీ యింట్లోని మానవసంబంధాలు కనబడకూడదనే ఎంతో సహనంగా అన్నిపనులు చేసుకొస్తున్నాడు మాధవరావు. ఇప్పుడు వీరమ్మ తన ప్రయత్నాన్ని భంగపరుస్తుందనే భయంతో "వీరమ్మా, యీ గొడవ

నీకెందుకు? నువ్వూర్కో" అని కసిరాడు.

"పొద్దుట్నించీ వూర్కోబట్టే, వీళ్లముందు మీ పరిస్థితి నిమసనిమసానికీ దిగజారిపోతోంది. పొద్దుట మీ వియ్యపురాలుగారు మిమ్మల్ని పరిచయం చెయ్యకుండా వదిలేసినప్పుడే అడగాలనుకున్నాను. మద్దేనం వీళ్లు మీ చేత బీరుసీసాలు మోయించినప్పుడే తగుల్కుందామనుకున్నాను. కానీ, యిప్పుడు మాత్రం బరాయించలేకపోయాను. అసలా మేరీ ఎవరండి? పిల్లల్ని చూస్కునే ఓ ఆయా! అంటే నాలాంటి పనిమనిషేకదా! ఆవిడ కూర్చోడానికి కుర్చీ లేకపోతే, పక్కింటినించి తెస్తానన్నారు. అలాచేస్తే, అందరిముందూ మీకు నామోషీ అయిపోతుందన్నారు. కానీ, ఓ పనిమనిసికోసం, యీ యింటి యజమాన్ని కూర్చున్నచోట నించి లెగ్గొట్టేసారే... అది మాత్రం నామోషీకాదా? "

భానుమూర్తి ఏమీ అనలేని పరిస్థితి నించి బయటపడుతూ "నోర్మూయ్" అంటూ ఏదో అనేలోగా వీరమ్మ మరింత రెచ్చిపోవడమే కాకుండా, మర్యాద కూడా తగ్గించేసి మాట్లాడింది. "ఏం పౌరుషం తన్నుకొచ్చిందా నీకు? మీ నాన్నగారిని యీ ఆడోళ్లు పనిమనిషిగా చూపించినప్పుడేమయిందీ పౌరుషం? మీ ఫ్రెండుగారేమో, తమ పనిమనిషికి తమతో సమానంగా కుర్చీమీద కూర్చోబెట్టే స్థాయికి ఎదిగితే... మీరేమో మీ తండ్రిగారిని కూర్చున్న కుర్చీ మీదనించి లెగ్గొట్టేస్థాయికి దిగజారిపోయారు. ఆల్ల నాన్నగారికి ప్రత్యేకంగా ఓ నౌకర్ని పెట్టి సేవలు చేయించాలని ఆ బాబుగారంటే.. మీరేం చేసారు? ఆల్ల నాన్నగారికి సేవలు చేసే నౌకరుగా మీ నాన్నగార్ని పంపించెయ్యడానికి సిద్ధపడిపోయారు. ఇది పౌరుషం, మానం, మర్యాద వున్నోడు చేసే పనేనా? "

ఈ మాటలకి భానుమూర్తికంటే ఎక్కువగా స్పందించింది మనోరమ! అందుకే కాస్త ముందుకొచ్చి "నోర్మూయ్, ఆఫ్టరాల్ వంటమనిషివి, యింటి యజమానుల్నే విమర్శిస్తే పళ్లు రాలగొడతాను" అంటూ చెయ్యెత్తింది.

వీరమ్మ కూడా ఆవేశంగా చెయ్యెత్తేసరికి ఒక క్షణంపాటు అందరూ అదిరిపడ్డారు.

"నాకూ తిట్టడానికి నోరు, కొట్టడానికి చెయ్యీ వున్నాయండి. నేనో పనిమనిషినై వుండి, మిమ్మల్ని కొట్టడానికి చెయ్యెత్తానంటే... మీరు చేసే పనులు ఎంత చండాలంగా వున్నాయో ఆలోచించండి"

"షటప్! నిన్నిప్పుడే పనిలోనించి తీసేసాను. గెటవుట్" శక్తంతా వుపయోగించి అరిచింది మనోరమ.

"ఇంత గొడవ జరిగాక, నేనీ యింట్లో పని చేస్తానని నువ్వెలా అనుకున్నావు మనోరమా! మాలాగ కష్టపడి పనిచేసుకునే వాళ్లకి వందిళ్లు దొరుకుతాయి. కానీ, నీలాగ సంవత్సరాల తరబడి తిష్టవేసి, మూడుపూటలా మెక్కుతు, పేకాటలాడేవాళ్లకి అల్లుడిల్లుతప్ప మరోయిల్లు దొరకదు" వీరమ్మ యింకా యింకా మాట్లాడుతూ, వాళ్లందర్ని మాటల్తో ఎండగట్టేసి వెళ్లిపోయింది.

ఓ తుపాను వెలిసినట్టయింది. ఎవరి నోటంటా మాటరాని పరిస్థితి ఏర్పడింది.

## కొత్తగాలి...

**చితి కాలుస్తుంది**
**జీవితంలో ఒక్కసారే**
**చింత దహిస్తుంది**
**అనుక్షణం బతికున్నంతకాలం!**

**– *యాళ్ల విజయకుమార్,***
రాజమండ్రి

మాధవరావు మెల్లగా తన గదిలోకి వెళ్లి మంచం మీద వాలాడు. హాల్లో వున్న వాళ్లు నిశ్శబ్దంగానే భోజనాలు చేసారు. ఓ ముప్పావుగంట తర్వాత రేఖ ఆ గదిలోకి కొత్త దుప్పటి తీసుకొచ్చి, మంచం మీదున్న మాధవరావుతో "మీరు లేస్తే కొత్త దుప్పటి పరుస్తాను" అంది.

"ఫర్వాలేదులేమ్మా" మాధవరావు మెల్లగా అన్నాడు.

"ఫర్వాలేదనడానికి నేను పరిచేది మీ కోసంకాదు. వచ్చిన గెస్టులకి ఏ.సీ. పడ దట. అంచేత వాళ్లకి మీ రూమ్ యిస్తున్నాం"

మాధవరావు లేచి "అయితే నేను హాల్లోని సోఫాలో పడుకుంటాను" అన్నాడు.

"అందులో వాళ్లబ్బాయి పడుకుంటాడు" అంది రేఖ.

"అయితే నేను హాల్లో నేల మీద పడు కుంటాను" అంటూ వెళ్లబోయాడు.

"అక్కడ వాళ్ల పనిమనిషి పడుకుంటా దట"

అతనికి చిర్రెత్తుకొచ్చి "సరే, చాప వేసు కుని బాత్రూమ్‌లో పడుకుంటాను"

అంతవరకు ఆ గది గుమ్మం దగ్గర నిల బడి వింటున్న మనోరమ, భానుమూర్తి లోపలికి వచ్చారు. భానూ చేతిలో ఓ చాప, దుప్పటి, తలగడ వున్నాయి. "బాత్రూమ్‌లో మన కుక్కని కట్టాం" అంది మనోరమ.

"పోనీ యీ పూటకాకుక్క పక్కనే పడు కుంటాను"

మనోరమ చిరాగ్గా రుసరుసలాడింది. "మీరు ఫలానా అని తెలీకపోతే, మీరు కుక్కల పక్కన పడుకున్నా, నక్కల పక్కన పడుకున్నా మేం కేర్ చేసేవాళ్లం కాదు కానీ, యిందాక వీరమ్మ మీ హిస్టరీ అంతా ఆ గెస్టులకి చెప్పేసిందిగా"

అలా మాట్లాడుతూనే అందరూ హాల్లోకి

# భలే భలే!

'ది వైట్ కాసిల్', 'ది బ్లాక్‌బుక్'.. వంటి ప్రఖ్యాత నవలలు రాసిన, నోబెల్ పురస్కార గ్రహీత ఓర్హాన్ పాముక్‌కు నవలలో మొదటి వాక్యం రాయడం చాలా కష్టంగా ఉండేదట! మొదటి వాక్యాన్ని దాదాపు ఏభై నుంచి వంద సార్లు రాయాల్సివచ్చేదట!

వచ్చారు. తలుపు తీసేవుంది కాబట్టి వారు బిగ్గరగా మాట్లాడుతున్న మాటలు బైటకే వినబడుతున్నాయి. ఎవరూ గమనించక పోయినా, యిందాక వీరమ్మ కేకలు వేస్తు న్నప్పట్నించీ జోగినాథం వరండాలోనే తచ్చాడుతున్నాడు. ఇప్పుడు మరో నలు గురు వరండాలో నిలబడి, యింట్లో జరు గుతున్న సన్నివేశాన్ని ఆసక్తిగా చూస్తు న్నారు.

"నాన్నా, యీ ఒక్కరోజుకీ వరండాలో పడుకో" అన్నాడు భానుమూర్తి చాప, దిండు తండ్రికి అందిస్తూ.

"నేను వరండాలో పడుకుంటే నా పరువేం అవుతుందిరా? " గొంతు జీరబో తుండగా మాధవరావు అన్నాడు.

"కుక్క పక్కన పడుకోడానికి సిద్ధపడిన వాళ్లు వరండాలో పడుకుంటే ఏం తప్పొ చ్చిందట? " మనోరమ దాదాపుగా అరుస్తు న్నట్టుగా అంది.

మాధవరావు కూడా గొంతు పెంచే జవాబిచ్చాడు "నేను కుక్క పక్కన పడుకుంటే మొన్నటి వరకు నెలకి పాతిక వేలు సంపాదించిన ఓ జీతగాడు నా పక్కన పడుకున్నాడని సంతోషిస్తుంది. లేదా.. యీ ఇంటి యజమాని పనీ నా లాంటి కుక్కబతుకే అయిపోయిందని నా మీద జాలిపడుతుంది. కానీ, యీ

యింటికి పెద్దనీ, యీ అపార్ట్‌మెంట్స్‌కి ప్రెసిడెంటునీ అయివుండి వరండాలో పడుకుంటే ఎంత తలవంపులుగా వుంటాదో ఆలోచించు"

మనోరమ బయటివైపు చూస్తే ఫ్లాట్స్ లోని మనుషులు కనిపించారు. ఇంట్లో గెస్టులుగా వచ్చినవాళ్లు తమ వైపు చూస్తున్నారు. ఆమె అల్లుణ్ణి రెచ్చగొడుతూ "అల్లుడుగారూ, ఏంటీగోల? ఇంట్లోవాళ్ళూ బైటవాళ్ళూ మన గొడవ వైపే చూస్తున్నారు. ఆ చాప, దిండూ అవతలకి విసిరేసి, యితన్ని బైటకి తోసేస్తారో, లేక మీరే వరండాలో పడుకుంటారో మీ యిష్టం" అంది.

"నాన్నా! యింక ఆర్గ్యుమెంట్లు అనవసరం. నువ్వు యీ ఒక్కరాత్రికి వరండాలో పడుకో" అంటూ వరండాలోకి చాపని, దిండుని విసిరేసాడు.

బయట నిలబడినవాళ్లు లోపలకి వచ్చారు. "మాధవరావుగారూ! యీ ఒక్క రాత్రికే కదా! మా యింటికొచ్చి పడుకోండి" అంటూ యిద్దరు చెప్పారు.

మాధవరావు నెత్తికొట్టుకుని "నా యింట్లోనే నా పరువు పోయాక, నేను ఎవరెవరి యింట్లోనో దేవురించాల్సిన ఖర్మ నాకేం పట్టిందండి? " అంటూ తన ఆత్మఘోష కాస్సేపు వినిపించి, బైటకి నడిచాడు. వరండాలో నాలుగు అడుగులు వేసాక, వెనక్కి తిరగకుండానే జోగినాథాన్ని రమ్మని పిలిచాడు. అతను వచ్చాడు.

"నీకంతా వినిపించిందా? లేక లోపలేదో గొడవ జరిగినట్టుందే అని ఆ వివరాలన్నీ నన్నే అడుగుతావా? ఇన్నాళ్లూ నాకు జరిగిన అవమానాల్ని నీకు తెలీకుండా నా మాటలతో కవర్ చేసి, నా అంత గొప్పనటుడు మరొకరు లేడనుకునేవాణ్ణి! కానీ, నా గురించి అంతా తెలిసి కూడా, ఏమీ తెలీనట్లుగా, నాకు నమస్కారాలు చేస్తూ గౌరవించారే... మీరయ్యా నిజమయిన మహానటులు. ఇలా జీవితంలో రోజూ నటించే అవసరం యికమీదట మీకు వుండదు.. నాకూ వుండదు. నమస్కారం" అన్చెప్పి రెండుచేతుల్తో అందరికీ నమస్కరించి నడుచుకుంటూ వెళ్లిపోయాడు.

జోగినాథం గబగబా భానుమూర్తి దగ్గరకెళ్ళి "ఏవండీ, మీ నాన్నగారు నిజంగానే వెళ్లిపోతున్నారండి" అన్చెప్పాడు.

"ఆయన ఎక్కడికి వెళ్తున్నాడో మాకు తెలుసులే" అన్నాడు భానుమూర్తి.




**మా**ధవరావు జితేంద్రకి, అతని బృందానికి తెలియజేసిన గతం సమాప్తమైంది. అందరి హృదయాలు బరువెక్కాయి. అందరి కళ్లలోనూ నీటి తెరలు రెపరెపలాడుతున్నాయి. మాధవరావు తను యింట్లోనించి నిష్క్రమించిన రోజు రాత్రి గురించే యింకా చెప్తున్నాడు.

"ఆ రాత్రంతా నేను గమ్యం తెలియని బాటసారిలాగే తిరిగాను. నా గురించి నేను ఆలోచిద్దామనుకుంటే... కరిగిపోయిన గతం, తిరిగిరాని కాలం గురించి ఆలోచించడం వలన ప్రయోజనంలేదు. భవిష్యత్తు గురించి ఆలోచిద్దామంటే... నేను వెళ్లాల్సిన అన్నిదారులూ మూసుకుపోయాయి. సముద్రపుటొడ్డుకి చేరుకు

న్నాను. సముద్రతరంగాలు చేసే ఘోష తప్ప, చీకట్లో సముద్రం స్పష్టంగా కనబడ్డంలేదు. ఇసుకలో కూర్చుని ఆలోచిస్తున్నప్పుడే రాత్రిపూట పెట్రోలింగ్ చేస్తున్న పోలీసులు జీపుమీద వచ్చారు. నేను ఆత్మహత్య చేసుకోడానికి వచ్చాననుకుని, నేనెంత చెప్పినా వినకుండా, నన్ను లాక్కెళ్లి జీపులో వేసి పోలీస్ స్టేషన్కి తీసుకొచ్చి ఆ రాత్రంతా నన్ను సెల్ లో వుంచారు.

అక్కడే నాకు ఆత్మ విమర్శ జరిగింది. నేనెవర్ని? నేనేం చేసాను? ఏం చెయ్యాలి? నా తల్లిదండ్రులకి ఓ కొడుకుగా పుట్టాను. తర్వాత వివాహం చేసుకుని ఒక స్త్రీకి భర్తనయ్యాను. ఓ కొడుకు పుట్టాక తండ్రిగా మారాను. తండ్రి అయిన మరుక్షణమే నాకున్న భర్త హోదాని రద్దు చేస్తూ, నా భార్య మరణించింది. దాంతో అంతవరకు భర్త అనే బాధ్యత ఎగిరిపోయి, తండ్రి అనే బాధ్యత ఒక్కటే మిగిలిపోయింది. ఆ బాధ్యతని కూడా సక్రమంగా నెరవేర్చి, నా కొడుకుని గవర్నమెంట్ ఆఫీసర్ని చేయగలిగాను... ఆ తర్వాత ఏర్పడిన 'మామగారు', 'తాతగారు' హోదాలకి నేను తగనని నిరూపణయింది. తండ్రి హోదా, మామగారి హోదా, తాతగారి హోదా... యిలా నాకున్న అన్ని హోదాలు రద్దయిపోయాక... యింక నేను నా కోసమే బతకాలి. నేను నేనుగానే జీవించాలి. అలా జీవించడం అవసరమా? పుట్టుకతో ఏర్పడిన బంధాలు చావుతో పరిసమాప్తమవుతాయంటారు. కానీ, కొంతమంది దురదృష్టవంతులకి ఆ బంధాలన్నీ మధ్యలోనే తెగిపోతాయి. దారి తప్పిపోతున్న మానవ సంబంధాలన్నీ ఇలాగే ప్రయాణిస్తే.. చివరికవి చేరేవి రసరమ్య తీరాలకా? లేక, విషసర్ప కౌగిళ్లకా? అని నేను ప్రశ్నించుకునేవాడిని. కానీ, బంధాలన్నింటినించి బైటపడ్డాక అలా ప్రశ్నించుకోవలసిన అవసరమే కనబడలేదు.

నన్ను ఆ భగవంతుడు ఎందుకోసమైతే ఈ భూమ్మీదకి పంపించాడో.. ఆ పని పూర్తయిపోయింది కాబట్టి.. మళ్లీ నేను ఎక్కణ్ణించి వచ్చానో అక్కడికే వెళ్లిపోవాలని నిర్ణయించుకున్నాను. నా మరణం ఈ ప్రపంచానికిగానీ, ఈ దేశానికి గానీ, ఈ నగరానికి గానీ ఎలాంటి లోటూ కలిగించదు. కనీసం, నా కుటుంబానికి కూడా ఎలాంటి కష్టము, నష్టము కలిగించదు. నా మరణం గురించి పేపర్లో రాయరు, టీవీలో చెప్పరు. నేను చనిపోయాక సంతాపసభలు, సంస్మరణ సభలు జరగవు. కొంతమంది మరణించినప్పుడు, కుటుంబసభ్యులు ఆ వ్యక్తి ఫొటోని పేపర్లో వేయిస్తారు. కానీ, నన్ను వేస్ట్ కేరక్టర్గా ముద్రకొట్టేసినవాళ్లు, నేను చనిపోయాక డబ్బు ఖర్చుపెట్టి, నా ఫొటోని పేపర్లో వేయిస్తారనే భ్రమలేవీ నాకు లేవు. గోడకి వేళ్లాడే నా ఫొటోకి దండ ఉండదు. అసలు నా ఫొటోయే ఇంట్లో లేనప్పుడు, దండలు వేళ్లాడే అవకాశమే ఉండదు. మా ఇంట్లో చాలా సంవత్సరాల క్రితం ఓ కర్ర కుర్చీ ఉండేది. అది విరిగిపోతే పారేసాం. మళ్లీ దాని గురించి ఏనాడూ, ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు. ఇప్పుడు నా గురించీ అంతే! అందరూ త్వరగానే మర్చిపోతారు! మర్చిపోడానికి ఎక్కువ కాలం పట్టదు.

తెల్లవారింది. నేనీ లోకం నించి నా స్వస్థలమయిన పరలోకానికి వెళ్లిపోడానికి నిర్ణయించుకున్న ఓ గంట తర్వాత ఇన్స్పెక్టర్ గారు డ్యూటీకి వచ్చారు. నాకు అతన్తో కాస్త ముఖ పరిచయం ఉండటం వలన, అతను నన్ను చూడగానే వదిలేసాడు. అక్కణ్ణించే నేనాకొండ దగ్గరకి వచ్చాను. ఆ తర్వాత జరిగిందంతా, నీతో

ముడిపడిందే కాబట్టి, ఆ వివరాలు ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు"

మాధవరావు ఆగాడు. అక్కడున్నవారంతా ఒకరినొకరు మౌనంగా చూసుకున్నారు తప్ప, వెంటనే ఏం మాట్లాడాలో ఎవరికీ అర్థం కాలేదు. మాధవరావు జీవితంలోని విషాదాన్ని విన్నాక జితేంద్ర మనసుని ఎవరో పిడికిటితో పట్టుకుని బలంగా నులిమేసినట్టుగా విలవిల్లాడిపోయాడు. అతను తనని కనిపారేసిన తల్లి దండ్రులెవరో తెలీనందుకు ఏడ్చాడు. తర్వాత పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులు చనిపోయినప్పుడు ఏడ్చాడు. ఇలా జీవితంలో కొన్ని సందర్భాల్లో రోదించినా... ఆ రోదనంతా తన కోసమే! కానీ, మొదటి సారిగా మరొకరి జీవితంలోని విషాదాన్ని తెలుసుకుని ఏడ్చాడు. కొన్ని నిమిషాలు గడిచాక, తమ అనుభూతికి అక్షరాల్ని జత చేసి మాట్లాడారు అక్కడివాళ్ళు.

"మీరు గుంటూరు వెంకట్రావుగా హుషారుగా నటిస్తుంటే, మీరు చాలా గొప్ప నటులని మాకనిపించింది. కానీ, మీరు అగ్నిపర్వతాన్ని మనసులో దాచుకుని నవ్వుతూ నవ్వించడం చూసాక మీరు మహనీయులనిపించింది" అన్నాడు ఓ కుర్రాడు.

"బాబాయ్‌గారు మేరు పర్వతమే! కానీ, ఆ పర్వతాన్ని సైతం పేల్చేసిన డైనమేట్ వాళ్లబ్బాయి"

"హిరణ్యకశిపుడిలాంటి రాక్షసుడి కడుపున, ప్రహ్లాదుడిలాంటి మహాభక్తుడు పుట్టాడని చదివాం. కానీ ఇక్కడ మీ స్టోరీలో ప్రహ్లాదుడి కడుపున హిరణ్యకశిపుడు పుట్టాడు! మీలాంటివాడికి అలాంటి వాడెలా పుట్టాడు? "

"బాబాయ్ తన కథ చెప్పేటప్పుడు చెప్పాడుగా! పులి కడుపున పులే పుడుతుంది. పక్షి కడుపున పక్షే పుడుతుంది. మనిషి కడుపున మనిషి పుడతాడు... కానీ, మంచివాడి కడుపున మంచివాడే పుడతాడన్న గ్యారెంటీ లేదు. ఆ మాట బాబాయి విషయంలో అక్షరాలా జరిగింది. లేకపోతే, అంత చదువులు చదువుకుని కూడా, ఇంత సంస్కారహీనంగా ప్రవర్తించడమేంటి? "

ఇవన్నీ అక్కడున్న యువకుల మాటలు! వారి అభిప్రాయాలు. శోభ కూడా తన అభిప్రాయాన్ని తెలియజేసింది. "చదువు సంస్కారం అంటూ అందరూ ఈ రెండు మాటల్ని కలిపి మాట్లాడతారుగానీ, ఆ రెండు మాటల మధ్య విశాఖపట్నానికీ, విజయవాడకి మధ్యనున్నంత దూరం ఉంది. మా నాన్నగారి సంగతేంటి? ఆయన ద్విభాషా పండితుడు. మహా రామభక్తుడు. రామాయణాన్ని కూడా రాస్తున్నాడు. కానీ తన కూతురు విషయం వచ్చేసరికి ఎంత సంకుచితంగా ఆలోచించి, ఎంతకు తెగించాడో మీకూ తెలుసుగా! మా ఇంట్లో మా నాన్న... వీళ్లింట్లో వీళ్ల బ్బాయి చదువుకున్న సంస్కారహీనులు"

ఇలా వారంతా చాలాసేపు చర్చించుకున్నాక, జితేంద్ర మాధవరావుకి ధైర్యం చెపుతూ "మీ సమస్య గురించి మాకు చెప్పారు. నిజానికి మీరు చెప్పింది సమస్య గురించి కాదు. మీ జీవితం గురించి! కొంతమందికి వాళ్ల జీవితమే ఓ సమస్యగా మారిపోతుంది. ఇంక ఈ సమస్య గురించి మాకు వదిలెయ్యండి. పరిష్కారం మేం చేస్తాం" అన్నాడు.

శూన్యంలోకి చూస్తున్న మాధవరావు జితేంద్ర వైపు తిరిగి అడిగాడు. "పరిష్కారమంటే ఏం చేస్తారు? మాణిక్యంలాంటి మా భానుమూర్తి పెళ్లైంతర్వాత మసిబొగ్గుగా మారిపోయాడు. మీరు మంచితనం అనే పాలతో ఆ మసిబొగ్గుని కడగాలని ప్రయత్నిస్తే, తెల్లగా ఉండే పాలు నల్లబడి





# మనసున ఉన్నదీ...



★ అక్టోబరు 'చతుర' నవల 'ఒకఆడ + ఒక మగ' ఏకబిగువున చదివాను. సింహప్రసాద్ సరికొత్త కథాంశంతో కథ నడిపించారు. సహజీవనం మనదేశానికి సరిపోదు. నవల చివర్లో మన వివాహవ్యవస్థ గురించి రచయిత చెప్పిన మాటలు ఆ సంగతిని నిరూపించాయి. సమకాలీన అంశాలతో 'కొత్తగాలి' కవితలు బాగా ఆకట్టుకుంటున్నాయి.

**– జి.జి.కె. రావు,** శ్రీకాకుళం

★ సమాజంలో వెర్రితలలు వేస్తున్న యువత పోకడకు చెంప పెట్టులాంటి చక్కటి నవలను అందించిన రచయిత సింహప్రసాద్‌కు కృతజ్ఞతలు. వివాహవ్యవస్థ కల్పించే భద్రత, ఆ బంధంలోని పవిత్రతను విశ్లేషించిన తీరు చాలా బాగుంది. 'చతుర'కథల పట్ల మరింత శ్రద్ధ తీసుకోగలరు. కొత్తశీర్షిక కోసం ఎదురు చూస్తున్నాం.

**– పి. హైమావతి,** దండేపల్లి, ఆదిలాబాద్ జిల్లా

★ అక్టోబరు నవల చదివిన ప్రతివారు సహజీవనం పట్ల మనసు మార్చుకుని వివాహ బంధమే మంచిదనే అభిప్రాయానికి వస్తారు. 'అక్షరధార' మమ్మల్ని బాగా అలరించింది. కొత్త శీర్షిక 'నవలావలోకనం'ను స్వాగతిస్తున్నాం. 'అమెరికా తపాలా వ్యవస్థ' తీరుతెన్నులు చదివి ఆశ్చర్యపోయాం. ఇంటింటికీ వెళ్లి ఉత్తరాలివ్వడమేగాక వారినుంచి లేఖలను తీసుకోవడం గొప్ప విషయమే కదా!?

**– కరణం నాగశ్వేత,** బెంగళూరు

★ ఆధునిక యువత పోకడకు దర్పణం పట్టిన నవల 'ఒకఆడ+ఒకమగ'. రచయిత స్త్రీల మనోభావాలను చక్కగా విశ్లేషించారు. చతురలో వస్తున్న నవలలు వేటికవే మిన్నగా ఉంటున్నాయి.

**– కాళహస్తి వెంకటశేషగిరిరావు,** నెల్లూరు

★ సింహప్రసాద్ నవల 'ఒక ఆడ+ ఒక మగ' ఆద్యంతం ఉత్కంఠభరితంగా చదివించింది. స్త్రీ పురుషుల సంబంధాన్ని చక్కగా విశ్లేషించి మా మదిని దోచుకుంది. 'చతుర కథలు' బాగున్నాయి.

**– బిక్కునూరి రాజేశ్వర్,** పొన్కల్

★ అక్టోబరు నవల 'ఒక ఆడ + ఒక మగ' ఏకబిగిన చదివించింది. విభిన్న కథావస్తువుని ఎన్నుకున్న రచయిత అభినందనీయులు. పాశ్చాత్య పోకడల్లో ఒకటైన 'లివింగ్ టుగెదర్' దుష్ఫలితాల్ని చిత్రించిన తీరు శ్లాఘనీయం.

**– హుమాయున్ సంఘీర్,** హైదరాబాద్

★ ఐ.టి నేపథ్యంతో పెళ్లి కేంద్రవస్తువుగా వివాహవ్యవస్థ అవసరం, ఔన్నత్యం, ప్రాముఖ్యం, విశిష్టతను చక్కగా విశ్లేషించింది అక్టోబరు నవల. పాశ్చాత్య సంస్కృతిని గుడ్డిగా అనుకరించడం వల్ల తలెత్తే అనర్థాలను విశదపరిచింది. 'వివాహవేదం' గ్రంథ రచయిత కలం నుండి వెలువడినందున ఈ నవల పెళ్లి విషయమై సమగ్రతను సంతరించుకుంది.

**– మహమ్మద్ తహసీన్ అలి,** వడ్డెపల్లి, వరంగల్ జిల్లా

పోతాయిగానీ... నల్లగా ఉండే మసిబొగ్గు మాత్రం తెల్లబడదు. నీ విషయం నేను పరిష్కరించగలిగానంటే... అందుకు కారణం ఆ రామదాసులో ఎంతో కొంత మానవత్వం మిగిలి ఉండడం! కానీ, మా భానుమూర్తిలోనించి మానవత్వం మాయమైపోయి చాన్నాళ్లయింది. ఇప్పుడు వాడి శరీరంలో రక్తమాంసాలు మాత్రమే ఉన్నాయి. ఆ రక్తంలో కూడా స్వార్థం, అత్యాశ అనే రెండు కణాలే ఉన్నాయి. మీరు వాణ్ణి మార్చలేరు. వాడిని ఆడిస్తున్న రింగ్ మాస్టర్లు వాణ్ణి మారనివ్వరు"

జితేంద్ర కాస్సేపు ఆలోచించి, తన ఆత్మవిశ్వాసాన్ని వ్యక్తంచేస్తూ చెప్పాడు. "చూడండి.. నా విషయంలో నేను చాలా అధైర్యపడిన మాట నిజం. నేను రచయితగా కథలు, నాటకాలు రాసినప్పుడు కొన్ని కొన్ని మంచి విషయాలే రాసాను.

మనిషికి ఆశ ఉండాలి. అత్యాశ ఉండకూడదు. ఒకవేళ, అత్యాశ ఉన్నా ఫర్వాలేదు... నిరాశ మాత్రం ఉండకూడదని రాసిన మాట నిజం! భయం అనేది జీవితంలో చిన్నభాగంగానే ఉండాలి తప్ప, అదే జీవితంగా మారిపోతే... మన భయాలే మనల్ని చంపేస్తాయి. నా సమస్య నన్ను భయపెట్టేసరికి, నేను ఆత్మహత్యవైపు పరుగుతీసిన మాట నిజం! నాలో సమాధానం చెప్పుకోలేని కొన్ని ప్రశ్నలు కూడా తలెత్తాయి. నాకు అర్హత లేని ప్రేమ గురించి నేను ప్రయత్నించానా? నన్ను ప్రేమించిన శోభకి నాకు తెలీకుండానే నేను అపకారం చేస్తున్నానా? అనే ప్రశ్నలకు సమాధానం చెప్పుకోలేని దుస్థితిని అనుభవించాను. నాలోని తెలివిని, ఆలోచనని, నన్ను ఆవరించిన నిరాశా నిస్పృహలు అధిగమించాయి. ఆ క్షణంలో నాలోని ధీరత్వం తగ్గిపోయి, భీరత్వం అధిగమించింది. నన్ను ఆత్మహత్యవైపు పరుగు తీయించింది. కానీ ఎంతో అనూహ్యంగా అక్కడ మీరు పరిచయమయ్యారు. ప్రేమలో పరాజితుణ్ణయిపోయానని బాధపడుతున్న నన్ను ప్రేమవిజేతని చేసి నా వివాహం జరిపించారు. ఇప్పుడు నామీద నాకు నమ్మకం పెరిగింది. నా హితైషికి, నా ఆపద్బాంధవుడికి నేను ఏదైనా సాయం చెయ్యకపోతే, నేను మానవత్వం ఉన్న మనిషిని కాదనే భావన కూడా కలిగింది. ప్రయత్నంలో చిత్తశుద్ధి ఉంటే ఫలితాలు చక్కగా వస్తాయన్న నమ్మకంతోనే ఈ పనికి పూనుకుంటున్నాను. ఇప్పుడిక జితేంద్ర అంటే ఒక్కరు కాదు.. ఎనిమిది మంది" అంటూ తన చుట్టూ ఉన్న స్నేహితుల్ని ఆనందంగా చూపించాడు.

"ఔనండి. ఇప్పుడు జితేంద్ర అంటే ఎనిమిది మంది సైన్యం" అన్నాడు మధు అనే స్నేహితుడు.

శోభ నవ్వుతూ ఆ మాటనే కాస్త సవరించింది. "మీరు చెప్పింది నిన్నటి లెక్క. ఆ మాటను యిప్పుడు సవరించాలి. ఈ జితేంద్ర అంటే నాతో కలిపి తొమ్మిది మంది" అంది.

అందరూ చప్పట్లు కొట్టి తమ హర్షాన్ని ప్రకటించారు.

★ ★ ★

భానుమూర్తి యింటినించి మాధవరావు నిష్క్రమించిన మర్నాడే ఢిల్లీనించి వచ్చిన అతిథులు వెళ్లిపోయారు. రెండురోజుల వరకు మాధవరావు ప్రస్తావనే రాలేదు. కానీ, మనోరమ, రేఖా, భానూల్ని చెడామడా మాటలతో కడిగేసి, కొట్టడానిక్కూడా సాహసించిన వంటమనిషి వీరమ్మ ఆ అపార్ట్‌మెంట్స్‌లో రెండవ అంతస్తులో వుండే శ్రీహరి గారింట్లో వంట మనిషిగా కుదరడం గురించి మాత్రం కాస్త ఆలోచించారు. ఓ రోజు మనోరమ, రేఖా రెండవ ఫ్లోర్‌లో వున్న వెంకటేశ్వర్రావు గారింటి పేరంటానికి వెళ్లినప్పుడు వాళ్లకి వీరమ్మ ఎదురుపడేసరికి సడన్‌గా పెద్దపులికి ఎదురుపడిన ఆడ మేకల్లా బెదిరిపోయారు. తల తిప్పుకుని గబగబా ముందుకు వెళ్లిపోయారు. ఆరోజు ఆ ఘర్షణ జరిగాక వీరమ్మ ఆ అపార్ట్‌మెంట్స్‌నించే వెళ్లిపోయిందనుకున్నారు. వీరమ్మంటే తెలియని భయం పట్టుకుంది. ఆ మర్నాడే మనోరమ రెండవ అంతస్తు శ్రీహరి గారింటికి ఫోన్‌చేస్తే అతని భార్య సీతాలక్ష్మి ఫోన్ అందుకుంది. ఆవిడ నిర్మొహమాటస్థురాలు. ఎవరికి ఏది చెప్పినా ధడేల్‌మంటూ చెప్పేస్తుంది తప్ప ఎదుటివాళ్లు ఏం అనుకుంటారని కూడా ఆలోచించదు. ఆ విషయం మనోరమకి, రేఖకీ తెలీదు.

"సీతాలక్ష్మిగారూ నమస్కారం, నేను క్లాస్‌ఒన్ గవర్నమెంట్ ఆఫీసర్ భాను

మూర్తి అత్తగార్ని. నాపేరు మనోరమ" అంది వీలున్నంత హుందాతనాన్ని గొంతులో ధ్వనింపజేస్తూ.

"మీ గురించి విన్నానులెండి" అంది సీతాలక్ష్మి ముక్తసరిగా.

"వినే వుంటార్లెండి. మాది స్వతహాగా రాయల్ ఫ్యామిలీగదా!"

"ఆ గొప్పల గురించి నేనేం వినలేదు. మీ అమ్మాయికి పెళ్లైన దగ్గర్నించీ, మీరూ యిక్కడే వుంటున్నారనే విన్నాను"

"మా పాప నేను లేకుండా ఒంటరిగా వుండలేదు. నా పెంపకం అలాంటిది. పైగా మా అల్లుడుగారు నన్నిక్కడే వుండి పొమ్మని శతపోరుపెట్టి అడుగుతుంటే కాదనలేకపోయాను. ఏంటోనండి... మనం మనం ఒకే అపార్ట్‌మెంట్స్‌లో వుంటున్నామన్న పేరేగానీ.. మనం అప్పుడప్పుడైనా కలుసుకుంటే బాగుంటుంది కదా! అప్పుడప్పుడు మా ఫ్లాట్‌కి వస్తుండండి"

**కొత్తగాలి...**

**ఉగ్రవాదులు**
**ఊళ్లో..!**
**ప్రజల రక్షణ**
**గాల్లో..!!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

"ఎందుకు? మీతోపాటు పేకాటలాడటానికా? నాకు పేకాటాడ్డం చేతకాదు. నేర్చుకోను కూడా! మరో ఆడది ఆడుతున్నా నేను సహించలేను. అయినా, యింటిపనీ, వంటపనీ చేస్కోవలసిన ఆడదానికి యిదేం దరిద్రపుగొట్టు అలవాటండి! ఛీఛీ" సీతాలక్ష్మి ఫెడీమని ముఖం మీద కొట్టినట్టు చెప్పేసరికి మనోరమ కాస్త అదిరిపడింది. స్పీకర్ ఆన్ చేసి వుండడంవల్ల ఆ మాటలు రేఖకి కూడా వినిపించి, గతుక్కుమంది.

"ఇంతకీ విషయమేంటో చెప్పండి" మళ్లీ సీతాలక్ష్మి అడిగింది.

దాంతో మనోరమ కాస్త గొంతు తగ్గించి "ఇహిహి! కొంతమందికి పేకాట, చదరంగంలాంటి ఇన్‌డోర్ గేమ్స్ అంటే యిష్టం వుండవులెండి. కానీ, మాది రాయల్ ఫ్యామిలీ కాబట్టి.. వింటున్నారా, మాది రాయల్ ఫ్యామిలీ కాబట్టి.." అంటుంటే సీతాలక్ష్మి కస్సుమంటూ కసురుకుంటున్నట్టుగా జవాబు చెప్పింది.

"ఏంటండీ, అక్కడకి మీరేదో శ్రీకృష్ణదేవరాయలకి సెకెండ్ వైఫ్‌లా మాటకి పదిసార్లు మాది రాయల్ ఫ్యామిలీ, మాది రాయల్ ఫ్యామిలీ అంటారేంటి? ఇంతకీ, మీరెందుకు ఫోన్ చేసారో చెప్తే నేను మిగతా పనులు చూసుకుంటాను కదా! ఏ పనీ చెయ్యకుండా పెంటపాడు పోలేరమ్మలా కూర్చోవడం నాకిష్టం వుండదు. చెప్పండి. విషయమేంటి?"

మనోరమతో తాహతుకు మించి, నువ్వా? నేనా? అని ఎదిరించి మాట్లాడిన మొట్టమొదటి మనిషి వీరమ్మే! ఆవిడంటే చదువూ సంధ్యాలేని అలగా మనిషి కాబట్టి అలా మర్యాద లేకుండా మాట్లాడిందని సరిపెట్టుకుంది. కానీ, యిప్పుడు బాగా చదువుకుని, నడివయసుకి చేరుకున్న సీతాలక్ష్మి అంతకంటే ఘాటుగా మాట్లాడేసరికి ఫోన్ ఆఫ్ చేద్దామనుకుంది. తల్లి ముఖకవళికల్ని గమనించి రేఖ ఫోన్ అందుకుని మాట్లాడింది.

"నేనండీ భానూగారి భార్య రేఖని మాట్లాడుతున్నాను. మేం ఎందుకు ఫోన్ చేసామంటే ఆ పొగరుమోతు రాస్కెల్ వీరమ్మ సంగతి తెలీక మీ యింట్లో పని

మనిషిగా పెట్టుకున్నారని తెలిసింది. అదుత్త దొంగండి. మా యింట్లో చాలా సార్లు చిన్న చిన్న దొంగతనాలు చేసినా, పోనీ కదాని క్షమించాం. కానీ మా యింటికొచ్చిన గెస్టుల తాలూకు వస్తువుల్ని కూడా కొట్టేస్తే దాన్ని శుబ్బరంగా చితగ్గొట్టి తగలేసాం.." అంటూ జరిగిన సంఘటనలోని ఒక్క నిజమూ చెప్పకుండా, అన్నీ అబద్ధాలే చెప్పింది.

సీతాలక్ష్మి ఆసక్తిగా "ఆహా ఓహో" అంటూ అడుగుతున్న కొద్దీ రేఖ మరిన్ని అబద్ధాలు చెప్పి, వీరమ్మని పనిలోంచి తీసెయ్యమంది. అంతా విన్నాక సీతాలక్ష్మి తన ధోరణిలోనే సమాధానం చెప్పింది.

"మీరు యిప్పుడు చెప్పినదాంట్లో ఒక్క వాక్యం కాదుగదా, ఒక్క మాట కాదు గదా ఒక్క అక్షరం కూడా కరెక్ట్ కాదు. ఆ వీరమ్మని మీరు పనిలోనించి తీసెయ్యడం కాదు. మీ అందర్నీ చెడామడా తిట్టి, మీ అమ్మగార్ని కొట్టినంత పనిచేసి, తనే పని మానేసి వెళ్లిపోయింది. అసలారోజు ఏం జరిగిందో చెప్పమంటారా?" అంటూ ఆ రోజు జరిగిందంతా ప్రత్యక్షంగా చూసినంత వివరంగా చెప్పింది. ఆవిడంత వివరంగా వాస్తవాల్ని ఎలా చెప్పగలిగిందని తల్లీకూతుర్లు నివ్వెరపోయారు. అయినా తమ నివ్వెరపాటుని ఆమెకు తెలియనివ్వకుండా "ఔనండి. మా చేత మెడ పట్టుకుని గెంటించుకున్న మనిషి అలా చెప్పక, మరెలా చెప్తుంది?" అన్నారు.

"లేదు లేదు.. వీరమ్మ యీరోజు వరకు మీ ఇంటి గొడవ విషయమే ప్రస్తావించలేదు. మన అపార్ట్‌మెంట్స్‌లో వుండే జోగినాథం అంతా చెప్పాడు. నాకే కాదులెండి. మా ఫ్లోర్‌లో వున్నవాళ్లందర్నీ పోగేసి చెప్పాడు. విన్నవాళ్ళలో నేనూ వున్నాను. అయినా జరిగిందాంట్లో వీరమ్మ తప్పేం వుందండీ? ఆవిడలాంటివాళ్లకి రెక్కాడితే గానీ డొక్కాడదు. అలాంటివాళ్లు యజమానుల మీదే చెయ్యెత్తే లెవెల్‌కి వచ్చారంటే.. ఆ యజమానులెంత అమానుషంగా ప్రవర్తించి వుండాలి? దీనివల్ల మనకి తెలిసిన నీతి ఏంటంటే.. మనం యజమానులం, రాయల్ ఫ్యామిలీ మనుషులం అని అధిక ప్రసంగాలు, అనవసర ప్రసంగాలు చేస్తే... మనం పెంచుకున్న కుక్కలే మనల్ని కరిచేస్తాయి" అన్చెప్పి ఫోన్ ఆఫ్ చేసింది సీతాలక్ష్మి.

ఆమె యిచ్చిన సమాధానంతో తల్లీకూ

## అక్టోబరు - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం** - శేరిలింగంపల్లి, హైదరాబాద్
2. **పి. వి. రవికుమార్** - తిరుపతి, చిత్తూరు జిల్లా
3. **పి. హైమావతి** - మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా
4. **సౌదామిని** - శ్రీ నగర్, విశాఖపట్నం
5. **కరణం సుధీంద్రరావు** - మేదరివీధి, కర్నూలు

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ఇద్దరు | 6. మల్టీపల్ స్క్లెరోసిస్ |
| 2. అనురాగ్ | 7. అనసూయ |
| 3. శృతి | 8. హైదరాబాద్ |
| 4. దీపిక | 9. సెంటు వాసన |
| 5. సతీష్ | 10. ఓంకారం |

తుళ్ల అహం తీవ్రంగా దెబ్బతిన్నది. వీర మ్మని పనిలోనించి తీసెయ్యమని సీతాల క్ష్మికి ఫోన్‌చేసి చెప్పకుండా ఉండివుంటే బావుండేదనుకున్నారు. ఆ రోజు జరిగిన ఘర్షణ, వీరమ్మ చేసిన తిరుగుబాటు, మనోరమని కొట్టబోవడమంతా జోగినా థం ద్వారా అపార్ట్‌మెంట్స్‌లో అందరికీ తెలిసిపోయినందుకు అతన్ని తిట్టుకు న్నారు.

సాయంత్రం ఆరున్నర గంటల సమయం! కాలింగ్‌బెల్ మోగితే భాను మూర్తి, మనోరమ, రేఖ వీధి తలుపువైపు చూసారు. తలుపు బార్లా తెరిచే వుంది.

## కొత్తగాలి...



**నిశ్శబ్దంలో శబ్దమై**
**శబ్దంలో నిశ్శబ్దమై**
**నీకు స్ఫూర్తిగా వెలగాలి**
**నిత్యసత్యమై నిలవాలి**

– పి. హైమావతి,
దండెపల్లి, ఆదిలాబాద్ జిల్లా

గుమ్మం బయట నిలబడిన వ్యక్తిని చూసి ముగ్గురూ కాస్త అదిరి పడ్డారు. ముఖ్యంగా ఆడవాళ్లిద్దరూ రవ్వంత భయపడ్డారు.

ఆ వ్యక్తి.. వీరమ్మ!

ఆవిడకి సీతాలక్ష్మి వుదయం జరిగిన ఫోన్ సంభాషణ గురించి చెప్తే, ఇప్పుడు తమతో గొడవ పడ్డానికి వచ్చిందాని తల్లీ కూతుళ్లిద్దరూ అనుమానించారు.

"మీ ముగ్గురితో ఓ మాట సెప్పాలని వచ్చాను. నాకు సిగ్గూ శెరమూ, చీమూ నెత్తురూ వున్నాయి. కాబట్టి నేను మీ యింట్లోకి అడుగుపెట్టను. అంచేత మీరే ఇక్కడికి రండి. లేకపోతే, నేనే యిక్కణ్ణించి గట్టిగా మాట్లాడతాను. నా నోటి సంగతి తెలుసుగా. ఇక్కడ మాట్లాడితే పక్కవీధిలోకి వినిపిస్తాది. చెప్పండి, మీరొస్తారా? నన్ను అరవమంటారా?" అంది వీరమ్మ.

ఆఫ్టరాల్ ఓ పనిమనిషి శాసిస్తే మనం వెళ్ళడం ఏంటని కూడా ఆలోచించకుండా- ముగ్గురూ గుమ్మం దగ్గరికి వచ్చి నిలబడ్డారు.

"చూడండి. నేను దొంగతనాలూ ఖూనీలు చేస్తే మీరు తన్ని తగిలేసారని ఫోన్లు చేసి ఎంతమందికి చెప్పినా నేను భయపడను. పొద్దుట సీతాలక్ష్మి మేడమ్ గారితో మీ తల్లీకూతుళ్ళేం చెప్పారో నాకు తెలిసింది. ఆ రోజు నాలాంటి లేబర్ మనిషి మిమ్మల్ని కొట్టడానికి చెయ్యెత్తగానే మీ పెద్దరికాలన్నీ పెంటకుప్ప మీదకెళ్ళిపోయాయి. అంచేత ఇప్పుణ్ణేను మిమ్మల్ని తిట్టడానికో, కొట్టడానికో రాలేదు. ధర్మరాజులాంటి ఇంటియజమాన్ని వుత్త పున్నేనికి ఇంట్లోనించి తగిలేశారు. ఆ తర్వాత ఆయన చచ్చేడా? బతికేడా? బతికితే ఎక్కడున్నాడు? అని కూడా మీరు ఆలోచించలేదు. కనీసం వెదకలేదు. ఈ ఆడాళ్లంటే నిన్న కాక మొన్న వచ్చినవాళ్ళు. కానీ, మిమ్మల్ని చిన్నప్పటి నుంచీ కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చిన తండ్రి బాబూ ఆయన! మీరైనా నాన్నగార్ని వెదికి తీసుకురండి. మీరు గవర్నమెంటు ఆఫీసరుగా కాదు... మనసున్న మనిషిగా ఆలోచించండి. లేకపోతే, మీ అంత నికృష్టపు మనిషి మరొకడుండడు. ఓ పని మనిషొచ్చి చెప్పాక్కూడా మీరు వెతక్కపోతే, మీది మనిషి పుట్టుకే కాదు" అన్జెప్పి వీరమ్మ ఆవేశంగా వెళ్లిపోయింది.

వీరమ్మ వచ్చి తామందర్నీ ఆదేశిస్తున్నట్లుగా చెప్పాక కూడా వారెవరికీ మాధవరావుని వెదకాలనే ఆసక్తి కలగలేదు. కానీ.. ఆవిడ చెప్పిన ఆఖరి వ్యాఖ్యల

గురించే భానుమూర్తి బాగా ఆలోచించాడు. మా నాన్న తప్పకుండా రాధాబాయ్ ఇంట్లోనే వుంటాడు. కాకపోతే, ఆ విషయం నిర్ధారించుకోవాలి. ఫోన్‌చేసి కనుక్కోవడానికి ఆవిడ ఫోన్ నెంబరు తెలీదు. ఆవిడ ఇల్లు మాత్రం తెలుసు.

"నేనెళ్ళి అతనక్కడ వున్నాడో లేడో కనుక్కుంటాను. అక్కడ లేకపోతే రాఘవ అంకుల్‌కి ఫోన్‌చేసి మామూలుగా మాట్లాడుతూ మా నాన్న వచ్చేడా అని అడుగుతాను" అన్నాడు.

"అతను కచ్చితంగా రాధాబాయ్ ఇంట్లోనే దేవురిస్తాడు. వున్నాడో, లేడో ఎంక్వయిరీ చెయ్యండి చాలు. ఆ వీరమ్మెదో కూసిందని ఇంటికి లాక్కొచ్చెయ్యకండి" అంది రేఖ.

భానుమూర్తి రాధాబాయ్ వుండే ఇంటి పరిసరాల వరకు వెళ్ళి, ఇంటికి దూరంగా కారు ఆపి, నడుచుకుంటూ వెళ్ళాడు. ఇంటికి తాళం వేసుంది. అక్కడో వృద్ధుడు కూర్చోవడం చూసి, దగ్గరకెళ్ళి "ఈ ఇంట్లో వుండే రాధాబాయ్‌గారు ఎక్కడకెళ్లారండి?" అని అడిగాడు.

"తిరుపతి ఎల్లేరు గదా?" అన్నాడో ముసలాయన.

"ఒక్కరే వెళ్లారా? లేక ఎవరైనా మగ వ్యక్తితో వెళ్లారా?"

"ఎవరో ఒకాయన వచ్చాడండి. దగ్గర దగ్గర అరవై ఏళ్లుంటాయి. అతన్తో కలిసే వెళ్లారు"

భానుమూర్తి నిర్ధారణ చేసుకున్నాడు. వచ్చిన మగాడు తన తండ్రే! ఇద్దరూ కలిసే తిరుపతి వెళ్లారు. "ఎప్పుడొస్తారో నీకు తెలుసా?" అని మళ్ళీ అడిగాడు.

"అమ్మగార్ని అడిగితే, ఇయాళ రాత్రికి వచ్చేస్తానన్నారండి" అన్నాడాయన.

భానూ అక్కణ్ణించే రేఖకి ఫోన్‌చేసి మన వూహ నిజమైందని చెప్పాడు.

★ ★ ★

## భలేభలే!

రొమాంటిక్ కవితోద్యమానికి ఆద్యుడైన ఆంగ్లకవి విలియమ్ వర్డ్స్‌వర్త్ తాను రాసిన పద్యాలను పెంపుడు కుక్కకు వినిపించేవాడట! కుక్క పద్యం విని మౌనంగా ఉంటే అది బాగుందని అనుకునేవాడట. అలాకాక మొరిగితే ఆ పద్యాన్ని తిరిగి రాసేవాడట!

మర్నాడు ఉదయం భానుమూర్తి తన కారుని నడుపుకుంటూ ఆఫీసుకి బయల్దేరాడు. ట్రాఫిక్ తక్కువగా వుంటుంది కదాని, అతను ప్రతిరోజూ ఎడమ వైపు నున్న వీధిలో నుంచి వెళ్తుంటాడు. అతను వెళ్తుంటే ఇద్దరు కుర్రాళ్ళు రోడ్డుకి అడ్డంగా వచ్చారు. భానూ టక్కున బ్రేక్ వేసి ఆ కుర్రాళ్ళ మీద ధూమ్‌ధామ్ అంటుండగా, మరో ఇద్దరు కుర్రాళ్ళు గబగబా వచ్చి కారు ఫ్రంట్ సీట్లో ఒకడు, వెనక సీట్లో మరొకడు కూర్చుండిపోయారు.

"ఏయ్! ఎవరు మీరు?" గద్దించాడు భానూ.

"మేం ఎమ్‌సెట్ ఎగ్జామ్స్ రాయడానికి వెళ్తున్నామండి. ఒక నిమిషం లేట్ అయినా మెయిన్ గేట్ మూసేస్తారండి. మాకు ఒక్క ఆటో కూడా దొరకలేదండి. దయచేసి లిఫ్ట్ ఇవ్వండి" అన్నారు స్టూడెంట్స్.

"షటప్! మీకు ఎగ్జామ్స్ వుంటే మాత్రం నా కారు ఎక్కేస్తారా? మర్యాదగా దిగండి" అని అరిచాడు.

వాళ్లు దిగమని కచ్చితంగా చెప్పేసారు. భానూ పోలీసులకు ఫోన్ చేస్తానంటూ తన సెల్‌ఫోన్ తీసాడు. కారుకి అడ్డం వచ్చిన కుర్రాళ్ళు కారు పక్కనే నిలబడి అతని చేతిలోని సెల్‌ఫోన్ లాక్కున్నారు.

అదే సమయంలో, భానూ పక్కనున్న కుర్రాడు అతని కడుపు మీద కత్తి పెట్టాడు. వెనక సీట్లో వున్న కుర్రాడు మెడ మీద కత్తి పెట్టాడు.

ఆ రెండు కత్తులూ బైటకి కనబడకుండా వాటి మీద తమ కర్చీఫ్‌లు వేసారు.

"నువ్వు కారుని సాగర్‌నగర్‌కి పోనియ్! దార్లో నువ్వు అరిచినా, కారు ఆపినా, నిన్ను పొడిచి మేం పారిపోతాం" అన్నాడో కుర్రాడు భానూతో.

భానులో ప్రాణభయం మేల్కొంది.

"మరి నా సెల్‌ఫోన్?" అన్నాడు.

"దాంతో వాళ్లకి పనుంది. మరోగంట తర్వాత నీ దగ్గరకొస్తుంది, పోనియ్" అన్నాడు వెనక సీట్లో వున్న కుర్రాడు.

భానూ కారుని ముందుకు పోనిచ్చాడు.

కారుకి అడ్డంపడిన కుర్రాళ్లిద్దరూ భానూ వుండే ఫ్లాట్‌కి వచ్చారు. వాళ్లు బోలెడంత భయమూ, టెన్షనూ నటిస్తూ, రేఖ, మనోరమలతో చెప్పారు. "భానూగారికి చిన్న ఏక్సిడెంటయింది. మా ఫ్రెండ్ కారుతో గుద్దాడు. మరేం ఫర్వాలేదండి. చిన్న దెబ్బలే తగిలాయి, సాయంత్రం వరకు అక్కడే రెస్టు తీసుకోవాలి. మిమ్మల్ని తీసుకెళ్లడానికి కారు తీసుకొచ్చాం"

ఆడవాళ్ళు ఆ మాటలు నమ్మలేదు. నగరంలో అనేక నేరాలు పట్టపగలే సినిమా ఫక్కీలో జరిగిపోతున్నాయి కాబట్టి ప్రజలంతా అప్రమత్తంగా వుండాలని టీవీల్లో హెచ్చరిస్తున్నారు పోలీసులు. ఆ విషయం గుర్తొచ్చి రేఖ తన ఫోన్ నించి భానూ ఫోన్‌కి రింగ్ చేసింది. అక్కడున్న ఓ అబ్బాయి చేతిలోని సెల్‌ఫోన్ మోగింది. "చూసారా మేడమ్, మీరు మమ్మల్ని నమ్మరనే భానూగారు మా చేతికి తన సెల్‌ఫోన్ ఇచ్చి పంపించారు" అన్నాడు కుర్రాడు. మరే సంశయం లేకుండా వాళ్ల వెంట కారులో బయల్దేరారు ఆడవాళ్లు.

సాగర్‌నగర్‌లో ఓ బంగళా వుంది. అక్కడే కారు ఆపి రేఖని, మనోరమని లోపలికి తీసుకువెళ్లారు. అక్కడ కొంత మంది కాలేజి స్టూడెంట్స్ కనిపించారు. రెండు ఎదురెదురు వరుసలుగా కుర్చీలు వేసున్నాయి. ఓ వరుసలో ఉన్న కుర్చీలో భానూ కూర్చున్నాడు. ఎదుటి వరుసలో మాధవరావు, అతని ఫ్రెండు రాఘవ, అతని కొడుకు వెంకట్, అతని పక్కనే రాధాబాయ్ కూర్చుంది. రెండు వరసలకి మధ్య జితేంద్ర, శోభ కూర్చున్నారు. తీసుకొచ్చిన ఆడవాళ్ళిద్దర్నీ భానూ పక్కనే కూర్చోబెట్టి, అతని సెల్‌ఫోన్ ఇచ్చేశారు.

అప్పటికే జితేంద్ర భానూని ప్రశ్నించడం ఆరంభించేసాడు. "మేం మీ అందర్నీ ఇక్కడికి రప్పించింది కిడ్నాప్ చేయడానికీ కాదు, బ్లాక్‌మెయిల్ చెయ్యడానికీ కాదు. ఓ సమస్యని సెటిల్ చెయ్యడానికి పిలిపించాం"

"ఓ క్లాస్‌వన్ ఆఫీసర్ని ఎత్తుకొచ్చి, సెటిల్మెంట్ చెయ్యడం ఎంత నేరమో తెలీదా?" భానూ హూంకరించాడు.

"సెటిల్మెంట్లనేవి, ఒక కోర్టులు, పంచాయితీలే కాదు, పోలీసులు, గూండాలు కూడా చేస్తున్నారు. సామాన్యులకి ఎవరైతే భయాన్ని సృష్టించగలరో, వాళ్లంతా సెటి

## కొత్తగాలి...

**ఆస్తులు ఉన్నవాడికి**
**పస్తులు ఉన్నవాడికి**
**ఇద్దరికీ నిద్రపట్టదు**
**ఆస్తులు చాలక ఆకలి తీరక!**

– పుల్లేటికుర్తి సత్యాచార్యులు,
గాజువాక

ల్మెంట్లు చెయ్యడానికి సిద్ధపడిపోతున్నారు. మేం మాత్రం ఎలాంటి స్వార్థంతోనూ చేయడంలేదు. కేవలం మానవతాదృష్టి తోనే చేస్తున్నాం. చెప్పు, మీ నాన్నగార్ని ఇంటినించి ఎందుకు గెంటేసారు? "

మనోరమ రుసరుసలాడుతూ చెప్పింది. "చూసావా అల్లుడూ, మీ నాన్న చెయ్యాల్సిందంతా చేసేశాడు. అనాల్సిందంతా అనేశాడు. కానీ, ఇంటి నుంచి బైటికి వెళ్లి పోయాక ఆ రాధాబాయ్‌తో కలిసి, ఈ అల్లరిగేంగ్‌ని పోగేసాడు. మనల్ని నేరస్థుల్ని చేసి పంచాయితీ జరిపిస్తున్నాడు"

తాము ఎవరి తరపున పంచాయితీ జరపడం లేదని జితేంద్ర ఒకటికి రెండుసార్లు చెప్పాడు. తర్వాత భానూ ఇంట్లో జరిగిన సంఘటనల్ని చెప్పమని గట్టిగా ఒత్తిడి చేశాడు. భానూ గత్యంతరం లేక ఆ విషయాన్ని చెప్తూనే కొన్ని అబద్ధాలు కూడా జోడించాడు. కానీ, జితేంద్ర వాటిని విని "అసలు విషయం అది కాదు ఇదీ" అంటూ అసలు వాస్తవాన్ని తెలియజేసాడు. అలా అతను వాస్తవాలు చెప్పినప్పుడల్లా భానూ, అతని తరఫువాళ్లు కంగుతింటున్నారు.

అంతా విన్నాక జితేంద్ర చాలా సిన్సియర్‌గా, గంభీరంగా చెప్పాడు. "మన కాలిలో ముల్లు గుచ్చుకున్నప్పుడు డాక్టరు ముందా గుచ్చుకున్న ముల్లుని తీసేసి గాయానికి మందు వేసి కట్టు కడతాడు. అలాగే, మనసులోకొచ్చిన అపార్థాల్ని, అనుమానాల్ని ఆ ముల్లుని తీసేసినట్టే తీసెయ్యాలి. లేకపోతే ఏం చెప్పేది, చేసేదీ కూడా మీకు అర్థం కాదు" అంటూ రాధాబాయ్‌ని చూపించి చెప్పాడు.

"ఆవిడే మీ అనుమానాలకి కారణమైన రాధాబాయ్. ఆమె విషయం మీ నాన్నగారి స్నేహితుడైన రాఘవగారే వివరిస్తారు" అన్నాడు.

"భానుమూర్తి మాటకి పదిసార్లు నేను క్లాస్ ఒన్ గవర్నమెంట్ ఆఫీసర్నీ, ఆఫీసర్నీ అంటుంటాడు. అసలతనికి ఆఫీసరు పోస్టెలా వచ్చింది? " అడిగాడు రాఘవ.

"నా మెరిట్ వల్ల వచ్చింది" అరిచాడు భానూ.

"లేదు. మీ నాన్న కట్టిన లంచం వల్ల వచ్చింది. నువ్వు ఇంటర్వ్యూకి వెళ్లినప్పుడు నువ్వు ఏడవ స్థానంలో ఉన్నావు. అక్కడున్నది ఒక్కటే పోస్టు. నీకు ఆఫీసర్ పోస్ట్ ఇవ్వడానికి ఆ సెలక్షన్ బోర్డ్ ఛైర్మన్ ఆరు లక్షలు లంచం అడిగాడు. అప్పుకోసం మీ నాన్నని రాధాబాయ్ ఇంటికి తీసుకెళ్లాను. ఆవిడ భర్త స్టీల్ ప్లాంట్‌లో ఆఫీసరుగా పనిచేస్తూ చనిపోయారు. అప్పుడు ఆవిడకి అందిన డబ్బుని వడ్డీకి ఇస్తున్నానని నాకు చెప్పింది. మాధవరావుని ఆవిడ దగ్గరికి తీసుకువెళ్తే "తనఖా లేకుండా అంత డబ్బు అప్పివ్వలేనని చెప్పింది. అప్పుణ్ణేను నా ఇల్లు తనఖా పెట్టి, అప్పు తీసుకుని మాధవరావుకిచ్చాను. ఆ డబ్బునే లంచంగా కట్టాడు. అప్పట్నించీ, ప్రతినెలా తనకి అందే జీతాన్ని ఆవిడకి వడ్డీగా జమకట్టేవాడు. రిటైరయినప్పుడందిన డబ్బుని రాధాబాయ్‌కిచ్చేసి, అప్పు మొత్తం తీర్చేసి, నా ఇంటి దస్తావేజులు నాకిచ్చేసాడు"

రాఘవ ఇచ్చిన ఈ ఒక్క వివరణతో భానుమూర్తిలోని అనుమానాలు, అపార్థాలు తొలగిపోయి, పశ్చాత్తాపం ప్రారంభం కావాలి. కానీ అలా జరగలేదు. "అతను చెప్పిందే కరెక్టయితే, ఈ విషయాన్ని కన్నకొడుకైన నాక్కూడా ఎందుకు చెప్పలేదు? " ప్రశ్నించాడు భానూ.

"నువ్వు కన్నకొడుకువి కాబట్టే నీకు చెప్పలేదు. నేను ప్యూర్ మెరిట్ మీద సెలక్టయ్యానని నువ్వు గర్వంగా చెప్పుకు తిరుగుతుంటావు గదా! నీకాగర్వాన్ని శాశ్వతంగా మిగల్చాలనే చెప్పలేదు" ఈ వివరణ

కూడా రాఘవది.

ఇక వాదోపవాదాలు చేస్కోడానికి ఏ విషయమూ లేదు. భానూ కాస్సేపు మౌనం వహించి ఓ మాటన్నాడు "ఇట్సాల్ రైట్! నేను మా వాళ్లని ఏదోరకంగా ఒప్పించి ఆయన్ని ఇంటికి తీసుకుపోతాన్లే"

మాధవరావు కూర్చున్న కుర్చీలోంచి ఆవేశంగా లేచి "ఆనీచుడు నన్ను కాళ్లు పట్టుకు బతిమాలినా వాడింటికెళ్లను" అన్నాడు.

"మీరు వెళ్తానన్నా ఆ యింటికి మిమ్మల్ని వెళ్లనివ్వను" జితేంద్ర గంభీరంగా చెప్పాడు.

"వెళ్లనివ్వకేం చేస్తావ్? " భానూ ప్రశ్నించాడు.

"ఆ విషయం చెప్పడానికే మీ అందర్నీ ఇక్కడికి రప్పించాను. వినండి. ఈ లోకంలో ఎవరూ లేని అనాథను నేను. అందరూ ఉండి కూడా అనాథగా బతుకుతున్న మనిషి మాధవరావుగారు. ఆత్మహత్య చేసుకుని తనువులు చాలిద్దాం అనుకునేచోట ఇద్దరం కలిసాం. ఒకర్నొకరం కలుసుకున్నాక, ఒకరి జీవితం ఒకరం తెలుసుకున్నాం. ఒకరికొకరు సాయం చేసుకుంటూ, చనిపోయేదాకా బతుకుబాటలో ముందుకు సాగుతాం. నీలాంటి నీచుడికి తండ్రి విలువ తెలీకపోయినా, తల్లిదండ్రులెవరో తెలియని మాకు వాళ్ల ప్రాముఖ్యత తెలుసు. అందుకే, ఈ రోజు నించీ మాకు దేవుడిచ్చిన తండ్రిగా ఆయన జీవితాంతం మాతోనే ఉంటారు. సాధారణంగా పిల్లల్లేని దంపతులు బిడ్డల్ని దత్తత తీసుకుంటారు. కానీ, మేం చిత్రమైన అనాథలం కాబట్టి... నేనూ నాలాంటి ఏడుగురు అనాథలూ ఈ మహనీయుణ్ణి తండ్రిగా దత్తత తీసుకుంటున్నాం"

ఆ మాటనగానే అక్కడున్న స్టూడెంట్స్ అంతా హర్షధ్వానాలు చేసారు. మాధవరావు ఈ అపురూప సన్నివేశానికి చలించిపోయాడు. అతని హృదయం ఆనందంతో తడిసిపోయింది. రెండు చేతులెత్తి జితేంద్రకి నమస్కరించబోతే, అతను వెంటనే ఆ చేతుల్ని దించేశాడు.

"అదేంటి నాన్నగారూ! దీవించవలసిన చేతుల్తో దండం పెడుతున్నారు? అంతం అవాల్సిన నా జీవితాన్ని ఆపి, సొంతబిడ్డగా చూసుకుని, నా ప్రేమని గెలిపించి నన్నో ఇంటివాణ్ణి చేశారు. మీరు దండాలు పెట్టడానికి నేనిప్పుడు పరాయివాణ్ణి కాదుగా" అన్నాడు జితేంద్ర కన్నీళ్లతో.

మాధవరావు ఇంకా తన ధోరణిలో మాట్లాడుతూ "రక్తబంధాలన్నీ రాక్షసంగా మారిపోతున్న సమయంలో నువ్వో కొత్త బంధాన్ని సృష్టించావు. బంధాలనేవి రక్తంలోనించే రానక్కర్లేదు.. మనసుల్లోనించి పుట్టొచ్చు. పరిచయాల్లోంచి పుట్టొచ్చు. పని మనుషుల్లోనించి పుట్టొచ్చు. మానవత్వం ఉన్న ఎవరిలోనించైనా పుట్టొచ్చు" అన్నాడు.

"మిస్టర్ మాధవరావ్"

బిగ్గరగా వినిపించిన కేకకి అందరూ ఆ వైపు చూసారు. అలా పిలిచినవాడు భానుమూర్తి!

"ఏం బంధాలనేవి రక్తంలోనించే పుట్టుకురానక్కర్లేదని చెప్పినందుకు నీకు పౌరుషం పొడుచుకొచ్చిందా? " ఆవేశంగా

---

**కొత్తగాలి...**



**పొలములో**
**నీళ్లు కనపడవు!**
**నగరములో**
**రోడ్లు కనపడవు!**

– డి. వీరరాఘవరావు,
హన్మకొండ

అడిగాడు మాధవరావు.

"బంధాలు రక్తంలోనించి వస్తే నాకేంటి? గాల్లోనించి వస్తే నాకేంటి? ఈ బంధాలన్నీ ఉత్త ట్రాష్! ప్రస్తుతం ఉన్న వన్నీ ఆర్థిక సంబంధాలే. నిన్ను తండ్రిగా దత్తత తీసుకునే హక్కు ఆ జితేంద్రకొచ్చి నట్టే, నిన్ను నా తండ్రి హోదానించి డిస్మిస్ చేసే హక్కు నాకొచ్చింది"

కొంతమంది విద్యార్థులు ఆ మాటలన్న భానుమూర్తివైపు ఆవేశంగా వెళ్లబోతుంటే మాధవరావు ఆగమని సైగ చేసారు.

"వాడు యిప్పుడు మీకు ఎదురు తిరి గాడు. కానీ వీడు తల్లిగర్భంలో ఉన్నప్పుడే ఎదురు తిరిగాడు. అందుకే వాడీ లోకం లోకి ప్రవేశించిన తొలి క్షణంలోనే నా జీవన నేస్తమయిన నా భార్య ఈ లోకం నించే నిష్క్రమించింది. వాడి సంగతి వది లేద్దాం. ఎందుకంటే, వాడిప్పుడు నా కంటికి గడిచిపోయిన 'గతం'లాగ కనిపిస్తు న్నాడు. ఇంతవరకు సాగిన జీవన ప్రస్థా నంలో చాలా దూరం నడుచుకొచ్చేసాను. ఈ బండి ఇంకా ఎంతదూరం వెళ్తుందో ఎక్కడ ఆగిపోతుందో నాకే తెలీదు. ఆగి పోవడం గురించి నేను ఆలోచించడం లేదు. కానీ, ఆగిపోయేలోగా మీరు నాకు దేవుడు పంపిన కొడుకుల్లా లభించారు. కొన్ని మంచి పనులు చెయ్యాలనుకున్న ప్పుడు ఆలోచనా ఉండాలి, ఆవేశమూ ఉండాలి. మీరు నా ఆలోచనకి ఆవేశంగా మారండి. నేను మీ ఆవేశానికి ఆలోచనగా మారుతాను. ఈ భానుమూర్తిలాంటి నీచులు కొడుకులుగా ఉన్న చాలామంది దీనుల్లాగ, హీనుల్లాగ మారి బతుకుబం డిని మృత్యుగమ్యంవైపు భారంగా ఈడుస్తు న్నారు. మా పాత తరం, మీ కొత్త తరం కలిస్తే... అలాంటి బాధితుల్ని కొంతమం దినైనా ఆదుకోవచ్చు. ఏ మనిషికైనా జీవ నసంధ్యా సమయంలో అలజడి, ఆందోళన లేని ప్రశాంత జీవితం కావాలి. ఆ జీవి తాన్ని మనం అందిద్దాం"

అందరూ అంగీకార సూచకంగా చప్పట్లు కొట్టారు. బయట నించి రామదాసు, ప్రిన్సి పల్ భూషణం లోపలకి వచ్చారు. అక్క డున్న విద్యార్థులు ఇంతవరకు జరిగిం దాన్ని క్లుప్తంగా వివరించారు. అంతా విని ఇద్దరూ హర్షధ్వానాలు చేశారు. రామదాసు తన మనసులోని మాటని వెల్లడించాడు.

"ఒకప్పుడు జితేంద్ర గురించి ఆలోచించే టప్పుడు, అతనికి లేనివాటిని గురించి ఆలోచించాను తప్ప, వున్నవాటిని గుర్తించ లేకపోయాను. అందుకు ఇప్పటికీ బాధప డుతున్నాను. పాతతరం, కొత్తతరం కలిసి మానవత్వ వికాసం కోసం కొన్ని మంచి పనులు చెయ్యాలని సంకల్పించారు. చాలా బావుంది. మీ తొలి ప్రయత్నం ఆరంభించడానికో మంచి ముహూర్తం చూస్తాను" అంటూ జేబులో నించి గంటల పంచాగం తీశాడు. కానీ మాధవరావు అందుకు ఒప్పుకోలేదు.

"చూడండి రామదాసుగారూ! ఓ మంచి రోజున ఓ చెడ్డపని చెయ్యడం కంటే, ఓ చెడ్డరోజున మంచిపని చేస్తే ఆ భగవం తుడు మెచ్చుకుంటాడు. మేం సంకల్పిం చిన మంచిపనుల్లో భాగం పంచుకోవడా నికి అందరూ ఆహ్వానితులే!"

జితేంద్ర భానుమూర్తిని, అతని మహిళా బృందాన్ని ఉద్దేశించి "థాంక్స్ మిస్టర్ భానుమూర్తీ అండ్ ఫ్యామిలీ మెంబర్స్! మీకు అక్కర్లేదనుకున్న తండ్రి అనే ఓ వేస్ట్ కేరెక్టర్ మాలాంటి యువకులకి తండ్రిగా, నాయకుడిగా మారాడు. ఇలాంటి దీనజన సేవకుణ్ణి మాకు అందించినందుకు మీకు ధన్యవాదాలు తెలియజేస్తున్నాం. ఇంక మీరు వెళ్లొచ్చు" అన్నాడు.

భానుమూర్తి, రేఖ, మనోరమ బైటికి నడిచారు.

©

# కాలాతీతం





# టు ది లైట్‌హౌస్

## వర్జీనియా వూల్ఫ్

**న**వల రాయటమంటే కేవలం కథ చెప్పటం కాదు. జీవితాన్ని పదాల్లో పునః సృష్టించటమని నమ్మింది వర్జీనియా వూల్ఫ్. రచయితలు సాధారణంగా వ్యక్తుల్నీ, పరిసరాల్నీ పరిశీలించి రాస్తారు. కాని బాహ్య ప్రపంచం రచయితలో కలిగించే వుద్వేగాలు, స్పందనలు కథావస్తువు కావాలంటుంది వూల్ఫ్. నవలా రచనలో ఇదో కొత్తకోణం. చైతన్య స్థితిలోని మనసులో ఆలోచనలు ఎలా వస్తాయో, వచ్చినవాటిని వచ్చినట్లుగా అలాగే ఒడిసి పట్టుకుని రచనలో చిత్రించడమనేది ఇరవయ్యో శతాబ్దపు ప్రారంభంలో వచ్చింది.

తల్లిదండ్రులు మరణించిన తర్వాత "వాళ్లిద్దరి గురించీ నేనాలోచించని రోజు లేదు. అది నాకో అబ్సెషన్‌గా మారింది. 'టు ది లైట్‌హౌస్' రాసే క్రమంలో నేను వాళ్లతో పునర్జీవించాను" అంటుంది రచయిత్రి.

నలభైమూడో ఏట ఈ నవల ప్రారంభించింది వూల్ఫ్. ఇరవయ్యేళ్లప్పుడు ఆమె తండ్రి, మూడేళ్ల తర్వాత తల్లీ మరణించారు. నవలలో వాళ్ల పేర్లను మిస్టర్, మిసెస్ రాంసేగా మార్చింది. వాళ్లతో కలిసి, ప్రతి వేసవి సెలవుల్లో వెళ్లిన సెయింట్ ఐవ్స్‌ను ఐల్ స్కైగా నామకరణం చేసింది. ఈ కథలో వీళ్లే ప్రధాన పాత్రలు. ఎనిమిది మంది పిల్లలూ, ఆరుగురు అతిథులూ వీళ్ల చుట్టూ తిరిగే ఉపగ్రహాలు. ఒక సెప్టెంబర్ మధ్యాహ్నం ప్రారంభమవుతుంది కథ.

మరునాడు వాతావరణం అనుకూలిస్తే

బోటులో లైట్‌హౌస్ దాకా పోవచ్చునని ఆరేళ్ల కొడుకు జేమ్స్‌తో చెబుతుంది మిసెస్ రాంసే. ఆ మాటలు విని కుర్రవాడు ఉబ్బితబ్బిబ్బయ్యాడు.

కాని టెర్రేస్ మీద ఒక అతిథి చార్ల్స్ టాన్స్లీతో కలిసి పచార్లు చేస్తున్న ఆమె భర్త, "మరునాడు వాతావరణం అనుకూలించకపోవచ్చు. ఎదురుగాలి వీస్తోంది" అంటాడు. ఇది విన్న జేమ్స్‌లో తండ్రిపట్ల కోపం, ద్వేషం పెరుగుతాయి. 'అనుకున్నవన్నీ జరగవు. ఎవరి అభిప్రాయాలు వాళ్లకుంటాయి' అనుకుంటుంది మిసెస్ రాంసే తనలో తను.




సినిమాలో త్వరత్వరగా సీన్లు మారినట్టుగా, ఏ వుపోద్ఘాతమూ లేకుండా, వ్యక్తి నుండి వ్యక్తికి, ఒక చోటు నుండి మరొక చోటుకి తన కెమెరా చకచకా తిప్పేస్తుంది వూల్ఫ్.

లాన్‌లో డెక్‌చెయిర్ మీద కూర్చున్న వృద్ధకవి ఆగస్టస్ కార్మైకెల్.. ఆయన తెల్లగడ్డం, తెల్లమీసాలు.. సమీపంలో కాన్వాస్‌మీద బొమ్మగీస్తున్న ముప్పైఏళ్ల మిస్ లిలీ బ్రిస్కో.. టెర్రేస్ కిటికీ దగ్గర మిసెస్ రాంసే, జేమ్స్. అంతలో మరో వృద్ధుడు విలియం బాంక్స్ ప్రవేశించి, కాన్వాస్‌ను పరిశీలనగా చూస్తాడు. ఆ తర్వాత ఇద్దరూ కలిసి 'వాకింగ్' కోసం బయల్దేరతారు. దారిలో రాంసేల మరో అబ్బాయి కాం, పువ్వులు కోస్తూ కనిపిస్తాడు. ఇదంతా రచయిత్రి స్వానుభవమై ఉండవచ్చంటారు విశ్లేషకులు.




బాంక్స్, మిస్ బ్రిస్కోలను చూసిన మిసెస్ రాంసే, 'ఇద్దరూ త్వరలో పెళ్లిచేసుకుంటారు కాబోలు' అనుకుంటుంది. కాసేపు భార్యతో చిన్నపాటి చర్చకు వుపక్రమిస్తాడు మిస్టర్ రాంసే. "షేక్స్పియర్ పుట్టకుండా వుంటే, ఇప్పుడు లోకం మరోలా వుండేదా? నాగరికత అభివృద్ధి చెందటానికి మహానుభావులే కారణమా? ఈజిప్టు ఫరాహోల కాలంలో, సామాన్యుడి జీవితం ఈనాటి కన్నా మెరుగ్గా వుండేదా? నాగరికత ఔన్నత్యాన్ని నిర్ణయించేది సామాన్యులా? "

తన చిత్ర కళాకృషిని గురించి విలియం బాంక్స్‌కు వివరిస్తుంది మిస్ బ్రిస్కో. జేమ్స్‌కు బొమ్మల పుస్తకం చూపిస్తుంది మిసెస్ రాంసే. మరో ఇద్దరు యువ అతిథులు పాల్‌రేలీ, మింటా డాయల్‌ల గురించి కూడా ఆలోచిస్తుంది. అంతలో దూరంగా లైట్‌హౌస్ వెలుగుతుంది. అంటే, వెలిగి, మలిగి, మళ్లీ వెలుగుతుంటుంది - టార్చ్ ఫ్లాష్‌ల మాదిరిగా. వంటమనిషి మిల్డ్రెడ్ వచ్చి, జేమ్స్‌ను, నిద్రకు సమయమైందని తీసికెడుతుంది. మరునాడు లైట్‌హౌస్‌కు వెళ్లలేనందుకు వాడు ఎంత బాధపడుతున్నాడో ఆమెకు తెలుసు.

భర్త అటువైపుగా రావడంతో ఆయనతో కలిసి తోటలో పచారు చేస్తుంది మిసెస్ రాంసే. మరో ఇద్దరు పిల్లలు ప్రూ, జాస్పర్‌లు బంతాట ఆడుతూ కనిపిస్తారు. లిలీబ్రిస్కో, విలియం బాంక్స్ ఎదురుగా వస్తారు. ఆ దంపతులను చూసి 'పిల్లలతో కలిసి ఆడుకోవడమే గదా

## వర్జీనియా వూల్ఫ్ (1882 - 1941)

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో, నవలా ప్రక్రియలో కొత్త ప్రమాణాలు నెలకొల్పిన బ్రిటిష్ రచయిత్రి వర్జీనియా వూల్ఫ్. 'ది డిక్షనరీ ఆఫ్ నేషనల్ బయోగ్రఫీ' సంకలనం చేసిన సర్ లెస్లీ థామస్ స్టీఫెన్ ఆమె తండ్రి. ఆయన రెండో భార్య సంతానమే వూల్ఫ్. చిన్నప్పటి నుంచే వూల్ఫ్‌కు రచనా వ్యాసంగం అంటే మక్కువ. యువ రచయిత్రిగా ఉన్నప్పుడు వర్జీనియా వూల్ఫ్ తన రచనలన్నిటినీ నిల్చునే రాసేదట! ఆమె దానికిగాను ప్రత్యేకంగా మూడున్నర అడుగుల ఎత్తుగల ఒక బల్లను కూడా చేయించుకుంది. తోబుట్టువుతో ఏర్పడిన పోటీ కారణంగానే ఆమెకు ఇది అలవాటయింది. వూల్ఫ్ సోదరి వనెస్సా ఓ చిత్రకారిణి. ఆమె సుదీర్ఘ సమయం నిలబడి బోర్డుమీద చిత్రాలు గీసేది. దాంతో తన వ్యాసంగం కూడా సోదరికంటే ఏమాత్రం తక్కువ కష్టమైనది కాదని కుటుంబసభ్యులకు తెలియజేసేందుకే, వూల్ఫ్ నిలబడి ఓ బల్ల మీదకు వంగి సుదీర్ఘంగా రాయడం మొదలు పెట్టిందట. అయితే ఆ తర్వాత వయసు మీద పడుతున్నకొద్దీ ఆమె కూర్చుని రాయడానికి అలవాటు పడింది.

1912లో ప్రముఖ రచయిత, సామాజిక శాస్త్రజ్ఞుడు లియోనార్డ్ వూల్ఫ్‌ను వివాహం చేసుకుందామె. ఈ ఇద్దరూ కలిసి, అప్పటికి ప్రయోగాత్మక రచయితలుగా గుర్తింపు తెచ్చుకుంటున్న ఇ.ఎం. ఫాస్టర్, ఎడిత్ సిట్వెల్, క్లైవ్ బెల్, లిట్టన్ స్ట్రాచీలాంటి వాళ్లకు అండగా నిలిచారు. లండన్ సాహితీ వర్గాల్లో బ్లూమ్స్‌బరీ గ్రూప్‌గా పేరొందిన ఈ బృందంలో టి.ఎస్. ఇలియట్, కేథరిన్ మేన్స్‌ఫీల్డ్ కూడా సభ్యులే. 1917లో దంపతులు 'హొగార్త్ ప్రెస్' స్థాపించి ఇలియట్, మేన్స్‌ఫీల్డ్‌ల తొలి రచనల్ని ప్రచురించారు. వూల్ఫ్ తొలి రెండు పుస్తకాలు 'ది వాయేజ్ ఔట్', 'నైట్ అండ్ డే' తప్ప, మిగతా రచనలన్నీ ప్రచురించింది హొగార్త్ ప్రెస్. మొదటి రెండు నవలల్ని సాంప్రదాయిక పద్ధతిలోనే రాసినా, 1925 నాటి 'మిసెస్ డాలొవే'లో 'చైతన్య స్రవంతి' పద్ధతిని ప్రవేశపెట్టింది వూల్ఫ్. ఇది పాఠకులలో ఒక కొత్త ఉద్వేగాన్ని కలిగించింది. 'కథావస్తువు కాదు. వుద్వేగాన్ని కలిగించటమే ఈ చైతన్య స్రవంతి లక్ష్యం' అన్నాడు ఇ.ఎం. ఫాస్టర్.

1919లో 'లిటిల్ రివ్యూ'లో సీరియల్‌గా వస్తున్నప్పుడే తను చదివిన 'యూలిసీస్' నవల

పెళ్లంటే' అనుకుంటుంది లిలీబ్రిస్కో.

ఇక్కడి నుండి కథ కొంత వెనక్కు నడుస్తుంది. పాల్, రేలీ, మింటాడాయల్, మరో ఇద్దరు పిల్లలు ఆండ్రూ, నాన్సీలు క్రితం రోజు మధ్యాహ్నం - బీచ్‌లో ఆడుకుంటున్నారు. పాల్, మింటాలు నీటి ఒడ్డున నిల్చుని ఒకర్నొకరు ముద్దుపెట్టుకోవటం చూసి మిగతా ఇద్దరు పిల్లలు షాక్ అవుతారు. మింటా మెడలోని బ్రూచ్, అలలో కొట్టుకుపోతుంది. మరునాడు వచ్చి దాని కోసం వెతుకుతానంటాడు పాల్. సాయంత్రమవుతుంది. అందరూ ఇంటిదారి పడతారు. దూరంగా, లైట్లు ఒక్కటొక్కటే వెలుగుతాయి. ఇవన్నీ జరగబోయే సంఘటనలకు ప్రతీకలు - పెళ్లి, పిల్లలు, ఇల్లు...

ఇక నవలలోని ప్రధాన ఘట్టం ప్రారంభమవుతుంది - డిన్నర్‌కు సన్నాహాలు చెయ్యాలి. పదిహేను మంది టేబుల్ చుట్టూ కూర్చున్నారు. మిస్ట్రెడ్ అందరికీ వడ్డిస్తుంది. మిస్టర్ రాంసే అక్కడ కూర్చున్నవాళ్లందర్నీ తృప్తిగా చూస్తాడు. లిలీ, తను వేస్తున్న చిత్రం గురించి ఆలోచిస్తోంది. బొమ్మలో చెట్టును ఎక్కడ పెట్టాలి. తనలో తానే చర్చించుకుంటూ, టేబుల్ మీది సాల్ట్ సెల్లార్ అందుకోవ

వూల్ఫ్‌కు ప్రేరణ అనటంలో సందేహంలేదు. అయితే మరో ప్రముఖ నవలా రచయిత విలియం ఫాల్క్‌నర్‌లాగ, ఈమె కూడా కథనం లోని సాంకేతిక అంశాలను మాత్రమే జేమ్స్‌జాయిస్ నుండి గ్రహించింది. జాయిస్‌లాగ, వూల్ఫ్‌ది తిరుగుబాటు స్వభావం కాదు. భాషతో ప్రయోగాలు చెయ్యటం కాకుండా, చైతన్య స్రవంతిలో తన అంతరంగ కవితాలోకాలను ఆవిష్కరించింది. యూలిసీస్, చిన్నపాటి అచ్చులో ఎనిమిదివందల పేజీల నవల. దానితో పోలిస్తే 'మిసెస్ డాలొవే' చాలా చిన్నది. ఆమె తరువాతి నవలే 'టు ది లైట్‌హౌస్' (1927). ఇదిగాక, 1931నాటి 'ది వేవ్స్', రచయిత్రి మరణానంతరం ప్రచురిత మైన 'బిట్వీన్ ది యాక్ట్స్' (1941) కూడా ఆధునిక సాహిత్యాన్ని కొత్త పుంతలు తొక్కిం చిన గొప్ప నవలలు. లోపలి వెలుగును పాఠ కుల మీద ప్రసరింపచెయ్యటంలో ఈమె ప్రూస్ట్‌ను ఆదర్శంగా తీసుకుంది.

"జీవితం మనకు రెడీమేడ్ రూపాల్లో సాక్షా త్కరించదు. అది కణాల, అణువుల, పరమా ణువుల వర్షంలా కురుస్తుంది. సూక్ష్మ పరిశీల నతో తప్ప అనుభవంలోకి రాదు. సాంప్రదా యిక నవలల్లో చిత్రించినట్టుగా, అనుభవ శక లాలు ఒకదాని వెంట ఒకటి మనల్ని వెతు క్కుంటూ రావు. అనుకోని క్షణాన, అనూ హ్యంగా, ఒక మెరుపులా మెరిసి చెదిరిపోయే అద్భుత క్షణాలెన్నో. ఆధునిక నవలా రచయిత చెయ్యవలసిందల్లా వాటిని ఒడిసి పట్టుకోవ టమే" అంటుంది వూల్ఫ్.

అనేక జీవిత కథలు రాసిన తన మిత్రుడు లిట్టన్ స్ట్రాచీ ప్రోత్సాహంతో ఒక ఫాంటసీ చరిత్ర 'ఆర్లాండో' (1928) రాసింది. మొదట హీరోగా ప్రారంభించి, తరువాత హీరోయిన్‌గా మారిన వ్యక్తి 16వ శతాబ్ది నుండి, ఇరవయ్యో శతాబ్దిదాకా జీవిస్తాడు. ఇంగ్లిష్ సాహిత్య చరి త్రను యిందులో వ్యంగ్యంగా చిత్రించిందామె.

వూల్ఫ్ గొప్ప స్త్రీవాది. ఆమె రాసిన 'ఎ రూం ఆఫ్ వన్స్ఓన్' (1929) యిప్పటికీ, మహిళా వుద్యమకారులకు అవశ్య పఠనీయ గ్రంథమే.

"స్వంత డబ్బూ, స్వంత గదీ వుంటే తప్ప ఆడవాళ్లు ఫిక్షన్ రాయలేరు" అంటుంది వూల్ఫ్.

తల్లీ, వరుస సోదరి మరణంతో మూడు దశాబ్దాలకు పైగా డిప్రెషన్‌లో బతికింది. రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఆమె యింటి మీద బాంబులు పడ్డాయి. డాక్టర్లు 'మేనిక్ డిప్రెస్సివ్ ఇల్‌నెస్'గా తేల్చిన జబ్బు తిరగ బెట్టింది.

1941 మార్చి28న ఇంటికి సమీపంలో వున్న నదిలో మునిగి మరణించింది వూల్ఫ్. ఎంత గాలించినా ఏప్రిల్ 18 వరకూ ఆమె మృత దేహం కూడా దొరకలేదు.

టానికి చేయి ముందుకు చాస్తుంది. చార్ల్స్ టాన్లీ ఎందుకో చికాకుగా ఉన్నాడు. పాల్, మింటా ప్రేమలో మైమరచి హాయిగా కబుర్లు చెప్పుకుంటున్నారు. మిసెస్ రాంసే వాళ్లవైపే చూస్తుంది. తన పెద్దకూ తురు ప్రూ కూడా ఒకనాడు మింటాలాగే సంతోషంగా ఉంటుంది.

డిన్నర్ తర్వాత గదిలోంచి వెళ్లిపోతూ ఒకసారి, టేబుల్ వైపు దీక్షగా చూస్తుంది మిసెస్ రాంసే. ఇప్పటిదాకా తనక్కడే కూర్చుంది. కాని అంతలోనే దృశ్యం మారి పోతున్నది. ఆలోచనలు, అనుభవం గతంగా మారిపోవటానికి క్షణం పట్టదు గదా! మెట్లపైన గదిలో పడుకున్న పిల్లలు జేమ్స్, కామ్‌లను చూడటానికి వెడుతూ, ఇంకా గదిలో కూర్చున్న మనుషుల గురించి ఆలోచిస్తుంది. అందరూ ఎంత అన్యోన్యంగా మాట్లాడుకుంటున్నారు! ఏళ్ల తర్వాత ఒకరి గురించి ఒకరు ఏమనుకుం టారు? ఈ ఇల్లు ఎలా ఉంటుంది? తను...?

పిల్లలకు గుడ్‌నైట్ చెప్పి, మళ్లీ కిందికి వస్తుంది మిసెస్ రాంసే. పాల్, మింటా, ఇతర పిల్లలు, అతిథులు అందరూ మళ్లీ బీచ్‌కి బయల్దేరారు. వెన్నెల్లో అలల నాట్యాన్ని చూడాలి. భర్త కూర్చున్న గది

లోకి వెడుతుంది మిసెస్ రాంసే. ఏదో చదువుకుంటూ ఇద్దరూ ఎదురెదురుగా కూర్చుంటారు. అప్పుడప్పుడూ ఆప్యాయంగా చిరునవ్వు నవ్వుకుంటారు.

బీచ్‌కు వెళ్లినవాళ్లు తిరిగివస్తారు. నిద్రా సమయం. విశాలమైన భవంతి ప్రశాంతంగా ఉంటుంది. అంతటా చీకటి. ఆగస్టస్ కార్మైకెల్ గదిలో మాత్రం లైటు వెలుగుతుంటుంది. అతడు కొవ్వొత్తి ముందర కూర్చుని విర్జిల్‌ను చదువుతున్నాడు. అర్ధరాత్రి తర్వాత అదీ ఆరిపోతుంది. రాత్రి కరుగుతున్నది...

ఇలా ఒకరాత్రి కాదు. ఎన్నో రాత్రులు గడిచాయి. రాత్రంటే కొన్ని గంటలు మాత్రమేనా? కాలానికి ఒక కొలమానం. రాత్రి తర్వాత రాత్రి రాదా! ఎంతకూ గడవని చలికాలపు రాత్రిళ్లు.. దీర్ఘనిశి. హోరున వీచే గాలులు.. అంతలోనే రచయిత్రి ప్రతిభకు గీటురాయిలాంటి మరణ సన్నివేశం.. "చీకటిగా ఉన్న ఒక ఉదయం మిస్టర్ రాంసే ఒంటరిగా నడుస్తున్నాడు. ఏదో తగిలింది. తూలిపడబోయి చేతులు ముందుకు చాచాడు. కాని అంతకు ముందురోజే మిసెస్ రాంసే కన్నుమూసింది. ఆ చేతులకెవరూ తగల్లేదు"

జీవితమంతా సుఖంగా బతకాలని తల్లి ఎప్పుడూ ప్రార్థించిన ప్రూ పెళ్లి చేసుకుని తనూ మరణించింది- దానికి కారణమేమంటే ఏం చెబుతాం. ఏదో ప్రసూతి సమస్య. యుద్ధం (1914-1918)లో ఆండ్రూ రాంసే హతుడయ్యాడు. ఏళ్లు గడిచాయి. ఇప్పుడు ఇంటి బాగోగులు చూసేవాళ్లు కరువయ్యారు. అప్పుడప్పుడూ వస్తుంది మిసెస్ మెక్‌నాబ్ - గతాన్ని నెమరేసుకోవటానికీ, ఇంకా నిలిచి ఉన్న గోడల్ని చూడటానికీ. "కప్‌బోర్డులలో దుస్తులు వేలాడుతూనే ఉన్నాయి. పడక గదుల్లో ఎక్కడ చూసినా బట్టలే. ఏం చెయ్యాలి? పురుగులు వస్తున్నాయి. మిసెస్ రాంసే వస్తువులన్నీ చిందర వందరగా పడున్నాయి. పురుగులొస్తున్నాయే.. ఎలా, పాపం, రాంసే! ఇప్పుడామెకు వీటి అవసరం లేదు గద. చాలాకాలం క్రిత్రం లండన్‌లో చనిపోయిందట మిసెస్ రాంసే. ఎప్పుడు కనిపించినా, 'గుడ్ ఈవెనింగ్, మిసెస్ మెక్‌నాబ్' అంటూ పలకరించేది.

నాచుపట్టిన గోడలు. బూజుపట్టిన గోడలు - పగుళ్లు పట్టిన గోడలు - పెద్ద పెద్ద రంధ్రాలు పడిన గోడలు- కూలిపోక తప్పదు మరి. తోటగానీ, ఇప్పుడక్కడ ఏ పూలమొక్కలుగానీ లేవు. కలుపు మొక్కలతో పెరిగిన దట్టమైన అడవిలా గుంది. మిసెస్ మెక్‌నాబ్, ఇంటిని బాగు చేయించి పెట్టగలరా, ప్లీజ్! మిస్టర్ అండ్ మిసెస్ రాంసే బంధుమిత్రులతో ఈ వేసవి ఇక్కడే గడపాలనుకుంటున్నారు. కూలీలను రప్పించండి. ఇటుకలు పేర్చండి. ఇల్లంతా శుభ్రం చేసి ఫర్నిచర్ పాలిష్ చేసి త్వరగా రెడీ చెయ్యండి. దుబ్బులుగా పెరిగిన గడ్డిని నరికి కొత్తమొక్కలు నాటండి.

పిల్లల్ని వెంట పెట్టుకుని వచ్చింది రాంసే కుటుంబం. లిలీ బ్రిస్కో, మిస్టర్ కార్మైకెల్ వయసు మరింత మీదపడింది- కూడా అరుదెంచారు.

మరునాడు లిలీబ్రిస్కో బ్రేక్‌ఫాస్ట్ కోసం డైనింగ్ రూంలోకి ప్రవేశించింది. కాని అక్కడ ఆమె ఒక్కతే. మిసెస్ రాంసే ఇక లేదే. ఉంటే ఇప్పుడామె ఏమనుకుంటుంది! నథింగ్. నథింగ్. చెప్పటానికి మాటల్లేవు. పదేళ్ల క్రితం ఇక్కడే కూర్చున్నానని తనకు గుర్తొస్తుంది. అప్పుడు బొమ్మగీయటం గురించి ఎంతగా బుర్రపాడు చేసుకుంది! సాల్ట్ సెల్లార్ కోసం కాస్త ముందుకు వంగింది. ఆమె ఆ చిత్రం ముగించలేదు.

సమస్యకు పరిష్కారం దొరికింది. ఇప్పుడు పెయింటింగ్ పూర్తవుతుంది. బ్రేక్‌ఫాస్ట్ ముగించి, లాన్‌లోకెళ్లి బోర్డు మీద కాన్వాస్ బిగించి, బ్రష్ అందుకుంది.

పదహారేళ్ల జేమ్స్, పదిహేడేళ్ల కాం లైట్‌హౌస్ కోసం తండ్రితో కలిసి పడవ ప్రయాణం ప్రారంభిస్తారు. వాళ్లు బయల్దేరటానికి ముందు, మిస్టర్ రాంసే లిలీని పలకరిస్తారు. సంవత్సరాల క్రితం ఆయన భార్య (మిసెస్ రాంసే) మిస్టర్ బాంక్స్‌ను చేసుకుంటే బాగుండునని కలలుకన్నది. కాని ఆమె కోరిక తీరలేదు. వెంటరమ్మని మిస్టర్ రాంసే అడిగినందుకు, లిలీకి కోపం వచ్చింది. భార్యలేదు గనక, ఇప్పుడే మనిషికి తన సాంత్వన, సానుభూతి కావాలి. ఏం చెప్పాలో తెలియక ఆయన కాళ్లకేసి చూస్తూ "బూట్లు ఎంతందంగా ఉన్నాయి" అంటుంది. సాంత్వన కోరిన మనిషిని బూట్ల అందం పొగిడి తృప్తిపరచగలదా? తన ప్రవర్తనకు సిగ్గుపడింది లిలీ.

మిస్టర్ రాంసే తనలో తనే నవ్వుకుంటూ లేసులు గట్టిగా కట్టుకున్నాడు. కాని ఆ చిరునవ్వులో అనంత విషాదం కనిపించింది. ఆమె వచ్చినా, రాకపోయినా, మిస్టర్‌రాంసే లైట్‌హౌస్‌కెళతాడు- జేమ్స్‌నూ, కాంనూ వెంటతీసుకుని.

లిలీ బొమ్మ వెయ్యటానికి ప్రయత్నిస్తున్నది. ఆమె పక్కనే, డెక్ చెయిర్‌లో జోగుతూ కూర్చున్నాడు మిస్టర్ కార్మైకెల్. మిస్టర్ రాంసే, పిల్లలు పడవెక్కారు. తండ్రిని అసహ్యించుకుంటున్న జేమ్స్, ఎదురుగాలితో పడవ లైట్‌హౌస్ చేరకపోతే బాగుంటుందనుకుంటాడు.

పెయింట్ చేస్తున్న లిలీ, రాంసే బీచ్ మీద కూర్చున్నట్టుగా ఊహించుకుంటుంది. పాల్, మింటాల పెళ్లి ఎందుకు, ఎలా ఫెయిల్ అయిందో మరోసారి మదిలో మెదులుతుంది. అసలు విషయం మిసెస్ రాంసేకు ఎప్పుడూ తెలియదు. ఆ రహస్యం తనొక్కదానికే తెలిసినందుకు గర్వంగా ఉంటుంది. కాని అంతలోనే ఏదో విషాదం ఆమెను ఆవరిస్తుంది. ఏడుస్తూ, 'మిసెస్ రాంసే!' అని అనుకుంటుంది తనలో తాను.

పదేళ్ల క్రితం, తండ్రిపట్ల తనెలా ద్వేషం పెంచుకున్నాడో గుర్తుచేసుకుంటాడు జేమ్స్. 'వాతావరణం అనుకూలించదేమో' అని ఆయన అనటమే దానికి కారణం!

లిలీ పెయింటింగ్ కొనసాగిస్తుంది. ఆ ఇంటితో, అక్కడి మనుషులతో ఆమెకు విడదీయలేని బంధముంది. మిస్టర్, మిసెస్ రాంసేలు తొలిసారి ఎలా కలిశారో, ప్రేమలో పడ్డారో తనకు తెలుసు.

పడవలో జేమ్స్, కాం, మిస్టర్ రాంసే సాండ్‌విచ్‌లు తింటారు. లైట్‌హౌస్‌ను సమీపిస్తుంది బోటు. తెడ్డు వేస్తున్న జేమ్స్‌ను చూసి, 'వెల్‌డన్' అంటాడు మిస్టర్ రాంసే. ఆయన కొడుకును ప్రశంసించటం అదే తొలిసారి. జేమ్స్‌వైపు చూస్తూ 'ఇంకేం కావాలి! అనుకున్నది సాధించావు!' అన్నట్టుగా చూస్తాడు కాం.

బోటు లైట్‌హౌస్ చేరటం గమనిస్తుంది లిలీ. మరొక్క రేఖ గీయటంతో బొమ్మ పూర్తవుతుంది. 'హమ్మయ్య! అనుకున్నది చేశాను' అనుకుంటుంది.

ఈ నవల ముగించి, "ఇప్పటి వరకు, నేను రాసిన పుస్తకాలన్నింటిలోకి ఇదే బెస్ట్ అనుకుంటున్నాను. దీనితో నా రచనా పద్ధతికి పర్ఫెక్షన్ వచ్చినట్టే" అని తన డైరీలో రాసుకుంది వర్జీనియా వూల్ఫ్.

అచ్చయినపుడు ఇది సెన్సేషన్ సృష్టించి ఉండవచ్చు. కాని ఇన్ని దశాబ్దాల తర్వాత కూడా 'టు ది లైట్‌హౌస్'ను 'ఎ వర్క్ ఆఫ్ జీనియస్' అంటున్నారు చదివినవారందరూ.

సేకరణ : వసంత



సరికొత్త శీర్షిక ప్రారంభం!




మల్లాది రామకృష్ణశాస్త్రి

# కృష్ణాతీరం

**మల్లాది రామకృష్ణశాస్త్రి అనగానే మనకు చక్కటి తెలుగుదనం కళ్లకు కడుతుంది. 'కనుపాప కరువైన కనులెందుకో...' వంటి సుప్రసిద్ధ సినీగీతాలు మదిలో మెదులుతాయి. ఎన్నో సినీ సంభాషణలు చెవుల్లో మారుమోగుతాయి. 'దు-ము-వు-లు' వంటి కథలు మనోఫలకం మీద కదలాడుతాయి. 'కృష్ణాతీరం' వంటి నవలలు గుర్తొస్తాయి. తెలుగునుడికి పట్టం కట్టిన అచ్చ తెనుగు రచయిత, కవి మల్లాది.**

అన్నప్ప, యెగ్గెన్న, బుచ్చన్న, రామశేషు, రాజమ్మ, సదాశివుడు, రత్తమ్మ- కవటాకు, తవ్వేడు గింజలు, ఇద్దరి- అద్దరి, పెద్దపీట... ఇలాంటి పేర్లు, పదాలు ఇదోలోకం. ఈ లోకం చూడాలంటే 'కృష్ణాతీరం' లోకి ప్రవేశించాల్సిందే. మల్లాది రామకృష్ణశాస్త్రి రాసిన ఈ నవల 1967 నాటిది. ఈ నవలలోని పాత్రల పేర్లే కాదు, వాటి తీర్లూ చిత్రమైనవే. శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణుడని పేరున్న అన్నప్పగారు శూద్ర లచ్చిని 'నువ్వు నా కూతురివి.. మా రెండోపిల్లవు' అంటాడు. నిజానికి లచ్చి ఆయన కూతురు కాదు. సుబ్బారామయ్యని చావచితకతన్నిన బుచ్చన్న, అతన్నే ఎంతో ప్రేమగా 'బావా' అంటాడు. ఇవి ఈ నవలలో మలుపులు, ఆశ్చర్యాలూ కావు. మనసున్న మనుషుల నిండైన ప్రవర్తనలు.. మనస్తత్వ చిత్రణకి మణిదీపాలు.

మల్లాదివారి తీరే వేరు. ఆయన పలుకు, రాత వేరు. కథైనా, నవలైనా, సినిమా పాటైనా, యక్షగానమైనా ఆయన గుర్తు గుప్పున గుబాళిస్తుంది. కృష్ణాతీరం నవలలో కథని రెండు వాక్యాల్లో చెప్పుకోవచ్చు. భార్యాభర్తలు అమ్మడు- రామశేషు మధ్య మనస్పర్ధలొచ్చాయి. వారిమధ్య సయోధ్య కూర్చి వారిద్దరినీ అన్నప్పగారు దగ్గర చేశారు. రెండు వాక్యాల్లో ఒదిగే ఈ కథని, ఒక్క వాక్యం కూడా తీసెయ్యటానికి మనసొప్పని రీతిలో రెండొందల పేజీల నవలగా మలిచిన రామకృష్ణశాస్త్రి లోకజ్ఞత, ప్రతిభ చూసి ఆశ్చర్యపోతాం. నవలలోని కథకన్నా, కథ చుట్టూ వున్న జీవితాన్ని, ఆ జీవితంలోని మనుషుల్ని, వాళ్ళ తత్వాల్ని మూల వస్తువుగా చేస్తే, ఆ రచనకి ఇతిహాసచ్ఛాయ వస్తుంది. 'కృష్ణాతీరం' అలాంటి రచనే. సంప్రదాయం, మానవత్వాల్ని ఇరువైపులా నడిపిస్తూ కృష్ణాతీరాన్ని ఇతిహాస స్థాయికి తీసికెళ్ళారు.

అవనిగడ్డ గ్రామం మొత్తానికి రామావధాన్లు సంపన్న గృహస్థు. ఆయనకి సుబ్బారామయ్య,



## మల్లాది రామకృష్ణశాస్త్రి (1905 - 1965)



మల్లాదివారు 1905 జూన్ 16న మచిలీపట్నం సమీపంలోని చిట్టిగూడూరు గ్రామంలో జన్మించారు. ఈ బహుముఖ ప్రజ్ఞాశాలి అటు సంస్కృతాంధ్రాల్లో ఎం.ఏ పట్టాలు, ఇటు సంప్రదాయ విద్యల్లో అద్వితీయమైన పాండిత్యాన్ని గడించారు. హిందీ, గుజరాతీ, మరాఠీ, పాళీ, బెంగాలీ, కన్నడం వంటి దేశభాషలెన్నో నేర్చారు. సింహళం, ఫ్రెంచ్, గ్రీక్, లాటిన్, జర్మన్, జపనీస్- ఇలా సుమారు ఏభై భాషల్లో పాండిత్యం గడించారు. తాలింఖానాలో చేరి కుస్తీపట్లు నేర్చి పోటీల్లో పాల్గొనేవారు. కాలికి గజ్జె కట్టి నాట్యం చేసేవారు.

గుంటూరులో పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరిగారి 'దేశాభిమాని' పత్రికలో ఉపసంపాదకులుగా పనిచేశారు. కృష్ణాపత్రికలో 'నా కవి మిత్రులు', 'చలవ మిరియాలు' శీర్షికలతో సున్నితమైన సాహిత్య, విమర్శన వ్యాసాలు వెలయించారు. కొంతకాలం సినీరంగంలో అజ్ఞాత రచయితగా ఉన్నారు. సముద్రాల రాఘవాచార్యులవద్ద చేరి ఎన్నో సినిమాలకి సంభాషణలు, పాటలు రాశారు.

వీరు చేపట్టిన సాహిత్యప్రక్రియల్లో చిన్నకథ ప్రధానమైనది. పందొమ్మిదేళ్ళ వయసులోనే కథలు రాయడం ఆరంభించిన వీరు సుమారు రెండువందల వరకు కథలు రాశారు. మొదట్లో ఛందోబద్ధమైన కవిత్వం, యక్షగానాలు, ద్విపదలు, గేయాలు రాశారు. సంస్కృతం నుంచి కొన్ని గ్రంథాలు తెలుగులోకి అనువదించారు. కిరణావళి, మణిదీపాలు అనే గేయసంపుటాలు రాశారు. 'తేజోమూర్తులు' 'కృష్ణాతీరం' నవలలు రాశారు. 'ఆనందకాననం' వీరి చిట్టచివరి కథగా చెబుతారు. 'దు-ము-వు-లు' అనే వీరి కథ పద్నాలుగు భాషల్లోకి అనువదించబడింది. ఆదర్శ గ్రంథమండలి వీరి 120 కథలను నాలుగు సంపుటాలుగా ప్రచురించింది. 1965 సెప్టెంబరు 12న స్వర్గస్థులయ్యారు.

అమ్మడు ఇద్దరే సంతానం. సుఖంగా జరుగుతున్న సంసారంలో కూతురు అమ్మడు పెళ్ళి నుంచీ అపశ్రుతి ఆరంభమైంది. భర్తకి అమ్మడికి సరిపడక, కాపురం కాదనుకుని పుట్టింటికి వచ్చేసింది. సుబ్బరామయ్య శూద్రుల పిల్ల లక్ష్మిని పెళ్ళి చేసుకుని పక్కవూరు పాలెంలో కాపురం పెట్టాడు. అంతేకాక ఏడు తరాల నుంచీ వస్తున్న ఆస్తిని పంపకం పెట్టమన్నాడు. కాదన్న అవధానులుగారి మీద చెయ్యి చేసుకున్నాడు. అన్నిరకాలుగా దిగులు పడిపోయాడు అవధానిగారు. అయినా పట్టు, పంతం వదల్లేదు.

అవధానిగారి ప్రాపులో వ్యక్తే అన్నప్పశాస్త్రి. కానీ అమ్మడి పెళ్ళి చూపులప్పుడు తలెత్తిన అపార్థం అంతరాన్ని పెంచింది. అయినా అవధానిగారి కుటుంబానికి మేలు జరగాలనేదే అన్నప్ప అభిమతం. దాంతో అతను అవధానిగారి పిల్లల మంచిచెడ్డల కోసం నడుం బిగించాడు.

ముందు అవధానిగారి కొడుకు సుబ్బరామయ్య సంగతి. తండ్రితో తగవుపడి చెయ్యి చేసుకున్న సుబ్బరామయ్యని, అన్నప్పగారి కొడుకు బుచ్చన్న చితక తన్నాడు బుద్ధి వస్తుందని. అది తొందరపాటే. అది సరిదిద్దాలి ముందు. అందుకే కొడుకు బుచ్చన్నతో సహా పాలెం ప్రయాణమయ్యాడు అన్నప్ప. ఈ నవలకి ఇది కీలకపాత్ర. మల్లాది రామకృష్ణశాస్త్రి ఆలోచనలకి, ఆదర్శాలకి, వ్యక్తిత్వానికి అతి దగ్గరైన పాత్ర.

అన్నప్ప సదాచార ప్రియుడు. కానీ ఛాందసుడు కాదు. కులాచారం, కట్టుబాట్లని అతిక్రమించిన వారిని కూడా నిండైన మనసుతో అక్కున చేర్చుకునే నైజం. మంచితనం, నిజాయితీ, మానవత్వం గల వ్యక్తి.

సుబ్బరాముడు కట్టుకున్న లచ్చి పుట్టుపూర్వోత్తరాలు అన్నప్పకు తెలుసు. తల్లి, తండ్రిలేని ఆ పిల్లని పెంచి పెద్దచేసిన మేనత్త రత్తమ్మ తీరూ తెలుసు. అంతేకాదు, పాలెం పాలెం అంతా ఆయనకి కొట్టిన పిండే.

వీళ్ళు వెళ్ళేటప్పటికి ఇంట్లో పిల్లల్తో లచ్చేవుంది. లచ్చిని చూడగానే.. 'దీని ముందు బ్రాహ్మణ పిల్ల ఎందుకూ?' అనుకున్నాడు. చొరవగా పలకరించాడు. తన వరసేమిటో తెలియచేస్తూ, వారి గురించి చెప్పాడు. 'ఒకానొక సమయంలో సుబ్బరాముడు నా అల్లుడైతే బాగుండుననుకున్నాను. అనుకున్నట్టు జరగలేదు. అయినా వరస మట్టుకు మారలేదు.. నువ్వు నా కూతురివే...'

అన్నారు. ఆమె అత్తగారింటి సంగతులూ చెప్పారు. లచ్చి వెక్కివెక్కి ఏడ్చింది ఆ తండ్రి ముందు. 'అంతకూ కారణం నేను. ఈ పాపం అంతా నాది' అంటూ బాధపడింది.

తండ్రి పనుపున, చేను దగ్గర వున్న సుబ్బరాముడి దగ్గరకెళ్లిన బుచ్చన్న... 'బావా..' అని పలకరించాడు మనసు నిండుగా. ముందు కసిరినా, ఇల్లు చేరేటప్పటికి వాళ్ళిద్దరూ ఒకటైపోయారు. ఆ రాత్రికే ఆ యింటివారి మనసుల్ని ఓ తీరుకి తీసుకొచ్చాడు అన్నప్ప. తెల్లారేటప్పటికి, అన్నప్పగారి రాక మహత్యం, అప్పటిదాకా కొంచెం అటూ ఇటూగా వున్న గంటయ్యలాంటివాళ్ళు కూడా వాళ్ళ పక్షమయి లచ్చిని పలకరించారు.

ఇంతకన్నా రసవత్తరం, అన్నప్పగారు అమ్మడు సంసారాన్ని సరిదిద్దటం. ఆ వాతావరణం, మనుషులు, పరిస్థితులూ ఓ మెట్టుపైనే. మల్లాదివారి విశ్వరూపం కనపడేది ఇక్కడి నుంచే.

రామావధాన్లుగారి అమ్మాయి అమ్మడు భర్త మీద అలిగి పుట్టింటికి వచ్చేసింది. అవధాన్లుగారు పంతంతో రామేశ్వరం, అటునుంచి కాశీ అని ఇల్లు విడిచి వెళ్ళారు. అమ్మడిలో మార్పొచ్చింది. అత్తింటికి, భర్త దగ్గరకి వెళ్ళాలన్న కోరిక బయట పెట్టింది. అన్నప్పగారికి కబురొచ్చింది. అందరూ అనుకున్నట్టు అమ్మడు భర్త రామశేషు వేరే కాపురం పెట్టలేదు. భర్తకి దూరమైన రంగడు పెళ్ళి చేసుకుని భర్తతో కాపురం చేస్తున్న మాట నిజమే కానీ, ఆ చేసుకున్నది రామశేషు కాదు. దాని భర్త చింతాలు. ఇక్కడ రంగడిదో గొప్ప కథ. ఆడదాని అంతరంగం ఎంతటి వాడికేనా అంత తేలిగ్గా అంతుపట్టదనటానికి ఓ ఉదాహరణ. దాని భర్త చింతాలుది అంతకన్నా గొప్ప కథ. ఈ దంపతుల మంచిచెడ్డే కాదు, కొత్తగా రూపుదిద్దుకున్న ఆ ఊరి మొత్తం బాధ్యత వహిస్తున్నది రామశేషు. రామశేషుకి మార్గదర్శకులు సీతారామాచార్లు, చింతాలు, రాజమ్మా, ఆ ఊరి చోటునంతా ఉమ్మడికి దఖలు పరిచిన మస్తానయ్య. ఆ ఊరు మల్లాదివారి సుందర స్వప్నం.

సమసమాజం సంప్రదాయబద్ధంగా సాకారం అవ్వాలన్న కాంక్షారూపం. అక్కడ అందరూ అన్నాదమ్ములే. శ్రమభేదాల్లేవు. శ్రమ అందరిదీ. పంట అందరిదీ. అందరిదీ అవటం వల్ల పంపకాలు లేవు. ఒకేరకం ఇళ్ళు. పెద్దాచిన్నా తేడాల్లేవు. పెద్దా చిన్నా తేడా అల్లా, పెద్దరికం అల్లా జ్ఞానంలోనే... ప్రేమ వితరణలోనే. వైద్యంకోసం, నలుగురి మేలుకోసం ఊపిరితీసే సీతారామాచార్లుగారు, ఆడమగా తేడాలేకుండా అందరికీ మంచిని రంగరించిపోసే రాజమ్మగారు, నీతికి నిలబడే సోములు, అండగా వెన్నంటి ఉండే సుబ్బన్న.. అదో ప్రపంచం. అదో సరికొత్త జీవన విధానం. ఇంతటి ఈ స్వర్గాన్ని అధిపతిలా అజమాయిషీ చేస్తున్న రామశేషుకి అమ్మడిని దగ్గర చెయ్యటానికి, అన్నప్పకు ఏ శ్రమా అక్కర్లేకపోయింది. పూనికే సరిపోయింది.

కళ్ళెదురుగా జరుగుతున్నట్టు సాగే ఈ కథలో కావాలనే మల్లాదివారు అభూత కల్పనేమో అనిపించే కల్పనల్ని(ఫాంటసీలను) జోడించారు. అవి పూర్తి నిరాధారమైనవి కావు. ఎంత కాదనుకున్నా, ప్రజల్లో కొన్ని నమ్మకాలు, విశ్వాసాలుంటాయి. అవి హేతుబద్ధమైన తర్కానికి వెలుపలే ఉండొచ్చు. అటువంటి వాటిని శాస్త్రిగారు కథకి జోడించటమే కాదు, అవీ అతి సహజమే అన్నట్టు చిత్రీకరించారు. వేగం అందుకోటానికి, వెనక్కి నాలుగడుగులు వేసి ముందుకు సాగినట్టు, వాస్తవాలకు బలమివ్వటానికి కల్పనని దాపెట్టినట్టు మల్లాది రామకృష్ణశాస్త్రి నవ్యరీతిని నిర్మించారు. కేవలం ఫాంటసీ అన్న మాట దీనికి సరిపోదు. లాక్షణికులు సరికొత్త పదాన్ని సూచించాలి.

ఈ నవల కథాపరిధికి ఆవల వున్న అద్భుత విషయాలు కొన్ని ఉన్నాయి. రామాయణం రామకథ కాదు.. సీతకథ. ఆ తల్లి ధర్మనిర్వహణ, తనవారి క్షేమకాంక్షల కథే అని అన్నప్ప దృఢంగా చెపుతుంటాడు. రామకథా? సీతకథా? అన్న వైరుధ్యాన్ని సృష్టించి శాస్త్రిగారే సమాధానపరచిన తీరు అత్యద్భుతం. 'సీతమ్మ కథే అనుకో.. మనం అమ్మా అన్నప్పుడల్లా నాన్నా అన్న రామయ్య నామం ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది' అని సీతారామాచార్లుగారిచేత చెప్పించారు.

సూటిగా మాట్లాట్టం అన్ని వేళలా మార్గం కాదు. నర్మగర్భంగా మాట్లాటం, అవసరాన్ని బట్టి భారత భాగవత కథలేకాదు, ఇతర చిన్న కథలతోటి కథ నడిపించి వ్యవహారం సానుకూలపరచుకునే కిటుకు కృష్ణాతీరంలో వుంది.

కృష్ణాతీరం కొన్ని కథలహారం. పూసల్లాంటి ఆ కథలకి అన్నప్ప దారమైతే రామకృష్ణశాస్త్రిగారు ముడి. కృష్ణాతీరానికి అలంకారం ఈ దండు. ఒకే కంచంలో ప్రపంచ రుచులన్నీ కూర్చినట్టు వెలసిన నవల ఇది. ఇటువంటి శైలి, శిల్పం వున్న నవల తెలుగులోనే కాదు, మరెక్కడా ఉండదు. ఎందుకంటే ఓ సంప్రదాయం, ఓ జీవన శైలి, ఓ గొప్పదేశపు సంస్కృతి సాధించగలి

గిన అత్యున్నత జీవన నాణ్యతని ఈ నవలలో తన శైలీ, శిల్పాలుగా మూసపోశారు శాస్త్రిగారు.

కృష్ణాతీరం సంభాషణలలో, వ్యక్తిత్వాలలో జీవితాన్ని నిర్వచించే శాశ్వత సత్యాలెన్నో ఉన్నాయి.

'మనిషి మనిషికి చేసేది లోటు, దేవుడు చిన్న చూపు చూస్తే అదిలోపం'

'చిత్తశుద్ధి, సదాచారం, వినయం, వివేకం- బ్రాహ్మణ లక్షణాలు.. అంతేకాని ఫలానా యింట్లో పుట్టటం కాదు'

'దేవాదిదేవుడే కాని, దేశవాళీ మనుషులే కానీ ఎదుటివారి మేలెంచకబోతే తమపిల్లా పాపలతో చల్లగా ఉండటమనేది కల్ల'

'కాస్త పచ్చగా వున్నవాళ్లు కాలు జారితేనో, నోరు జారితేనో వెక్కిరించనివాడు- నూటికో, కోటికో'

'ఎప్పుడో అప్పుడు పెద్దవాళ్ళకు మతిపోవటం సహజమే, అలాగే పిల్లలకు బుద్ధి తెలియడ మున్నూ..'

ఇలాంటివి కృష్ణాతీరంలో ఎన్నెన్నో.

సంసారం, సంస్కృతీ గురించి చెపుతూ, ఇంతగా ఆహ్లాదం కూర్చగలిగే రచయిత మరొకరు లేరు.

వైద్యం వృత్తి కాదు, ఓ జీవనవిధానం అనిపించే రామాచార్లు గారి అద్భుత సృష్టి, దేవతలు కూడా మురిసిపోయే భూలోకపు అందాలు- ఆనందించాలనుకుంటే ఈ లోకం ఎంత ఎక్కువదో చెప్పటం.

భూ తగువులో స్వార్థానికి పోయిన బ్రాహ్మలని, మంగలి తాసిల్దారు హెచ్చరించిన చోట కడుపు పగిలేలా వచ్చే నవ్వు .. ఇలా కృష్ణాతీరం నవల పేజీ పేజీకో రుచి! మాటమాటకో అభిరుచి. తెలుగుదనం ఆస్వాదించాలంటే, జాను తెనుగు రుచి తెలియాలంటే చదవాల్సిన నవలిది.

కథలోంచి కథకి, అక్కడ్నించి మళ్ళీ ఇక్కడి మనుషుల దగ్గరికి... అక్కడి ముచ్చట్ల పోలికతో ఇక్కడి పాత్రల జీవితంలో నవ్వులు పండిస్తూ, ఈ నవలని ముగించిన తీరు అద్భుతం.

'మీరన్నట్టు రంగడు నవ్వుతూనే ఉంటుంది కదా! ఆ నవ్వులోనే మాయమైతే నాబతుకేంటి?' అంటాడు చింతాలు భార్యరంగడి గురించి, అన్నప్పతో.

'ఆ నవ్వంటే నువ్వే' అంటాడు అన్నప్ప.

ఈ నవలలో ప్రధాన పాత్రల కన్నా ఉప పాత్రల బలం ఎక్కువ. రంగడు అద్భుత పాత్ర. తన పాత్రే ఓ నవలవుతుంది. అంతకు మించినవాడు చింతాలు, రామాచార్లుగారు, మస్తాన్, రాజమ్మగారు. అందుకే ఈ నవలకి ఇతిహాసచ్ఛాయ.

చిదంబరం, అన్నప్పల స్నేహం అపురూపం. జీవితం నిస్సారంగా అనిపిస్తూ, స్నేహాలు కరువైపోతున్న ఈ రోజుల్లో అటువంటి చిత్రణ అమృత సమానం.

బ్రాహ్మల పట్టుదలలు, అహంకారాలు, మౌఢ్యం, ఎందరెందరో అక్షరబద్ధం చేశారు. కానీ ఆచారం వారికి ఆలంబనే అని, వాళ్ళ మనసులు ఎంతో మెత్తనని, మంచి కోసం.. మనిషి తనం కోసం దేనికైనా సిద్ధపడే ఉదాత్తతని.. తద్వారా ఎందరెందరి జీవితాలకి ఎంత ఆనందమో, ఎన్ని తరాలకి అది ఎంతటి ఉదాత్తమార్గమో తెలిపింది మాత్రం రామకృష్ణశాస్త్రి గారే.. పెద్ద పీట వారికే.

వృద్ధాప్యపు వయసు పోకడలని రామకృష్ణశాస్త్రి గారే రాయాలి.

చేతలు నెమ్మదించినా... ముదిమిలోని గత మురిపాలు, మాటల ముచ్చట్లు, పులకరింతల సయ్యాటలు కృష్ణాతీరంలోనూ ఉన్నాయి.

మనసు, మాట ఆరోగ్యంగా ఉండాలే గానీ, బతుకంతా జీవించగలమని నిక్కచ్చిగా చెప్పిన అద్భుత నిజాలు వారి రచనలు. ఇది మల్లాది రామకృష్ణశాస్త్రి గారికే చెల్లింది. ఆ మనిషికి, ఆ రచనకి సాగిలపడటమే మనం చెల్లించుకోగల కృతజ్ఞత.

**– వి. రాజారామమోహనరావు**

## కథా-నవలా సవ్యసాచి



**వి.** రాజారామమోహన రావు మంచి రచయితే కాదు, విమర్శలోను సిద్ధహస్తులు. రెండొందలకు పైగా కథలు, పదిహేడు నవలలు రచించారు. మూడు నవలలు, ముప్పై కథలు ఇతర భాషల్లోకి అనువదితమయ్యాయి. వివిధ పోటీల్లో కథలకి, నవలలకి ఇరవైకి పైగా బహుమతులు అందుకున్నారు. వీరి 'చేదోడు' కథకి గురజాడ 150వ జయంతి స్మారక పురస్కారం లభించింది. కథాసంపుటాలను మరెన్నో పురస్కారాలు వరించాయి. ఇప్పుడు చతురలో 'నవలావలోకనం' శీర్షికన ప్రసిద్ధ భారతీయ నవలల విమర్శనాత్మక పరిచయం చేయడానికి పూనుకున్నారు.

–సం.




# ఈ ఏడాది బుకర్ విజేత ఎలీనర్!

'ది లూమినరీస్' నవలకు న్యూజిలాండ్‌కు చెందిన ఎలీనర్ క్యాటన్ ఈ ఏడాది మ్యాన్ బుకర్ ప్రైజ్ అందుకొని మూడు రికార్డులు సృష్టించింది. నలభైఐదేళ్ల బుకర్ చరిత్రలో గెలుపొందిన అతి పిన్న వయస్కురాలు ఈమే. అంతేకాదు, బుకర్ చరిత్రలో అతి పెద్ద నవల కూడా ఈమెదే (852 పేజీలు). ఇప్పటివరకూ కామన్‌వెల్త్, ఐర్లాండ్ దేశాలకు మాత్రమే పరిమితమైన బుకర్ అవార్డుకి ఈమె చివరి విజేత. 2014 నుంచి బుకర్ పోటీలో నోబెల్‌లానే ప్రపంచంలోని అన్ని దేశాల రచయితలు పాల్గొనవచ్చు.

బుకర్ ప్రైజ్ ఆ సంవత్సరం ప్రచురించిన అత్యుత్తమ ఆంగ్లనవలకు ఇస్తారు. గెలుపొందిన పుస్తకానికి అమ్మకాలు అసాధారణంగా పెరుగుతాయి విజేతకు 50,000 పౌండ్లతో బాటు తొలి దశలో పరిశీలకు ఎంపిక అయినందుకు ఇచ్చే 2500 పౌండ్లు, డిజైనర్ బౌండ్ చేసిన తన నవల ప్రతి లభిస్తాయి. ఈ అక్టోబరు 15న బుకర్ విజేతగా ఎలీనర్‌ను ప్రకటించారు. డచెస్ ఆఫ్ కార్న్‌వాల్ కామిల్లా చేతుల మీదుగా ఆమె ఈ బహుమతి అందుకుంది. ఆ సందర్భంలో ఆమె "రచయితల మూలాల గురించి కాకుండా వారి రచనలను గౌరవించే ప్రపంచంలో బతుకుతున్నందుకు నాకు చాలా గర్వంగా ఉంది. బొత్తిగా వాణిజ్యాంశాలతో రాయమని ఆంక్షలు పెట్టకుండా నాకు స్వేచ్ఛనిచ్చిన నా ప్రచురణకర్తలకు ధన్యవాదాలు" అంది. న్యూజిలాండ్‌లో తమ ఇంట్లో టీవీ లేదని, కాబట్టి తల్లిదండ్రులు సన్మానకార్యక్రమాన్ని చూడలేరని చెప్పింది. ఎలీనర్ క్యాటన్ తన తండ్రి కెనడాలో డాక్టరేట్ చేస్తున్నప్పుడు కెనడాలోనే పుట్టింది. ఆరేళ్ళ వయసులో ఆమె కుటుంబం తిరిగి న్యూజిలాండ్ వెళ్ళిపోయింది. విక్టోరియా యూనివర్సిటీలో క్రియేటివ్ రైటింగ్‌లో ఆమె మాస్టర్స్‌డిగ్రీ పొందింది. 2009లో 'ఈ ఏటి కాల్పనిక సాహిత్యానికి పసిడి బొమ్మ' అని మెప్పు పొందింది. ఆమె ప్రస్తుతం ఆక్‌ల్యాండ్‌లోని మనుకో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో సృజనాత్మక రచనా విధానాన్ని బోధిస్తోంది. బుకర్‌తో బాటు ఎన్నో అవార్డులు అందుకుంది.

## నవలలో ఏముంది?

'ది లూమినరీస్' ఒక క్రైమ్ నవల. కథాకాలం 1866. వాల్టర్ మూడీ న్యూజీలాండ్ బంగారు గనుల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి వస్తాడు. అక్కడ కొంతమంది అపరిష్కృత కేసుల గురించి రహస్యంగా మాట్లాడుకుంటుంటే వింటాడు. ఒక ధనవంతుడు మాయమయ్యాడు, ఒక వేశ్య ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. ఒక పేద తాగుబోతు ఇంట్లో అపారమైన ధనరాశి దొరికింది. మూడీ ఈ ఉచ్చులో చిక్కుకుపోతాడు. నవల్లో అంతర్లీనంగా జ్యోతిషశాస్త్రం ఉంటుంది. ప్రతి పాత్ర తన గతంలోంచి బయటపడలేక ధనాశ, విధిరాతల మధ్య ఊగిసలాడుతూ ఉంటుంది. ఎంతో ఉత్కంఠగా సాగిపోతుంది చివరిదాకా.

ఆగస్టులో విడుదలైన ఈ నవలని 'పూర్తిగా చదవకుండా కింద పెట్టలేం' అని వర్ణించింది టెలిగ్రాఫ్ పత్రిక. ఆకాశంలో నక్షత్రాలు అల్లిబిల్లిగా పేర్చినట్టు కనిపించినా ఒక ఆధారం పట్టుకొని చూస్తే ఎంత పద్ధతిగా కనిపిస్తాయో అలా సంబంధం లేని సన్నివేశాలతో అద్భుతమైన కథ అల్లింది అని ప్రశంసల జల్లు కురిపించారు విమర్శకులు. న్యాయనిర్ణేతలు మూడుసార్లు చదివారట. "ప్రతీసారీ కొత్త విషయాలు స్ఫురింపజేసింది. ఆ తర్వాత విజేతని ఎంపిక చేయటానికి ఎక్కువ సమయం పట్టలేదు. నవల ఎన్ని పేజీలు ఉందనేదికాదు, అందులోని విషయం ఆసక్తిగా చదివిస్తుంది. ఇంత చిన్నవయసులో ఈమె ఇంత పరిణతి, సమన్వయంతో అర్థవంతంగా రాయడం మమ్మల్ని ఆశ్చర్యపరిచింది. ఈ నవలకు బహుమతి ప్రకటించడం చారిత్రక కాల్పనిక సాహిత్యానికి మేమిస్తున్న అరుదైన గౌరవం" అని అన్నారు న్యాయనిర్ణేతలు.

బుకర్ గెలుచుకున్న రెండో న్యూజిలాండర్ ఎలీనర్. ఈ నవల రాయడం మూడేళ్లకిందట మొదలు పెట్టింది. ఇది ఆమె రెండో నవలే. పోస్ట్ గ్రాడ్యుయేషన్ థీసిస్‌గా సమర్పించిన మొదటి నవలకూడా ఎన్నో అవార్డులకి ఎంపికైంది.

— హారిక

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**పి. సుజాత**
ఇ.నెం.26-28-65/5,
ఎ.టి.అగ్రహారం, 1వ లైన్,
2వ అడ్డరోడ్డు, గుంటూరు జిల్లా
పిన్: 522004

## చతురంగం - 31 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 రా | రా | 2 జు | | 3 శా | 4 ప | 5 వి | 6 మో | చ | 7 నం |
| జ | | 8 లై | 9 లా | | 10 ప | ర | స | | దు |
| 11 నా | 12 తి | | 13 భం | 14 డ | నం | | 15 కా | 16 ము | డు |
| 17 ల | ల | 18 న | | పు | | 19 గ | రి | క | |
| | 20 కం | ట | 21 కం | | 22 నా | ది | | 23 పి | 24 త |
| 25 క | | 26 న | కు | 27 లు | డు | | 28 సా | | గ |
| 29 ల | 30 క | | 31 భ | వా | | 32 మ | ధు | 33 క | రం |
| 34 రా | వి | 35 చె | ట్టు | | 36 అ | హి | | థ | |
| | 37 త | పు | | 38 అ | ను | మ | 39 తి | | 40 మే |
| 41 తే | లు | | 42 సె | ల | వు | | 43 రం | ధ్ర | ము |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 2. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 3. వెలసిరి మధుసూదన్, నల్గొండ, 4. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 5. జె. రమాదేవి, రామంతాపూర్, 6. ధరణి పద్మాసన, డి.డి. కాలని, హైదరాబాద్, 7. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 8. తిప్పావఝుల వెంకటనారాయణ, మల్కాజిగిరి, 9. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 10. కె.వి.జె. దాస్, మైలార్‌గడ్డ, సికింద్రాబాద్, 11. ఇ.యల్. నరసింహారావు, మధిర, ఖమ్మం జిల్లా, 12. సిహెచ్. కోటయ్యశాస్త్రి, కాకినాడ, 13. ఇందన మల్లికార్జున్ రావు, ఏలూరు, 14. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డెపల్లి, వరంగల్ జిల్లా, 15. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 16. డా. శివభూషణం, కర్నూలు, 17. గేదెల రామారావు, ఏలూరు, 18. పరాయితం వెంకటేశ్వర శర్మ, బళ్ళారి, 19. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 20. శిష్టా పద్మానవీన్, జనగాం, వరంగల్ జిల్లా, 21. గరికిపాటి ఇందిర, కాకినాడ, 22. నియాజ్ అలి, హైదర్‌గూడ, హైదరాబాద్, 23. పి. లక్ష్మీప్రసన్న, కూకట్‌పల్లి, 24. టి. చంద్రశేఖర్‌రెడ్డి, న్యూ బోయిన్‌పల్లి, హైదరాబాద్, 25. పి. ఆర్. నాయుడు, తిరుపతి, 26. వి.వి. సత్యనారయణశెట్టి, బైరాగిపట్టెడ, తిరుపతి, 27. అవధానం రంగనాథం, బెంగళూరు, 28. నెల్లుట్ల ప్రేమలత, నిజాంపేట, హైదరాబాద్, 29. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరాబాద్, 30. ఆర్. లక్ష్మి, మోతీనగర్, హైదరాబాద్, 31. చి.పు. శాస్త్రి, నిజామాబాద్, 32. అత్తిలి కస్తూరిభాయి, బైరాగిపట్టెడ, తిరుపతి, 33. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 34. కాశీభట్ల పద్మావతి, అనంతపురం, 35. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 36. టి. రమాదేవి, తార్నాక, 37. సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 38. పి.వి. రమణరావు, మల్కాజిగిరి, 39. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 40. పెద్దింటి శ్రావ్య, వనస్థలిపురం, 41. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 42. జి.బి.కె మూర్తి, బాపట్ల, 43. డి. కృష్ణకుమారి, ఎ.ఎస్.రావ్ నగర్, 44. పొణుకుమాటి లీలాప్రవీణ, కొత్తనాగులూరు, కృష్ణా జిల్లా, 45. మైలవరపు లలితకుమారి, గుంటూరు,46. ఎస్. నాగరాణి, కుప్పం, 47. జనమంచి సత్యవతి, సికింద్రాబాద్, 48. పి.వి. రమణరావు, విశాఖపట్నం, 49. టి.యస్. కళాధర్, గుంతకల్లు, 50. ఆర్. గురుప్రసాద్, ఎమ్మిగనూరు, 51. యు.ఎన్. మూర్తి, లాలాపేట, 52. బి.వి. రవికుమార్, తెనాలి, 53. టి. బాబూప్రసాద్, తిరుపతి, 54. భారతి, అనకాపల్లి, 55. ఆంధ్ర అచ్యుతరామయ్య, తణుకు, 56. తల్లాప్రగడ భాస్కరరావు, న్యూ నల్లకుంట, 57. జి. ప్రభాకర్ రావు, మల్లాపూర్, హైదరాబాద్, 58. జి.వి. రాఘవేంద్రరావు, మచిలీపట్నం, 59. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 60. పాతపాటి శశాంక్, బాలాజీనగర్, చిత్తూరు, 61. కె.ఇ. నిలమంగై, మల్కాజిగిరి, 62. బి.వి. నరసింహారావు, పేరాల, ప్రకాశం జిల్లా, 63. వారణాసి విజయలక్ష్మి, పొదగట్లపల్లి, తూ.గో. జిల్లా, 64. వంకాయల చిరంజీవి, రాజమండ్రి, 65. కె.యస్.వి. ప్రసాద్, పోరంకి, 66. పి. సరళ, మర్రిగూడ, నల్గొండ జిల్లా, 67. గుర్రాల ప్రదీప, కూర్మన్నపాలెం, 68. సూరినాగరాజు, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 69. కొక్కెరగడ్డ కామశాస్త్రి, మానేపల్లి, తూ.గో. జిల్లా, 70. పానుగోటి విజయలక్ష్మమ్మ, దుబ్బాక, నల్గొండ జిల్లా, 71. గౌతమి శిష్టా, హబ్సిగూడ, 72. వి.వి. సంఘమిత్ర, కర్నూలు, 73. ఎమ్. అరుణరేఖ, ఎల్.బి. నగర్, 74. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 75. కొత్తపల్లి సుధాదేవి, వుడ్

*(తరువాయి 128 లో..)*

# చతురంగం - 32 ఆధారాలు

**అడ్డం**

1. రవితేజ ఇటీవలి చిత్రం (3)
3. ఒడ్డు (3)
5. జనమే తిరగబడ్డారు (2)
7. దేవేంద్రుడి ఆస్థాన నర్తకి (2)
9. సంతానం (3)
10. శ్రీకృష్ణుని ప్రియురాలు (2)
12. నీరులా ప్రవహించేది (2)
14. 'పుష్యం' తరువాతి మాసం (2)
15. 'క్యాన్సిల్' కు తెలుగు (2)
16. 'ఆంధ్రా ప్యారిస్' అని ఈ పట్టణాన్ని అనేవారు (3)
18. రాజుల ఆవాసం, సుప్రసిద్ధ నటుడి ఇంటి పేరు (2)
19. ప్రాణం గలది (2)
20. దేవిక కుమార్తె (3)
21. అందరికీ — అవకాశాలు రావాలి (3)
22. పాదరక్ష (2)
23. ముద్దుగా నేర్పిస్తే వీరు ఏ విద్యలైనా నేర్చుకుంటారట (4)
25. 'మాయాబజారు'లో అల్లురామలింగయ్య జోడు, పి.వి. నరసింహారావు ఊరు (3)
28. వంద (2)
30. ఎండాకాలాన్ని ఇలా అంటారు (3)
32. యాదవుల నాశనానికి పుట్టింది (3)
35. తెలుగులో స్విచ్ (2)
36. తెలుగు సంవత్సరాల్లో 'యువ' తరువాతిది (2)
37. అడవి (3)
38. గ్రాసం (2)
39. గుర్రం (3)

**నిలువు**

1. హిందీలో మేక, బలిపశువును ఇలా అంటున్నారు (3)
2. పట్టణం (2)
4. శబ్దం (2)
5. రెండు (2)
6. 'ఈ దుర్యోధన దుశ్శాసన..' పాట ఈ చిత్రంలోనిదే (5)
8. ఇదీ రవితేజ సినిమా (2)
9. సమాజం (2)
11. భూమి (3)
13. వారధి (3)
14. తోట కాపలాదారు, పూల దండలు గుచ్చేవాడు (2)
17. స్వర్గం (3)
18. 'కోమా' బహువచనం (3)
19. వైభవం (3)
20. కాఫీ, టీ తాగేది దీంతో (2)
21. ఎల్లప్పుడు (4)
22. కారాగారం (2)
24. దిక్కు (2)
26. సింహాసనం (2)
27. ఒకే ధోరణిని ఇలా అంటారు (2)
29. తోక (2)
30. జంతువుల్ని వెంటాడి చంపడం (2)
31. బ్రహ్మ (3)
33. యుద్ధం (3)
34. వాసన (2)
35. చేప (2

*( 127 తరువాయి )*

నగర్, చీరాల, 76. పబ్బు నిరాలంబమూర్తి, బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా, 77. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 78. ఐ.బి. వత్సలరావు, చిలకలూరిపేట, 79. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, తూ.గో. జిల్లా 80. నారాయణ చైతన్య, ఉచ్చిలి, తూ.గో. జిల్లా, 81. పి.వి. సుబ్బలక్ష్మి, ఆటో నగర్, వైజాగ్, 82. ఈ. కృష్ణకుమారి, విజయవాడ, 83. టి.ఆర్. బాలకృష్ణరావు, రాజమండ్రి, 84. కందికుప్ప వెంకటరమణ, బెంగళూరు, 85. గెడ్డం రామస్వామి, వీరవరం, తూ.గో. జిల్లా, 86. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 87. గుర్రాల జయశ్రీ, గుంటూరు, 88. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 89. పక్కి సుందరీకృష్ణ, గరివిడి, విజయనగరం జిల్లా, 90. కోలా సత్యనారాయణ, విశాఖ, 91. కె. భానుమతీదేవి, వనస్థలిపురం, 92. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 93. ఆర్.వి.సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 94. పి.వి. రవికుమార్, తిరుపతి

# చతురంగం - 32

రూ.150/- బహుమతి

గడువు తేది : నవంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 | | ■ | 5 | 6 |
| | ■ | 7 | 8 | ■ | | ■ | 9 | | |
| 10 | 11 | ■ | 12 | 13 వం | ■ | 14 | | ■ | |
| ■ | 15 | | ■ | 16 | 17 | | ■ | 18 | |
| 19 | | ■ | 20 | | | ■ | 21 | | |
| | ■ | 22 | | ■ | 23 ము | 24 | | | ■ |
| 25 | 26 గ | | ■ | 27 | ■ | 28 | | ■ | 29 |
| ■ | | ■ | 30 | | 31 | ■ | 32 | 33 | |
| 34 | ■ | 35 మి | | ■ | 36 | | ■ | | ■ |
| 37 | | | ■ | 38 | | ■ | 39 | | |

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు ( ) చిరునామా : ----------------------------------

------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ----------------



## ఆధారాలు

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# సినీ స్టార్ కావాలనుకుంటున్నాను మమ్మీ!

'ఏమే పాపిష్టిదానా! ఇంటర్ తర్వాత ఇంజనీరింగో, మెడిసినో చెయ్యాలి గానీ డ్యాన్సు నేర్చుకునేం చేస్తావే?' కూతురు స్వాతిని అడిగింది హేమలత.

'డ్యాన్సంటే నాకిష్టం! నేను సినిమా స్టార్ కావాలనుకుంటున్నాను మమ్మీ! నాకు ఇంజనీరింగ్, మెడిసిన్.. ఇంట్రెస్ట్ లేదు' తన కోరికను తెలిపింది స్వాతి.

'ఏంటే..! నీకేమైనా పిచ్చెక్కిందా? సినిమా వేషాలేసే ఖర్మ నీకేం పట్టింది?'

'ఖర్మ ఏంటమ్మా! సినిమా స్టార్ అయితే ఎంత నేమ్ అండ్ ఫేమ్! కోట్లు ఇస్తారు తెలుసా?'

'ఈ మాట మీ డాడీతో అనేవ్.. పీకపిసికేస్తారు! పిచ్చి పిచ్చి వేషాలెయ్యకుండా కాలేజీ అవగానే తిన్నగా ఇంటికి తగలడు. డ్యాన్సుల పేరెత్తితే చంపుతా!' వార్నింగ్ ఇచ్చింది తల్లి.

స్వాతి సినిమా స్టార్ అయిందా? తన కోరికను నెరవేర్చుకునేందుకు ఆమె ఆడిన నాటకమేంటి? పిల్లల విచ్చల విడితనానికి, భార్యాభర్తల బంధంలో కల్లోలానికి కారణాలను విశ్లేషించిన వాణిశ్రీ నవల

**జారుడుమెట్లు**



చతుర
డిసెంబరు
కానుక

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. www.eenadu.net.

CHATURA Telugu Monthly, November 2013. Regd No. HD/965/2012-2014 RNI/32186/78